## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# తొలిపలుకు



"భరతఖండపు గ్రామస్థులకు సాక్రటీసుయొక్క సందేశము," అను నీ గ్రంథము గ్రంథకర్తకును వారికి కొన్ని సంవత్సరములుగ విశేష పరిచితులైనట్టి గర్గాఁ జిల్లాలోని గ్రామస్థులు కొందరికిని వాస్తవముగ జరిగిన సంభాషణయొక్క సంపుటీకరణమనియే నా నమ్మకము. దీనిని నేను అత్యంతమగు ఆదరభావముతో పఠించితిని. "గర్గాఁ ప్రక్రియ" అని పేరుగాంచిన ఈ యుద్యమము సంపూర్ణమగు విజయమును పొందవలయుననియే నేను భరతఖండముపట్ల కోరుచుండు శ్రేయస్సు.

ఈ గ్రంథము సులభగ్రాహ్యముగను పటుత్వముగను వ్రాయబడియున్నది. బ్రేయర్ (గ్రంథకర్త) చే ఆరోపింపబడిన నిందలోని సత్యము, అతని వాదమందలి యుక్తి నిర్దుష్టములైనవి. అతడు ఎవరిని నిర్దేశించి ఈ గ్రంథమును వ్రాసెనో ఆ గర్గాఁ గ్రామస్థులు నావలెనే దానిలోని సత్యమును గ్రహింతురని నమ్ముచున్నాను. కాని ఈ సందర్భమున మనము మరువతగని విషయమొకటి యున్నది. ఇంగ్లీషువాడు తెల్లనైనదని చెప్పు దానిని చైనాదేశస్థుడు నల్లనైనట్లు చెప్పుచుండుననియు, వీరిద్దరిలో ఒకరు చెప్పునదికూడ నిస్సందేహముగ సత్యమనిగాని అసత్యమనిగాని నొక్కి చెప్పుటకు వీలులేదనియు బహు చమత్కారముగను సార్థకముగను ఋజువుచేసిన లోడికిఁసఁయొక్క మాటలను, అతడు వర్ణించిన చైనాదేశస్థుని మనము జ్ఞాపక

ముంచుకోనవలెను. కావున ఉద్ధరణ మనునది బహు నెమ్మదిగ జరుగునట్టిది; అది క్రమమైన పద్ధతుల ననుసరించి నడుచు నట్లును దానికితగిన పునాది ఏర్పడునట్లును చేయుటయే మన యొక్క ముఖ్యోద్దేశమై యుండవలెను. అట్టి యుద్దేశమున్న ప్పుడే మనము చేయనెంచిన మార్పులు తమకు లాభకరములను మాట ప్రజలు గ్రహించి, ఉద్యమమును ప్రారంభించినవారు వెళ్లిపోయినతర్వాతకూడ దానిని కొనసాగించుటకు సంసిద్ధు లగుదురు.

మహాత్ముడగు సాక్రటీసునకు అతని సమకాలికులు ఉరి శిక్షను విధించిరనియు, తన అభిప్రాయములు సరియైనవనియు వారి అభిప్రాయములు సరికానివనియు స్పష్టముగను మాటి మాటికిని అతడు సూచించుటయే ఈ శిక్షకు కారణమయ్యె ననియు నాకు జ్ఞాపకమునకు వచ్చుచున్నది; కాని బ్రేయర్‌కు ఇట్టిగతి పట్టునను భయము నాకులేదు; ఏలననగా ఇతడును ఇతని భార్యయు శుష్కోపదేశముల చేయుటయందుమాత్రమే కాలమును గడుపక, తాము చెప్పినదంతయు సామాన్య గ్రామ స్థులుకూడ ఆచరణయందుంచుటకు వీలైనదని చేసి చూపి ఋజువు చేయగలిగిరి. భరతఖండమందలి ఇతర ప్రదేశములలోకూడ కొన్నిటియందు గొప్ప రైతుల ప్రోద్బలముచేతను మరికొన్నిటి యందు సహకారసంఘములు లోనగు సంస్థల ప్రోద్బలము చేతను ఈ యుద్యమము కొనసాగుచుండుట చూచి నేనెంతో సంతోషపడుచున్నాను. తమయొక్క ఐశ్వర్యము సౌఖ్యము వృద్ధియగుటకు కావలసిన సదుపాయములు తమ చేతులలోనే ఉన్నవను నమ్మకము భరతఖండమందలి వ్యవసాయదార్లలో నుత్పత్తియైనయెడల, భారతీయుల జీవిత సౌధమును పునర్నిర్మా

ణముచేయుటకై చేయబడుచుండు మహాప్రయత్నములు చాల వరకు కొనసాగినవని చెప్పుటకు నేనెంతమాత్రము సంశయింప జాలను.

ఈ పునర్నిర్మాణ ప్రయత్నము సఫలమగుటకు కావలసిన మార్గమును ఈ గ్రంథము తేటతెల్లముగ వివరించుచున్నది; భరతఖండమందలి రైతుల శ్రేయస్సును అభిలషించు ప్రతి మనుష్యుడును దీనిని చదువవలయునని నేను నొక్కి చెప్పు చున్నాను.

1929 సం॥ జనవరి 21-వ తేది. ఇర్విన్.

# గ్రంథకర్త పీఠిక



సొక్రటీసు మర్యాదయన నేమియో తెలియని వృద్ధుడు. అతని వెంట్రు కలు నెరసియుండినను అతని రూపము పూజ్యార్హమైనదిగ గన్పించుచుండినను గ్రామస్థులతనిని కొట్టియో తిట్టియో లేక వారి గ్రామములనుండి తరుమ గొట్టియో యుందురు; కాని ఇట్టి దుర్దశ అతనికి పట్టకుండుటకు అతని యుద్దేశములందలి కృత్రిమ రాహిత్యమును మొగమోటములేని అతని మాటలయందలి సత్యమును కారణములయ్యెను.

నిద్రనుండి మనలనులేపి మన నిజస్థితి ఇట్టిదనిచెప్పుటకు సొక్రటీసు వంటివాడొకడును జోరీగవంటి అట్టివాని వాగ్ధాటియు కావలసియున్నవి. పల్లెటూరు పిల్లవానిని మాలిన్య మావరించియున్నట్లు మనలను కపట మావరించి యున్నది. గ్రామస్థుడు తన పిల్లల అశుభ్రతను రోగమును ఆభరణములచే దాచియుంచునట్లు మనము మన లోపములను అసంగతములగు మెత్తని మాటల చేతను కపటబుద్ధిచేతను కప్పిపెట్టియున్నాము.

సొక్రటీసు దీనినేమాత్రము సహించువాడుకాడు. ఉన్నది ఉన్నట్లు చెప్పుట అతనికి స్వభావము. తాను వెళ్లిన గ్రామములను మంచిస్థితికి తేవలయు ననుటయే అతనిపట్టు; ఆ పట్టుదల చాలవరకు సఫలమైనదనికూడ చెప్ప వచ్చును. అతడు చెప్పిన పెంటగుంటలు సర్వసాధారణములగుచున్నవి; అనేక గ్రామములందు అతడు సూచించిన మరుగుదొడ్లు కట్టబడుచున్నవి; అతని సలహాప్రకారము వివాహములను రిజిష్టరుచేయు పద్ధతి అంతటను వ్యాపించుచున్నది; నగలు, అంటుజోళ్లు తగ్గిపోవుచున్నవి. ముఖవికాసమును వెదజల్లు బాలభటులు, మొగపిల్లల బడులలో చదువుచుండు ఆడుపిల్లలు, టీకాలు మొదలగు నూదిమందుల ఉపయోగించువారు, పర్షియన్ రాట్నములు, ఇనుప నాగళ్లు, 8 ఎ. గోధుమవిత్తనములు, క్రొత్తరకపు చెఱకుగడలు, వేలకొద్ది పర పతిసంఘములు, వానిలోని ఇరువదియైదులక్షల మూలధనము, ప్రదర్శనములు, భజనగోష్టులు, నాటకములు, బొమ్మలతోగూడిన ఉపన్యాసములు, పల్లెటూరి బడి, ఇంటిబడి, హిస్సారుజాతి ఎద్దును, స్త్రీల యుద్యానవనము, స్త్రీ సమాజము, పిల్లల ఆటలు, స్త్రీ పురుషుల టెన్నిసుసంఘము - ఇవన్నియు సొక్రటీసుమూల మున గలిగిన పురోభివృద్ధిసూచకములు. ఇవిగాక మరెన్నియో యున్నవి; వాటినన్నిటిని చెప్పుట కష్టము. వీటి అన్నిటికంటెను ముఖ్యమైన మార్పు

మఱియొకటి కలదు. జిల్లా అంతయు మేలుకొనియున్నది; క్రొత్తవిషయముల గురించి వినవలెననియు, క్రొత్త ప్రయత్నములచేసి చూడవలెననియు, ప్రస్తుతపు పరిస్థితులను చక్కజేసికొనవలెననియు ప్రజలయందు నపరిమితోత్సాహము పుట్టియున్నది.

సాక్రటీసు విసుగుపుట్టించువాడు; అతని సంభాషణము తేటతెల్లము; చెప్పినదే మరిమరి చెప్పువాడు. ఇది అతనికి నైజమైపోయినది. తాను కనిన లోపములను పోగొట్టుటకై అతడు సూచించిన ఉపాయములు కడు సులభసాధ్యములు. కాని ప్రజలు వాటిని గమనించుటకుపూర్వము వివిధ సందర్భముల ననుసరించి మాటిమాటికి చెవులు తూటుబడునట్లు చెప్పవలసియున్నది. ఒక్కొక్కప్పుడు గ్రామస్థులయందు చలనము కలిగించుటకై మోటుగను నాగరికతా విహీనునివలెను అతడు మాటలాడక తప్పినదికాదు. కాని గ్రామస్థులు కోపిష్ఠులైనను వారి హృదయము మృదువైనదగుటచే సాక్రటీసుయొక్క కఠిన వాక్యములను వారు మన్నించుచుండిరి.

ఈ గ్రంథమందు కనుపించు యుక్తులన్నిటిని గ్రామస్థులతో గావించిన ప్రసంగములందును, సంభాషణములందును సాక్రటీసు వందలకొలది పర్యాయములు వాడియుండెను.

సాక్రటీసుయొక్క ముఖ్యోద్దేశము గ్రామస్థులను ఆలోచనపరులుగ చేయుటయే. ప్రపంచమంతయు మార్పుగాంచుచున్నది; ఒకప్పుడు మంచివిగను నిరపాయములుగనుండిన ఆచారములు ఇప్పుడు అపాయకరములుగను, వినాశకారులుగను ఉన్నవి. మన ఆచారములను సాంప్రదాయములను చక్కగ విమర్శించి, ప్రస్తుత పరిస్థితులలో అవి మన ఆరోగ్యమును, సౌఖ్యమును, క్షేమమును, ఆదాయమును వృద్ధిపరచగలిగియున్నవాయని మనమాలోచించి చూడవలెను. మంచి ఆచారములను తప్పక అనుసరించవలసినదే; ఎన్ని కష్టములువచ్చినను అట్టివానిని విడనాడకూడదు. కాని చెడ్డవానినిమాత్రము నిర్మూలముచేసి తీరవలెను. మనకు మేలునుచేయు క్రొత్తపద్ధతులను మన మవలంబించవలెను. ఇది జరుగునెడల తాను పడిన శ్రమ నిష్ఫలముకాలేదని సాక్రటీసు భావించును; గ్రామస్థులుకూడ తమ విషయమై అతడొక్కొక్కప్పుడు కఠినముగ మాటలాడెనని విచారపడజాలరు.

వెస్టువుడ్. గ్రేట్ రైబర్గు, నార్ఫక్,
జూన్, 1928.

ఎఫ్. ఎల్. బి.

# విషయసూచిక

# సాక్రటీసుయొక్క సందేశము

## నాలుగు పనులు

ఒకదినము సాక్రటీసు నెల్లూరు *జిల్లాలోని యొక గ్రామమునకు వెళ్లి వీధిలోనుండిన కొందరి గ్రామస్థులజూచి మీరెవరని వారిని ప్రశ్నింపగా మేము రైతులమని వారు జవాబు చెప్పిరి.

సాక్రటీసు అటునిటు నాలుగువైపులజూడగా అతని కంటికి పెంటయు పేదటికమునుదప్ప మరేదియు కనబడలేదు. (నీటివసతులులేని మెట్టగ్రామమగుటచే సాధారణముగ నచట పంటలు నష్టమగుచుండెను) గనుక నతడు తన అలవాటు చొప్పున ప్రశ్నలవేయ నారంభించెను.

సాక్రటీసు.—రైతు అనగా భూమినుండి లాభము సంపాదించు మనుష్యుడుగదా?

గ్రామస్థుడు.—అవును. నిజమే.

సాక్రటీసు.—అట్లైన నీవు ధనవంతుడవుగదా?

గ్రామస్థుడు.—కానేకాను. ఎంత తెలివిమాలిన ప్రశ్న వేసితివి? ఓయి ముసలితాతా! (సాక్రటీసును వారింకను గుర్తు పట్టలేదు.)

సాక్రటీసు.—అట్లైన రైతులని మీరు నాతో చెప్పటలో పొరపాటుపడితిరని తోచుచున్నది.

---

* మూలమందు 'గర్గాణ్' జిల్లా అనియున్నది. అక్కడి పరిస్థితులకును మన పరిస్థితులకును భేదముండుటచే అక్కడక్కడ కొన్నిమార్పుల గావించితివి.

గ్రామస్థుడు.—(సాక్రటీసును గుర్తుపట్టి కొంచెము సిగ్గుపడి.) సాక్రటీసుగారూ మమ్ములను క్షమింపవలెను. తెలివిమాలి, రైతులమని చెప్పుకొనుటలో మేమే పొరపడితిమి.

సాక్రటీసు ప్రశ్నలువేయుచుండ గ్రామస్థులు మరింత జాగరూకతతో జవాబుచెప్పదొడగిరి.

సాక్రటీసు.—మీరు రైతులుకానియెడల మీరెవరు?

గ్రామస్థుడు.—అయ్యా మేము మనుష్యమాత్రులము.

సాక్రటీసు.—ఆలాగా? తప్పక మీరు మనుష్యులే. కాని, మనుష్యులు తక్కిన జంతువులకంటె ఉత్తములుగదా?

గ్రామస్థుడు.—దానికి సందేహమేమి? ఉత్తములే. (అప్పుడే మురికిపిల్లవాడొకడు పరిశుభ్రమైన కుక్కపిల్ల నొకదానితో నాడుకొనుచుండుటను సాక్రటీసు చూచెను.)

సాక్రటీసు.—ఆ పిల్లవాడెంత అసహ్యముగనున్నాడు.

గ్రామస్థుడు.—అవును. ఈ గ్రామములలో మా పిల్లలకు నీళ్లుపోయుట మిక్కిలి అరుదు. మేము కడుదరిద్రులము. పిడకలపెట్టుట, పిండివిసరుట, వంటచేయుట—మొదలగు పనులతో మా ఆడువాండ్రకు సరిపోవుచున్నది. పిల్లలకు నీళ్లు పోయుట మొదలగు విలాసములకు వారికి వ్యవధియే లేదు.

సాక్రటీసు.—ఆ కుక్కపిల్ల మిక్కిలి శుభ్రముగనున్నది కదా?

గ్రామస్థుడు.—అవును. దానితల్లి దినమున కనేకపర్యాయములు దాని శరీరమునంతయు నాకుచున్నది. అందుచే మాలిన్యమనునది లేక అది కడుశుభ్రముగనున్నది.

సాక్రటీసు.—అయ్యా, మనుష్యులు జంతువులకంటె నుత్తములని ఇంతకుముందే మీరు చెప్పియుంటిరిగదా? మురికిపిల్లవాడు శుభ్రమగు కుక్కపిల్లకంటె నుత్తముడగునా?

గ్రామస్థుడు.—పొరపడితిమి. క్షమింపవలెను. శుభ్రతలో మాత్రము మేము జంతువులకంటె నుత్తములము కాము.

సాక్రటీసు.—దానికేమిగాని మనుష్యులు అక్షరజ్ఞానము కలవారుగదా? జంతువులకు చదువురాదుగదా?

గ్రామస్థుడు.—(తొందరపాటుతో) తప్పక అట్లే. మనుష్యులు చదువగలరు; వ్రాయగలరు. వారివద్ద నెన్నియో పుస్తకములు గలవు.

సాక్రటీసు.—(అట్లైన) నీవు చదువగలవా?

గ్రామస్థుడు.—చదువలేను.

సాక్రటీసు.—(మరియొకనినిచూచి) నీవు చదువగలవా?

రెండవ గ్రామస్థుడు.—లేను.

సాక్రటీసు. — (ఇంకొకనినిచూచి) నీవు చదువగలవా? మూడవవాడు. చదువలేను.

సాక్రటీసు.—అయ్యా, మీరందరు మనుష్యులమనిగదా ఇప్పుడు సెలవిచ్చితిరి.

గ్రామస్థుడు.—క్షమింపుడు. మేము జడులము, పశువులము. నిజముగ పశువులము.

సాక్రటీసు.—పశువులు వాటి దూడలను శుభ్రముగ నుంచుకొనుచున్నవి. మీరది చేయుటలేదు. మీరు పశువులెట్లు కాగలరు.

గ్రామస్థుడు.—అయ్యా, ఏమి చెప్పుటకును తోచలేదు. ఏమిచేయగలము.

సాక్రటీసు.—మంచిది. నిజముగ మనుష్యులను పేరునకు మీరు తగినవారు కావలసినయెడల మొట్టమొదట మీరు చేయవలసిన పనియొకటియున్నది. మీ గ్రామమును మీ పిల్లలను

మీరు శుభ్రముగ నుంచుకొనవలెను. గ్రామముచుట్టు ఆరడుగుల లోతుగల గాడి నొకదానిని త్రవ్వి పెంటనంతయు దానిలో పోయవలెను. లేశముకూడ వీధులలో నుంచకూడదు. గ్రామమును శుభ్రపరచుట కిదియే మార్గము. ప్రతిదినము మీ పిల్లల స్నానముచేయింపవలెను.

గ్రామస్థుడు.—అయ్యా, తప్పక అట్లే చేసెదము. ఒట్టు పెట్టుకొనుచున్నాము.

ఈ విధముగ వారితో మాటలాడుచు సాక్రటీసు కొంత దూరము నడిచెను. ఇంతలో నతడు చేసిన యుపదేశమును వారు మరచిరి. ఆ సమయమున పేడపురుగొకటి పేడయుండ నొకదానిని తన బొక్క (కన్నము) లోనికి తోయుచుండుటను వారు చూచిరి. గ్రామస్థుడొకడు నవ్వుచు, "అయ్యా, ఈ పురుగును చూచితిరా? ఎంత తుచ్ఛమైనది! భగవంతుడిట్టి నీచపుజీవి నెందుకు సృజించెనో" అని నవ్వుచు ననెను.

సాక్రటీసు.—నిజముగ భగవంతునిచర్య లద్భుతములే. ఈ పురుగు పేడతో ఉండలుచేసి దాని బొక్కలోనికి వానిని తోయుచు వెలుతురుగాని గాలిగాని లేని చీకటికన్నములో కాపురముచేయుచున్నది.

గ్రామస్థుడు.—సందేహమేమి. ఈ తుచ్ఛజీవి అట్టిదే.

సాక్రటీసు.—అయ్యా, మీ ఆడువాండ్రు పేడతో పిడకలు పెట్టుటలేదా? పిడకలపెట్టుటకు వెళ్లినపుడు పిల్లలనుకూడా తీసికొనిపోవుచుందురు గదా? అప్పుడు మీ పిల్లలు పేడలోను, పిడకలలోను ఆడుకొనుటలేదా?

గ్రామస్థుడు.—పాలుకాచుటకును, కుంపటిలోనికిని పిడకలెంతో ఆవశ్యకములు.

సాక్రటీసు.—నేనడిగినదది కాదు. ఈ యావశ్యకతగురించి మరియొక సమయమున మాటలాడెదనులే. మీ ఆడువాండ్రు పిడకల పెట్టుటలేదాయని మాత్రమే నేనిప్పుడడుగుచున్నాను.

గ్రామస్థుడు.—(కొంచెము సందేహించుచు) నిజమే.

సాక్రటీసు.—అయ్యా, మీరు కాపురముండు ఈ మట్టి యిండ్లలో కిటికీలేమైనను న్నవా?

గ్రామస్థుడు.—మాకు దొంగలవలని భయముకలదు.

సాక్రటీసు.—నేనడిగినదది కాదు. ప్రతిమనుష్యుడు వాని యింటిలో కిటికీలుంచుకొనినప్పటికిని మీరేమో ఇప్పుడెట్లు న్నారో అట్లేయుందురు; దొంగలసంఖ్య హెచ్చుజాలదు. ఇది గాక, దొంగలు మీ యిండ్లకెందుకు వచ్చుచున్నారో ఆ విషయమై నేను చెప్పవలసినది చాల ఉన్నది. కాని, మీ యిండ్లకు కిటికీలున్నవా అని మాత్రమే నేనిప్పుడడిగితిని.

గ్రామస్థుడు.—కిటికీలు లేవు.

సాక్రటీసు.—అట్లైన మీ యిండ్లు చీకటిమయములు గదా?

గ్రామస్థుడు.—అవును.

సాక్రటీసు.—గనుక మీరు పేడతో పిడకలు పెట్టుచున్నారు; గాలియు వెలుతురులేనియిండ్లలో కాపురముచేయుచున్నారు. ఇట్టి సందర్భములో పేడపురుగులకంటె మీరెట్లు ఉత్తములెట్లగుదురు.

గ్రామస్థుడు.—ఉత్తములము కానట్లే తోచుచున్నది.

సాక్రటీసు.—మీరు మనుష్యులనిపించుకొనుటకు, మీరు మీ గ్రామమును పిల్లలను శుభ్రపరచుటమాత్రము చాలదు. పిడకలపెట్టుటను మీరు మానవలెను. మీ యిండ్లకు కిటికీలు పెట్టుకొనవలెను.

గ్రామస్థుడు.—అయ్యా, మీరు చెప్పునదంతయు సత్యమని మేమంగీకరించుచున్నాము.

ఇట్లు వారందరు మాటలాడుచు నడుచుచుండగా ఒక ఆడుకుక్క దానిపిల్లలు ఆరింటిని (మూడు మగపిల్లలు మూడు ఆడువి) నాకుచు, వానికన్నిటికి పాలిచ్చుచుండుటను వారు చూచిరి.

గ్రామస్థులలో నొకడొక కఱ్ఱనుతీసికొని దానిపై విసరి దారినుండి దానిని తొలగించుటకై ఒక పెద్ద కేకవేసెను.

సాక్రటీసు.—(వానినిచూచి) అట్లు చేయకుము. కొన్ని విషయములలో మనుష్యులకంటె ఈ కుక్కయే మేలైనట్లు తోచుచున్నది.

ఈ మాటలను విని గ్రామస్థులు కొంచెము విసుగుకొనిరి; కాని సాక్రటీసు మహాత్ముని వాదధాటికి భయపడి వారేమియు చెప్పరైరి.

తర్వాత, వారందరు గ్రామపాఠశాలవద్దకు రాగా దాని యందు ముప్పదిమంది బాలురు పాఠముల చదువుచుండిరి. కొంతసేపటివరకు సాక్రటీసున కేమియు తోచలేదు. తర్వాత అతడు, "ఈ గ్రామములో ఆడుపిల్లలు లేనేలేరా" అని అడిగెను.

గ్రామస్థుడు.—లేక ఏమి? ఎందరు మగపిల్లలున్నారో అందరు ఆడుపిల్లలున్నారు.

సాక్రటీసు.—అట్లైన ముప్పదిమంది ఆడుపిల్లలు ఈ బడి యందు కనబడుట లేదే?

గ్రామస్థుడు.—(నవ్వుచు) లేదు. నిజమే. ఆడుపిల్లలు చదువరు. చదువు మగవారికే.

సాక్రటీసు.—అనగా, మీరు మగపిల్లలను, ఆడుపిల్లలను వేరువేరు విధముగ చూచుచున్నారు.

గ్రామస్థుడు. — కాకేమి? ఆడుపిల్ల లెవరికి కావలెను? లెక్కకువచ్చువారు మగపిల్లలుమాత్రమే.

సాక్రటీసు.—అయితే వీరు (ఆడుపిల్లలు మగవారు) ఒకే తలిదండ్రుల కడుపునపుట్టినవారు గదా?

గ్రామస్థుడు.—అవును.

సాక్రటీసు.—వీరు (ఆడుపిల్లలు) మీ మనుమలయు, మనుమరాండ్రయు తల్లులగుదురుకదా?

గ్రామస్థుడు.—నిజమే.

సాక్రటీసు.—మీ తల్లులుగూడ నొకప్పుడు చిన్నపిల్లలుగ నుండిరికదా?

గ్రామస్థుడు.—ఉండిరి.

సాక్రటీసు. — గృహనిర్వాహమంతయు స్త్రీలు చేయవలసినదేకదా?

గ్రామస్థుడు.—అవును.

సాక్రటీసు. — అట్లైన స్త్రీ లెంత తెలివికలవారైన అంత చక్కగ గృహనిర్వాహము జరుగును గదా? వారి భర్తలును పిల్లలును అంత యెక్కువ సౌఖ్యము ననుభవింపగలరు గదా?

గ్రామస్థుడు.—నిజమే.

సాక్రటీసు.—గృహనిర్వాహమందును భర్తలయొక్కయు, పిల్లలయొక్కయు సౌఖ్యమును వృద్ధిచేయుటయందును స్త్రీలకు గల బాధ్యతనుబట్టి మగపిల్లలకంటె ఆడుపిల్లల నధికశ్రద్ధతో పెంచుట యుక్తముగదా?

గ్రామస్థుడు.—అయ్యా, ఈ విషయములోకూడ మీ వాదమే సరియైనదనియు మాది సరికాదనియు మేము ఒప్పుకొనక తప్పదు.

సాక్రటీసు.-అట్లైనయెడల ఇంతకుముందు మీరు రసహ్యించుకొనిన కుక్క మీకంటె నెక్కువ జ్ఞానముకలదియని చెప్పవలెను. అది దాని పిల్లలనన్నిటిని—మగపిల్లలు ఆడుపిల్లలు అను భేదబుద్ధిచూపక—సమానముగ పెంచుచున్నది.

గ్రామస్థుడు. — మరి చెప్పుటకేమున్నది? మా పద్ధతులన్నియు లోపములతో నిండియున్నట్లు కనపడుచున్నది.

సాక్రటీసు. — (లోపములున్నవని మీరు ఒప్పుకొనుచున్నారు గనుక) మనుష్యు లనిపించుకొనవలయుననిన మీరు మూడు నాలుగుపనులను చేయవలసియున్నదని మనమిప్పుడు తీర్మానింపవచ్చును. అవి యేవియనగా:—

1. గ్రామములోని పెంటనంతయు లోతైన గోతులలో పడవేసి గ్రామమును శుభ్రపరచుట; అట్లే పిల్లలను శుభ్రముగ నుంచుట.

2. పేడతో పిడకలపెట్టుట మానుట.

3. ఇండ్లకు కిటికీలుపెట్టుట.

4. మగపిల్లలవలె ఆడుపిల్లలనుకూడ బడికిపంపుట.

గ్రామస్థుడు.—ఇవన్నియు చేయువరకు మేము మనుష్యులనిపించుకొనుట కనర్హులమనుట నిశ్చయమని తోచుచున్నది.

సాక్రటీసు.—(లేచి). మంచిది. నేనిప్పు డింటికివెళ్లవలసియున్నది. ఆలస్యమగుచున్నది. మీ గ్రామమునకు వచ్చినందుకు నేను మిగుల సంతోషించుచున్నాను. నేనీవైపు వెళ్లి

నపుడు మరియొకమారు మీ గ్రామమునకువచ్చి నాకు ప్రొద్దు పోనపుడు మీతో మాటలాడవచ్చునా?

గ్రామస్థుడు.—తప్పక అలాగే చేయండి. ఈ పర్యాయము మీరు వచ్చునప్పటికి ఇచట మనుష్యులను చూడగలరనుకొను చున్నాను.

సాక్రటీసు.—నాకుగూడ అట్టి నమ్మకమున్నది. సెలవుతీసి కొనెదను.

గ్రామస్థుడు.—చిత్తము.

## జ్వరము

మరుసటిపర్యాయము సాక్రటీసు ఆ గ్రామమునకు వచ్చు నప్పటికి దాదాపుగ గ్రామస్థులందరు జ్వరముచే పీడింపబడు చుండిరి.

అప్పుడతడు వారితో, "ఇది చాల భయంకరముగనున్నది. జ్వరమునకు మందులేదు కాబోలు; జ్వరమురాకుండజేసికొనుట కుపాయములేదు కాబోలు. కానియెడల మీవంటి బుద్ధి మంతు లీవిధముగ నసహాయులై లేవలేకుందురా?" అని అనెను.

కొంతకాలము సైన్యములో పనిచేసి పింఛనుపుచ్చుకొనిన గ్రామస్థుడొకడు వెంటనే లేచి, "సైన్యములోనుండినపుడు నా కెన్నడు జ్వరమువచ్చినదిలేదు. అచటి అధికారులు వారమున కొకమారు అచటి దొరువులు గుంటలు చిన్న చెరువులులోనగు వానిలో కొంత కిరసనాయిల్ పోయుట వాడుక. మా కందరికి వారమునకు రెండుమార్లు క్వైనా తీసికొనుటయు, దోమతెరల యందే నిద్రపోవుటయు ఆచారముగనుండెను. ఎన్నడైన దోమ

తెరల మేము ఉపయోగింపనియెడల అధికారులు మమ్ముల శిక్షించుచుండువారు," అని చెప్పెను.

సాక్రటీసు.—అట్లైనయెడల గ్రామస్థులగు మీయందరి కిప్పుడేల జ్వరమువచ్చెను. బుద్ధిమంతుడగు ఈ సిపాయి మీకు ఉపదేశించినదానినంతయు మీరాచరించుచుంటిరిగదా?

గ్రామస్థులు.—అయ్యా, ఇంతకుముందెప్పుడుకాని యీతడీవిషయములగురించి మాతో చెప్పినదిలేదు. తన యింటిలో గూడ నితడీవిధముగ నాచరించుటలేదు. ఈ కారణముచే ఇతడు చెప్పునదంతయు సత్యముకాదని మాకు తోచుచున్నది.

సాక్రటీసు.—ఏమోయి సిపాయీ, నీ విషయమై వీరెంత యబద్ధమాడుచున్నారు! నీవంటి బుద్ధిమంతుడు ఇంటిలోనివారందరి యుపయోగార్థము దోమతెరల తెప్పించకుండునా? వారిచేత అప్పుడప్పుడు క్వైనాను తినిపించకుండునా? కుళ్లునీళ్లు నిలిచిన ప్రదేశములలో కిరసనాయిల్ పోయించకుండునా?

సిపాయి.—దండునుండి వచ్చినప్పుడు నేను కొన్ని దోమతెరలను తెచ్చితిని. కాని మాయింట నెవ్వరు వాని నుపయోగించని కారణముచే నా భార్య వానిని కత్తిరించి చొక్కాలు కుట్టెను.

సాక్రటీసు.—నీ యింటివారు నీ మాటలను ధిక్కరించి నీవు తెచ్చిన తెరల నుపయోగించలేదనియా నీవు చెప్పుచున్నావు! నీవు వారిని కఠినముగ నాజ్ఞాపించి, దోమతెర నొకదానిని తప్పక నీవు ఉపయోగించి, వారుకూడ వాని నుపయోగించునట్లు పట్టుపట్టుటకదా నీ ధర్మము.

సిపాయి.—నా తెరను నేను ఉపయోగించినదిలేదు. అందుచే వారుకూడ వారి తెరల నుపయోగింపరైరి.

సాక్రటీసు.—సైన్యములోనుండినపుడు గొప్ప శిక్షకుడని నీవు గాంచిన ఖ్యాతియంతయు నీ యింటియందు నిరర్థక మయ్యెనుగదా?

సిపాయి.—అవును. అట్లే కనిపించుచున్నది.

సాక్రటీసు.—జ్వరమురాకుండ చేసికొనుటకు వలయు ఉపాయములన్నిటిని నీకు నేర్పుటయందు సైన్యాధికారులు గడపిన కాలమంతయు వ్యర్థమయ్యెనుగదా? గ్రామస్థులారా, క్వైనా నుగురించి మీరెన్నడు విన్నదిలేదా?

గ్రామస్థులు.—వినకేమి? బడిలో ఉపాధ్యాయుడు దానిని గురించి బోధించుచున్నాడు. ఇదిగాక మా గ్రామములోని అయ్యవారొకరు కొన్ని మాత్రలనుదెచ్చి మాకిచ్చెను. అవి చాల ఉపయోగకరములుగ నుండెను.

సాక్రటీసు. — అట్లైనయెడల మీరామాత్రలను ప్రతి దినము తీసికొని జ్వరమును పూర్తిగ పోగొట్టుకొనరేల?

గ్రామస్థులు. — మరి మాత్రలు లేవు. అయ్యవారు తెచ్చినవి అయిపోయినవి.

సాక్రటీసు.—క్వైనా ఉపయోగకరమైన వస్తువేనా?

గ్రామస్థులు.—మిక్కిలి ఉపయోగమైనది.

సాక్రటీసు. — మీ గ్రామమునకు రెండుమైళ్ల దూరమందుండు బస్తీలో దాని నమ్ముచున్నారె.

గ్రామస్థులు.—నిజమే. అమ్ముచున్నారు.

సాక్రటీసు. — ఒకదినము జ్వరమువలన మీకు అధమ పక్షము అర్ధరూపాయనైన నష్టముగదా?

గ్రామస్థులు.—అర్ధరూపాయ ఏమి? విత్తనములు చల్లుకాలమునను, కోతకాలమునను దినమునకు రూపాయి (కూలి) కూడ నష్టము.

సాక్రటీసు.—క్వైనా చాల వెలగల వస్తువేమో?

గ్రామస్థులు.—అబ్బే. కాదు కాదు. ఎనిమిది రూపాయలకు అయిదువందల మాత్రలు.

సాక్రటీసు.—అప్పుడప్పుడు మీరు ఉప్పు మిరెపకాయలు చింతపండు మొదలగు వస్తువులను కొనుటకు బజారుకు వెళ్లెదరు కదా?

గ్రామస్థులు.—ఆహా.

సాక్రటీసు.—ఈ సమయమున ఉప్పు మిరెపకాయకంటె క్వైనా ఎక్కువ ముఖ్యమైనదికదా?

గ్రామస్థులు.—సందేహామేమి?

సాక్రటీసు.—మీ ఊరి అయ్యవారువచ్చి ఉప్పు మిరెపకాయలను తెచ్చి తేరకు పంచిపెట్టువరకు మీరు వానిని కొనకుందురా?

గ్రామస్థులు.—ఏల? మేము భిక్షుగాండ్రముకాము.

సాక్రటీసు.—అయితే క్వైనామాత్రము మీకు ఉచితముగ కావలెను కాంబోలు!

గ్రామస్థులు.—సర్కారువారు దానిని ఉచితముగ నిచ్చుచున్నారుగదా?

సాక్రటీసు. — దాని యుపయోగమును మీకు తెలియపరచు ఉద్దేశముతో కొన్ని మాత్రలను సర్కారువారు ఉచితముగ నిచ్చిరి. కాని, మీకు కావలసినమాత్రలు రెండు మూడ కాలకు దొరుకుచుండినను దానిని కొనుటకు పాలుమాలి, మీరీ

విధముగ విత్తనాలకాలమును, కోతలకాలమును వ్యర్థపరచుకొను టయేగాక మరణమునకుగూడ పాత్రులుకావలయునని దీని యర్థముకాదు.

గ్రామస్థులు.—అయ్యా, క్షమింప వేడుచున్నాము. మేము బుద్ధిహీనులము. ఇప్పుడే మేము వెళ్లి ఒక సంవత్సరమువరకు జ్వరమురాకుండుటకు కావలసినంత క్వైనాను కొనెదము.

సాక్రటీసు. — అట్లైన, దోమ తెరలనుగురించి మీరేమి చెప్పెదరు.

గ్రామస్థులు.—అయ్యా, మేము పేదలము. ఇట్టి భోగ వస్తువుల కొన సామర్థ్యములేనివారము.

సాక్రటీసు. — ఏమీ! మీయందరికి చెవులలో అంటు జోళ్లున్నవి; మీ పిల్లలందరు కడియములు మురుగులు పెట్టుకొని యున్నారు. ఇవి జ్వరమురాకుండచేయు వస్తువులా?

గ్రామస్థులు.—వాని కట్టి శక్తి ఎక్కడిది?

సాక్రటీసు.—అట్లైనయెడల ఈ నగలను కొనుటకు బదులు దోమ తెరలను కొనుట బుద్ధిమంతుల లక్షణముకదా?

గ్రామస్థులు.—నిజమే.

సాక్రటీసు.—మీ పిల్లలయందు మీకెక్కువ ప్రేమకదా?

గ్రామస్థులు.—అడుగవలెనా?

సాక్రటీసు.—నగలుగలిగియు ఆరోగ్యములేని పిల్లలకంటె నగలులేకపోయినను ఆరోగ్యవంతులగు పిల్లలుండుట మంచిది కదా?

గ్రామస్థులు.—దానికి సందేహమేమి?

సాక్రటీసు. — అంటుజోళ్లు మురుగులు మొదలగువాని కంటె దోమ తెరలును క్వైనామాత్రలును మంచివిగదా?

గ్రామసులు.—మంచివే.

సాక్రటీసు.—కొంచెము జాగ్రత్తచేతను, ముందు ఆలోచనచేతను చక్కబెట్టదగిన ఈ విషయమున గ్రామములోని వారు జ్వరపీడితులై పడిపోయియుండుటయు, పిల్లలందరు జబ్బుగను బలహీనులుగనుండుటయు చూడ నాకు కడు విచారము కలుగుచున్నది. గనుక నేను చెప్పినట్లు మీరు చేయుదురని నమ్ముచున్నాను.

గ్రామస్థులు.—(వినయముతో) అట్లే మా శక్తికొలది చేసెదము.

సాక్రటీసు.—మిత్రులారా, మంచిది. నేను వెళ్లవలెను. సెలవు.

గ్రామస్థులు.—చిత్తము.

## కులము — మైల

సాక్రటీసు యథాప్రకారము ఊరిపెద్దలతో కూర్చుండి మాటలాడుచుండగా మాలవాడొక డచటికివచ్చెను. వెంటనే వారందరాతనిని కొంచెము దూరమున నుండవలసినదని ఆజ్ఞాపించిరి.

సాక్రటీసు.—అయ్యలారా, ఇట్టి నిరాదరణకేల అతడు పాత్రుడుకావలెను?

గ్రామస్థులు. — ఇందులో ఆశ్చర్యమేమున్నది. అతడు మాలవాడుకాడా.

సాక్రటీసు. — మాలవాడైనంతమాత్రమున దూరముగ కూర్చుండవలెనా?

గ్రామస్థులు.—అతడు హీనజాతివాడు; అశుచి.

సాక్రటీసు.—మిమ్ము తాకినయెడల మీరు మైలపడుదురు కాబోలు.

గ్రామస్థులు.—తప్పక.

సాక్రటీసు.—మీరందరు ఈ గ్రామమున పుట్టినవారే గదా?

గ్రామస్థులు.—ఏల ఈ ప్రశ్న? మీ యుద్దేశమేమి?

సాక్రటీసు.—ఉద్దేశమేమైన నేమి? నేను ముసలివాడను గదా? నా మనస్సు పరిపరివిధముల పోవుచుండును.

గ్రామస్థులు.—సరే. మేమందరము ఇచట పుట్టినవారమే.

సాక్రటీసు.—మీ యిండ్లలో పురుడురానున్నపుడు బుద్ధిమంతురాలి నొకదానిని పిలిపింతురుగదా?

గ్రామస్థులు.—పిలిపించ కేమి? ఈ గ్రామములో మంత్రసాని యొకతెయున్నది.

సాక్రటీసు.—ఆమె గొప్ప రైతుయొక్క భార్య కాబోలు.

గ్రామస్థులు.—కానే కాదు. రైతులభార్య లిట్టిపనికి రారు.

సాక్రటీసు.—అట్లైన, ఎవతె ఆమె?

గ్రామస్థులు.—మంగలిది.

సాక్రటీసు.—పురిటిసమయమున మంత్రసాని మీ భార్యలను తాకుచున్నదా?

గ్రామస్థులు.—తాకుచున్నది.

సాక్రటీసు.—పుట్టినబిడ్డను మొట్టమొదట తాకునది ఆమెయేగదా? బిడ్డనోటిలో ఉంచబడు మొదటివస్తువు ఆమె వ్రేలే గదా?

గ్రామస్థులు.—అవును.

సాక్రటీసు.—అట్లైన, పుట్టిన నిమిషమునుండి మీ భార్యలు మీ తల్లులు మీరు మైలబడుచున్నారు. మీ జాతి ఏమగుచున్నది?

ఈ మాట వినగనే గ్రామస్థులలో కొందరికి కోపము వచ్చెను; కాని, వారిలో తెలివిగలవారందరు తమ నడతలోని యసంగతమును గ్రహించి సిగ్గుపడి తలవంచుకొనిరి.

సాక్రటీసు.—మీకెవరికైన కాలిలో ముల్లు గ్రుచ్చుకొని వాచినపుడు మీరేమిచేయుచున్నారు?

గ్రామస్థులు.—వైద్యుని సహాయములేక వాపు తగ్గదని తోచినపుడు వైద్యునివద్దకు వెళ్లెదము.

సాక్రటీసు.—మీ భార్యలకు మంత్రసానితనము చేయుటకువచ్చు మంగలిదాని భర్తయేగదా ఆ వైద్యుడు?

గ్రామస్థులు.–కానేకాడు. సాక్రటీసుగారూ! ఈ పొడుపు మాటలు తమ రాడరాదు. అగ్రజాతియందుపుట్టి ఇంగ్లీషు పరీక్షలందు గడతేరినవాడే మా డాక్టరు.

సాక్రటీసు.—మీ ఆవు ఈనునపుడు మీరెవరి సహాయమును కోరెదరు.

గ్రామస్థులు.—అనుభవశాలియగు గొప్ప రైతుయొక్క సహాయమును.

సాక్రటీసు.—స్త్రీల ప్రసవము కష్టముతోడను, బాధతోడను కూడుకొనియుండునుగదా? ఒక్కొకప్పుడది అపాయకరముగగూడ నుండునుగదా?

గ్రామస్థులు.—నిజమే.

సాక్రటీసు.—మీ భార్యలయెడల మీ కభిమానములేదా! మీ భార్యలును బిడ్డలును చచ్చినను బ్రతికినను మీకు లెక్క-లేదా?

గ్రామస్థులు.-అయ్యా, అట్లనకుడు. ఎంతో ధనవ్యయము చేసి మేము మా భార్యలను వివాహమాడుచున్నాము. పిల్లలు పుట్టవలయునని మేమెంతో ఆశపడుచుందుము. బిడ్డలపై మాకుగల ప్రేమ అఖండము. మా భార్యలుగాని, బిడ్డలుగాని చావవలయుననియా మా కోరిక?

సాక్రటీసు.—మీకు కాలిలో బాధకలిగినపుడు డాక్టరును పిలిపించుచున్నారు. ఆవులు ఈనునపుడు తెలివిగల రైతులను పిలిపించుచున్నారు. కాని, మీ భార్యలు ప్రసవవేదన పడుచుండునపుడు గ్రామములోని స్త్రీలందరిలో అశుచియు, అధమజాతియు అగుదానిని పిలిపించుచున్నారుగదా?

గ్రామస్థులు.—అయ్యా, క్షమింపవలెను. మేము తెలివి మాలినవారము.

సాక్రటీసు.—అధమజాతిలో పుట్టి శుచిలేని, శిక్షలేని, జ్ఞానములేని స్త్రీలకుబదులు పరిశుభ్రలును, తెలివిగలవారును శిక్షితులునగు స్త్రీలు మీ భార్యలకు మంత్రసానితనము చేయుటకై మీ యూరి యాడువారినే కొందరిని వైద్యవిద్యాశాలలకు పంపి వారికి విద్యనేర్పించుట మంచిదికదా?

గ్రామస్థులు.—అయ్యా, మేమట్లేచేసెదము. స్త్రీలయెడ మేము చూపుచుండిన కాఠిన్యమునకును, నిరాదరణమునకును మేము సిగ్గుపడుచున్నాము.

సాక్రటీసు.—సరేగాని, ఈ మైలవిషయములో నాకు కొన్ని సందేహములు కలవు. పెంట మైలపదార్థమేనా?

గ్రామస్థులు.—అవును.

సాక్రటీసు.—గ్రామములోని చెత్తను పెంటను మీరేమి చేయుచున్నారు?

గ్రామస్థులు. — గ్రామముచుట్టును దిబ్బలుగ వేయుచున్నాము.

సాక్రటీసు. — గ్రామములోపలను ఇండ్లమధ్యనుకూడ దిబ్బలుగ వేయుచుందురుగదా?

గ్రామస్థులు.—అవును. మా పనివాండ్రు సోమరులు; ఇండ్లకు దూరముగ వేయుటకు పాలుమాలెదరు.

సాక్రటీసు.—ఉదయమున మీవారు బహిర్భూమి కెచటికి వెళ్లెదరు?

గ్రామస్థులు.—దగ్గరనున్న పొలములలోనికి.

సాక్రటీసు.—గ్రామములోపలను, వీధులందును, డొంకలందును వెళ్లుటకూడ కలదా?

గ్రామస్థులు.—కలదు. ప్రజలు కడుసోమరులు. దూరముగ వెళ్లరు.

సాక్రటీసు.—ఈ కశ్మలమంతయు ఎండకు ఎండుచున్నదా?

గ్రామస్థులు.—ఎండుచున్నది.

సాక్రటీసు.—గాలి కొట్టునపుడది పైకెగయునా?

గ్రామస్థులు.—దానికి సందేహమేమి?

సాక్రటీసు.—ప్రొద్దుటిపూట పశువులు పొలములకు వెళ్లునపుడును, సందెవేళ అవి ఇండ్లకు వచ్చునపుడును వాని త్రొక్కుడువలన దుమ్ము పైకి రేగుచున్నదా?

గ్రామస్థులు.—రేగుచున్నది.

సాక్రటీసు.—వర్షము కురిసినపుడు ఈ కశ్మలమంతయు నూతులవద్దకు కొట్టుకొనివచ్చి ఆ నీళ్లనుకూడ చెరచుచున్నదా?

గ్రామస్థులు.—ఒక్కొకపుడు ఇట్లుకూడ జరుగుచున్నది.

సాక్రటీసు.—ఒక్కొకసారి మీ కాళ్లజోళ్లకు అంటుకొని మీతో ఆ కశ్మలము మీ యిండ్లలోనికి వచ్చుచున్నదా?

గ్రామస్థులు.—అట్లే.

సాక్రటీసు.—మీ ఆడువాండ్రు పిండివిసరునపుడు ఆ దుమ్ము పిండిలో పడుచున్నదా?

గ్రామస్థులు.—పడవచ్చును.

సాక్రటీసు.—నూతినుండి ఇండ్లకు నీళ్లు తెచ్చునపుడు ఆ నీళ్లలోకూడ ఆ దుమ్ము పడుచున్నదా?

గ్రామస్థులు.—అవును. (పడవచ్చును.)

సాక్రటీసు.—గ్రామపు చెత్తలో కొంతభాగము మీ తిండిలో గలిసి లోపలికి పోవుచున్నదనియేగదా దీని యర్థము.

గ్రామస్థులు.—ఆలాగే తోచుచున్నది.

సాక్రటీసు.—నీళ్లతోకూడ దానిని త్రాగుచున్నారని యును భావింపవచ్చునుగదా?

గ్రామస్థులు.—నిస్సందేహముగ.

సాక్రటీసు.—ఊపిరితోకూడ దానిని లోపలికి పీల్చుకొనుచున్నారా?

గ్రామస్థులు.—నిశ్చయముగ.

సాక్రటీసు.—మీరు తిను ఆహారము త్రాగెడు నీరు పీల్చు గాలి—ఈ మూటివలన మీ జన్మములో ప్రతిదినమందును మీరు మైలబడుచున్నారని చెప్పవలసినదేకదా? అట్లైనయెడల, మైలకు మాలవాడు కారణమని ఎందుకనుకొనెదరు? "మాలవా

డస్పృశ్యుడు, మేము ఉత్తమవర్ణములవారము," అని గర్వ పడుటకు పూర్వము ప్రస్తుతపు మీ సోమరితనమువలనను, అపరిశుద్ధమగు మీ యలవాటులవలనను మీరు మైలబడి మీ గ్రామమునంతను మైలపరచుటకు మారు, లోతైన గుంటలను త్రవ్వి గ్రామమందలి చెత్తను, పెంటను, ఎరువును వానిలో పోసి, మీరందరు—స్త్రీలు పురుషులు పిల్లలు—వానినే మరుగుదొడ్లుగ ఉపయోగించుట మంచిదికదా?

గ్రామస్థులు.—అట్లే ప్రయత్నముచేసి చూచెదము. తర తరములనుండి వచ్చుచున్న ఆచారములను ఒకసారి పూర్తిగ మానివేయుట కష్టము.

## నగలు: స్త్రీలకుతగిన గౌరవము

ఒకనాడు గ్రామములోని పెద్దలందరు గుమిగూడి సాక్రటీసుతో మాటలాడుచుండ నీళ్లకుండను మోయుచు ఒక స్త్రీయు గడ్డిమోపును మోయుచు మరియొకతెయు ఆ మార్గమున వచ్చుచుండిరి. వారిద్దరి యొడలినిండ వెండినగ లనేకములును కొన్ని బంగారునగలును ఉండెను.

"మిత్రులారా, నగలనుగురించి మీతో ముచ్చటించ వలయునని నా కోరిక. నా మనస్సు మిక్కిలి కలతనొంది యున్నది; ఈ విషయమును గ్రహింపజాలకున్నాను." అని సాక్రటీసు పలికెను.

గ్రామస్థులు.—మహాశయా, ఇందులో మీరు గ్రహింప జాలనంత కష్టమేమున్నది?

సాక్రటీసు.—మీ స్త్రీలు ఆభరణములెందుకు ధరించెదరు?

గ్రామస్థులు.—ఇదేమి అంత గూఢమగు విషయమా? మేమందరము—మేము, మా పిల్లలు, మగపిల్లలు, ఆడుపిల్లలు—కొద్దిగనో గొప్పగనో నగలను పెట్టుకొనుచున్నాము; మా ఆడువారు మరి కొంచెమధికముగ పెట్టుకొనెదరు. ఇందులో వింత యేమియున్నది?

సాక్రటీసు.—నరేకాని, ఈ పెట్టుకొనుట ఎందుకు?

గ్రామస్థులు.—అనేక కారణములుండవచ్చునని మా అభిప్రాయము. ఇది మా ఆచారము; చక్కని యాచారము. వారు మేము అందరము దీనియందెక్కువ ఇష్టము గలిగియున్నాము.

సాక్రటీసు.—ఇది ఆచారమనియు ఈ యాచారము ననుసరింపనియెడల పరులేమైన అనుకొనెదరేమోయనియు గదా మీరు దీనియం దిష్టముగలిగియుండుట; కాని, ఆచారమైనంత మాత్రముచేత మనము చేయుపని సరియనుట తగునా?

గ్రామస్థులు.—కాకేమి?

సాక్రటీసు.—గ్రామస్థులలో కొందరికి దొంగలించుట ఆచారమైనయెడల అది సరియైనదని మీరనెదరా?

గ్రామస్థులు.—అది సరియైనదెట్లగును?

సాక్రటీసు. — ఆచారములైనంత మాత్రముచేత మనము చేయుపనులు సరియైనవనుటకు వీలులేదుగదా?

గ్రామస్థులు.—వీలులేదు.

సాక్రటీసు.—అట్లైనయెడల నగలుపెట్టుకొనుట సరియైనదని రుజువుచేయుటకు అది ఆచారమని చెప్పుటమాత్రము చాలదు; అంతకంటె బలమగు కారణములేవైన మీరుగు చూపవలెను.

గ్రామస్థులు.—కారణమా? నగలు శరీరమునకు మరింత వన్నె తెచ్చుచున్నవి.

సాక్రటీసు.—నగలబెట్టుకొని ఆవైపు వెళ్లిన స్త్రీలు స్నానమనునది ఎరిగినవారివలె కనపడరు. చినిగిపోయిన మైలగుడ్డలను కట్టుకొనియున్నారు. ఆ దిక్కున ఆటలాడుపిల్లలను చూచితిరా? వెండికడియములు మురుగులు పెట్టుకొనియున్నారుగాని ఎన్నడుగాని స్నానముచేసినట్టు లేదు; వారిపైనుండు గుడ్డలన్నియు చినిగిన పేలికలు.

గ్రామస్థులు.—అయిననేమి? ఈ నగలు వారి దేహమునకు వన్నె తెచ్చుచున్నవి.

సాక్రటీసు.—మీ పనులెంత వింతగనున్నవి? స్నానమునకు డబ్బు ఖర్చులేదు; బట్టలు విశేషమైన ఖరీదుగల వస్తువులుకావు. అయినను మీరును మీవారును దుమ్మురేగుచుండు శరీరముల తోడను, చింపిరిగుడ్డలతోడను తిరుగుచు ఈ లోపమును కప్పిపుచ్చుటకో యన్నట్లు వెలగల నగలను పెట్టుకొనుచుండుట కంటె వింత యేమియున్నది.

గ్రామస్థులు.—అలాగు కాదు. నగలు పెట్టుకొనినయెడల మా స్త్రీలు మరింత అందముగ కనబడుచుందురు.

సాక్రటీసు.—(కోపముతో బిగ్గరగా) భగవంతుడే వారిని అందకత్తెలగ సృష్టించియున్నాడు. మీరన్నననో ఈ మురికిచేతను, చింపిరిగుడ్డలచేతను వారి అందమునకు భంగముకలిగించుచు, ఆ భంగపాటును నగలమూలమున కప్పిపుచ్చ ప్రయత్నించుచున్నారు.

....

గ్రామస్థులు.—నిజమే, మీ మాటలవలన మేము తప్పక సిగ్గుపడవలసియున్నది.

సాక్రటీసు.—విని తెలివి సంపాదించుటకై మీ చెవిలో భగవంతుడొక రంధ్రమునుచేసియుండ నగలను వ్రేలగట్టుకొనుటకు మీరు మరియొక రంధ్రముచేసికొనియున్నారు. మొదటి రంధ్రముగుండ మీ లోపలికిపోవు జ్ఞానమంతయు రెండవదానిగుండ వెడలిపోవుచున్నది.

గ్రామస్థులు.—అయ్యా, మమ్ముల నీ విధముగ ఎగతాళి చేయవద్దు. మీ సలహా ననుసరించి మా నడతను చక్కజేసికొనుటకు ప్రయత్నించెదము.

సాక్రటీసు:—చూచితిరా, ఎంత తరుచుగా మీరీ నగలను పెట్టుకొనుచున్నారో అంత త్వరితముగ అవి అరిగిపోవుచుండును.

గ్రామస్థులు.—నిజమే.

సాక్రటీసు.—మరి, ఆడవారన్ననో వారి నగలు ఎక్కువ కానుకాను ఒకరిని చూచి మరియొక రధికముగ అసూయపడుచుందురు. ఈ అసూయచేత నగలకై మగవారిని మరింత అధికముగ పీడించుచుందురు.

గ్రామస్థులు.—ఇదంతయు నిజమే.

సాక్రటీసు.—ఎంత తక్కువగ నగలను ధరించిన అంత మంచిదని దీనినిబట్టి స్పష్టమగుచున్నది కదా?

గ్రామస్థులు.—అవును.

సాక్రటీసు.—ఇప్పుడప్పుడనక - ఇండ్లలోను పొలములందును పనిచేయునప్పుడుకూడ – మురికిబట్టలతోపాటు ఈ విలువగల నాణ్యమైన నగలను ధరించుకొనుట మీరు చేయు తెలివి మాలిన పనులన్నిటిలో అధమమైనదని చెప్పక తప్పదు. నిజముగ మీకు జ్ఞానమేయున్నయెడల మీరు చేయవలసిన పని ఇదికాదు.

సాక్రటీసు.—విని తెలివి సంపాదించుటకై మీ చెవిలో భగవంతుడొక రంధ్రమునుచేసియుండ నగలను వ్రేలగట్టుకొనుటకు మీరు మరియొక రంధ్రముచేసికొనియున్నారు. మొదటి రంధ్రముగుండ మీ లోపలికిపోవు జ్ఞానమంతయు రెండవదాని గుండ వెడలిపోవుచున్నది.

గ్రామస్థులు.—అయ్యా, మమ్ముల నీ విధముగ ఎగతాళి చేయవద్దు. మీ సలహా ననుసరించి మా నడతను చక్కజేసికొనుటకు ప్రయత్నించెదము.

సాక్రటీసు:—చూచితిరా, ఎంత తరుచుగా మీరీ నగలను పెట్టుకొనుచున్నారో అంత త్వరితముగ అవి అరిగిపోవుచుండును.

గ్రామస్థులు.—నిజమే.

సాక్రటీసు.—మరి, ఆడవారన్ననో వారి నగలు ఎక్కువ కానుకాను ఒకరిని చూచి మరియొక రధికముగ అసూయపడుచుందురు. ఈ అసూయచేత నగలకై మగవారిని మరింత అధికముగ పీడించుచుందురు.

గ్రామస్థులు.—ఇదంతయు నిజమే.

సాక్రటీసు.—ఎంత తక్కువగ నగలను ధరించిన అంత మంచిదని దీనినిబట్టి స్పష్టమగుచున్నది కదా?

గ్రామస్థులు.—అవును.

సాక్రటీసు.—ఇప్పుడప్పుడనక - ఇండ్లలోను పొలములందును పనిచేయునప్పుడుకూడ - మురికిబట్టలతోపాటు ఈ విలువగల నాణెమైన నగలను ధరించుకొనుట మీరు చేయు తెలివిమాలిన పనులన్నిటిలో అధమమైనదని చెప్పక తప్పదు. నిజముగ మీకు జ్ఞానమేయున్న యెడల మీరు చేయవలసిన పని ఇదికాదు.

పండుగలప్పుడును ఉత్సవదినములందు నుపయోగించుటకై మీరీనగలను దాచిపెట్టుకొని, చక్కగ స్నానముచేసి శుభ్రములగు వస్త్రములను కట్టుకొని ఈ నగలను ధరింపవలెను.

గ్రామస్థులు.—ఇది యుక్తియుక్తమే.

సాక్రటీసు.—అప్పుడే వానికి నిజమైన విలువయుండును.

గ్రామస్థులు.—అవును; కాని నగలు కావలయునని మా ఆడువారు పట్టుపట్టుచుందురు.

సాక్రటీసు.—విషము కావలెనని పట్టుపట్టినయెడల మీరు దానిని తెచ్చియిచ్చెదరా?

గ్రామస్థులు.—ఇయ్యనే ఇయ్యము. ఏమిటి ఈ సూచన.

సాక్రటీసు.—మీ స్త్రీలవలె మీరుకూడ నగలు మంచివనియే భావించుచున్నారన్న మాటయేనా?

గ్రామస్థులు.—అవును.

సాక్రటీసు.—అట్లైనయెడల ఈ దుర్వ్యయమునకై వారిని నిందింపకుడు.

గ్రామస్థులు.—ఇది దుర్వ్యయమెట్లగును? ఖర్చగు డబ్బునకు బదులు నగలున్నవిగదా? నగలు విలువగలవేకదా?

సాక్రటీసు.—నగలకై నూరు రూపాయల ఖర్చుపెట్టిన యెడల మీకు వచ్చునదెంత?

గ్రామస్థులు.—కంసాలి నమ్మదగినవాడైనయెడల ఎనుబది రూపాయల విలువగల నగవచ్చును; కానియెడల అరువదో డెబ్బదో రూపాయల విలువగలదిమాత్రమే.

సాక్రటీసు.—తర్వాత అది అరిగిపోవుటయు, పది సంవత్సరములైనతర్వాత దాని విలువ ఇరువది రూపాయలుమాత్రమే అగుటయు సర్వసాధారణమేనా?

గ్రామస్థులు.—అవును.

సాక్రటీసు.—ఏదైన ఒక రాత్రియందు దొంగలు వచ్చిన యెడల అదికూడ మాయమేకదా?

గ్రామస్థులు.—అదియు నిజమే.

సాక్రటీసు.—ఎక్కువ నగలుండువారు దొంగలువచ్చెదరను భయముచే రాత్రిపూట నిద్రమానుకొనవలసియున్నది; ఇండ్లకు కిటికీలపెట్టక ఆరోగ్యమును చెడగొట్టుకొనుచుందురు. నగలెంత లాభకరములో విశదమగుచున్నదా? నగలకై నూరు రూపాయలు ఖర్చుపెట్టుటకు బదులా నూరు రూపాయలను పది సంవత్సరములకాలము కో ఆపరేటివు (పరపతి) బ్యాంకీలో దాచుకొనినయెడల ఏమగునో ఆలోచించితిరా?

గ్రామస్థులు.—రెండువందలగునని వారు వారు చెప్పుట వినియున్నాము.

సాక్రటీసు.—నగలు విలువగలవని చెప్పితిరే. దీనితో సరిపోల్చి చూచినయెడల ఆ విలువయెట్టిదో తెలియుచున్నదా?

గ్రామస్థులు.—అయ్యా, నిజముగా మేము ఆచారములకు దాసులము.

సాక్రటీసు.—మీ భార్యలు నగలు కావలెనని చెప్పినపుడు మీవద్ద డబ్బులేనియెడల మీరేమి చేసెదరు.

గ్రామస్థులు.—అప్పుతెచ్చెదము.

సాక్రటీసు.—ఋణము పెరుగుకొద్ది నగలు అరిగిపోవుచుండును గదా?

గ్రామస్థులు.—అంతే.

సాక్రటీసు.—ఎంత తెలివిమాలినతనము? బుద్ధిహీనులారా! మీ కెప్పుడు జ్ఞానమువచ్చునో.

గ్రామస్థులు.—మా జ్ఞానముతో ఏమున్నది? నగలు లేని యెడల మా భార్యలకు, పిల్లలకు సంతోషము పూజ్యము.

సాక్రటీసు.—దానికేమి? మనమందరము సౌందర్యవంతములైన పదార్థముల కోరుచుందుము; అందరము సంతోషము నభిలషించుచుందుము. మనలోనుండు భగవదంశముయొక్క స్వభావమే ఇది.

గ్రామస్థులు. — అయ్యా, మేము వ్యక్తపరచలేని మా మనోభావములను మీరు చక్కగ వ్యక్తపరచితిరి.

సాక్రటీసు.—మీ కోరిక సఫలమగుటకు నగలు ఆవశ్యకములని మీరింకను తలచుచున్నారా?

గ్రామస్థులు.—మా గ్రామములలో ఇంతకంటె మేము చేయగలది ఏమియున్నది.

(అప్పుడే ఒక ఆడుగుఱ్ఱ మావైపు వచ్చెను. దానిప్రక్కన గుఱ్ఱపుపిల్లయొకటి విలాసముగ ఆడుచు నడుచుచుండెను.)

సాక్రటీసు.—ఈ రెండును ఎంత సుందరముగను సుఖముగను ఉన్నవి. అవి ఏమైన నగలను పెట్టుకొనియున్నవా? జంతువులకంటె మనుష్యులుత్తములు. అవునా?

గ్రామస్థులు.—అవును; ఉత్తములని యనుకొనుట కలదు. కాని నీ మాటల వినినతర్వాత ఈ యభిప్రాయము సరికాదను సందేహము పుట్టుచున్నది.

సాక్రటీసు.—మీ పిల్లలకు సంతోషము లేదని చెప్పవలసినదేనా?

గ్రామస్థులు. — వారు విశేషముగ ఆడుకొనుచుందురు; కాని, విశేషముగ ఏడ్చుటకూడ కలదు.

సాక్రటీసు.—మురికి, రోగము, బాధ, కష్టము—వీనితో నిండియుండు ఇంటిలోనివారికి సంతోషమెక్కడిది? జంతువులు హాయిగను, అందముగను ఉండగా మీ స్త్రీలును పిల్లలును అట్లుండకపోవుటకు కారణములేవో చెప్పగలరా?

గ్రామస్థులు.—మహాత్మా, సర్వము తెలిసినవారు మీరే చెప్పవలయును.

సాక్రటీసు.—నేను చెప్ప ప్రయత్నింపవచ్చునా?

గ్రామస్థులు.—దయచేసి అట్లేచేయుడు.

సాక్రటీసు. — మంచిది. మొదటికారణము జంతువులు పరిశుభ్రముగనుండుటయే. శుభ్రతవలన ఆరోగ్యమును, ఆరోగ్యమువలన సౌఖ్యమును లభించును. అవి బయళ్లలలో తిరుగుచు తమ శరీరములనేగాక తమ సంతానముయొక్క శరీరములనుకూడ బహు పరిశుభ్రముగ నుంచుచున్నవి. మీరన్ననో సర్వవిధముల రోతగానుండు గ్రామములలో కాపురము చేయుచున్నారు; అన్నివిధములగు చెత్త, పెంట, కశ్మలము, మిమ్ము ఆవరించి కంపుకొట్టుచుండును. గాలి వీచినపుడంత ఈ కశ్మలపదార్థము మీరు తిను ఆహారములోను, త్రాగు నీటిలోను చేరుచున్నది. మీరు పీల్చు ఊపిరిగుండ ఈ పదార్థము మీ యూపిరితిత్తులలో జేరుచున్నది. ఈగలు మొట్టమొదట దానిపై వ్రాలి తర్వాత మీ ఆహారపదార్థములమీదను, మీ పిల్లల కన్నులమీదను, పెదవులమీదను వ్రాలుచున్నవి. వెలుతురుగాని గాలిగాని ప్రవేశింపలేని చీకటి ఇండ్లలో మీరు నివసించుచున్నారు. మీ యిండ్లకు కిటికీలనునవి లేవు. మీ స్త్రీలు, ఎన్నడోగాని స్నానముచేయరు; మీ పిల్లలస్థితిగూడ ఇట్టిదే. ఇందుచే మీ ఆరోగ్యము చెడి, ప్రతిరోగమునకు మీరు దాసు

లగుట సంభవించుచున్నది. కావున మీరు శుభ్రముగ నుండవలెను; మీ పిల్లలను శుభ్రముగనుంచవలెను; మీ బట్టల నుతికికొనవలెను; మీ యిండ్లకు కిటికీల పెట్టుకొనవలెను; మీ గ్రామములను పరిశుభ్రముగ నుంచుకొని శౌచవిధులను మీరందర రనుసరించవలెను. ఈ పనులనుచేసినయెడల మీ స్త్రీలును పిల్లలును (జంతువులవలె) శుభ్రముగను, ఆరోగ్యసహితముగను ఉందురు. అప్పుడు సౌఖ్యముకూడ, దానంతట కలుగును.

గ్రామస్థులు.—అయ్యా, మీరు సెలవిచ్చినపనులు చాల కష్టములైనవి. వీనిని చేయుటకు మాకు శక్తి చాలదు.

సాక్రటీసు.—నేను చెప్పినదానిలో డబ్బు ఖర్చగు పనులేవైన ఉన్నవా?

గ్రామస్థులు.—లేవు.

సాక్రటీసు.—వివేకము—పూనిక—ఈ రెండేకదా కావలసినది. ఇదియేకదా మీకిప్పుడు లేకుండుట?

గ్రామస్థులు.—మీ రారోపించిన నిందయం దసత్యమునది లేనేలేదు.

సాక్రటీసు.—అసత్యము లేకపోవుటమాత్రమేకాదు. నా సలహాను మీ రనుసరించినయెడల నిరుపయోగమైన ఈ నగలన్నియు మీకక్కరయే యుండదు; ఆ కారణముచే మీ కెంతో డబ్బు మిగులును.

గ్రామస్థులు.—తప్పక మిగులును.

సాక్రటీసు.—నగలులేకున్నను శుభ్రముగను ఆరోగ్యముగను ఉండు స్త్రీలును పిల్లలును నగలు వ్రేలగట్టికొనినను రోతగనుండువారికంటె ప్రశంసార్హులుగదా?

గ్రామస్థులు.—సత్యము.

సాక్రటీసు.—ఈ విధముగమిగిలినడబ్బును వారికి క్రొం చెము విద్యనేర్పుటకును, వారు జబ్బుపడినపుడు మందిచ్చుట కును, వర్షాకాలమున వారి యుపయోగార్థమై దోమతెరలను కొనుటకును, ఏల ఉపయోగింపరాదు?

గ్రామస్థులు.—వివేకమనిన ఇదియేకదా. కాని, మా ఆడువారుమాత్రము ఎల్లప్పుడు నగలనే కోరుచుందురు.

సాక్రటీసు.—నగలను బొత్తిగ చేయించకూడదని నా యభి ప్రాయముకాదు. ఇందులో మీరు మితము పాటింపవలెననియే నేను చెప్పునది. అప్పుతీయక నగలను చేయించగలిగినయెడల మితముగ అట్లు చేయవచ్చును. నగలను పూర్తిగ నిషేధించుట నా మతముకాదు.

గ్రామస్థులు.—ఇట్లుచేసినయెడల వారికి తృప్తికలుగదు.

సాక్రటీసు.—ఏల.

గ్రామస్థులు.—ఇండ్లలో వారికి సౌఖ్యముతక్కువ. ప్రత్యేకమైన హక్కులేమియు వారికి లేవు. నగలను జారవేసి కొనినయెడల భర్తలకు తమయందెక్కువ అనురాగముండునని వారికి భ్రమ. ఇంతేగాక, దైవికముగా వారికి వైధవ్యము సంభ వించినయెడల ఈ యాభరణములు చూచుకొనియైన వారు కొంతవరకు దుఃఖశాంతిని బొందుదురు.

సాక్రటీసు.—ఈ యాభరణములు తప్ప వేరు ఆస్తి స్త్రీకి లేదనియేనా దీని అర్థము?

గ్రామస్థులు.—అవును.

సాక్రటీసు.—సమయము దొరకినపుడు భర్తలనుండి ఎంత రాబట్టవచ్చునో అంత రాబట్టుటకు వారు ప్రయత్నించుచున్నా

రనియు, నగలకై మిమ్మును వేధించుట కిదియే కారణమనియు, మీ యభిప్రాయమా.

గ్రామస్థులు.—అదియే మా అభిప్రాయము.

సాక్రటీసు —భర్తలు తమయందే ప్రేమకలిగి సత్ప్రవర్తన గలవారైయుండుటకై భార్యలు కోరు 'జామీను' వంటివి ఈ నగలు—యథార్థమిదియేనా?

గ్రామస్థులు.—క్షమింపుడు. ఈ దినము మీరు మరింత కఠినముగ మాటలాడుచున్నారు.

సాక్రటీసు. — కాఠిన్యమునకేమి? మీ భార్యలయెడల మీకు సహజమగు ననురాగమును గౌరవము—లేదనియేకదా దీని కర్థము.

గ్రామస్థులు.—అవును. కాని, వారుమాత్రము మమ్మును గౌరవించుచునేయున్నారు.

సాక్రటీసు.—అయిన, మీ భార్యలు గౌరవార్హులుకారనియే నా మీ అభిప్రాయము?

గ్రామస్థులు.—అంతే.

సాక్రటీసు. — మీరందరు స్త్రీలగర్భమున పుట్టితిరి; మీ పిల్లలు స్త్రీలగర్భమున పుట్టినారు; మీ కుమార్తెల గర్భములనుండి మీ మనుమలు మనుమరాండ్రు పుట్టుచున్నారు.

గ్రామస్థులు.—ఇదంతయు నిజమే.

సాక్రటీసు.—అట్లైన, స్త్రీలు మీలో ఒకభాగమని చెప్ప వలసినదేకదా?

గ్రామస్థులు. —అవును.

సాక్రటీసు.—వారు గౌరవార్హులు కానిపక్షమున మీరు మీ పిల్లలు మీ మనుమలు గౌరవార్హులుకారనియే గదా చెప్పవలెను.

గ్రామస్థులు.—ఆలాగే కనిపించుచున్నది.

సాక్రటీసు.—మీ పిల్లలందు మీకు ప్రేమయున్నదా?

గ్రామస్థులు. — పిల్లలను ప్రేమించనివారును కొందరుందురా?

సాక్రటీసు.—ప్రేమయుండియు మీరెంతటిపనిని చేయుచున్నారు. • వారి జన్మమునకు కారణమైనట్టియు, వారి పోషణమునకును సుగుణసంపత్తికిని వారి జీవితములోని ప్రధానదశయందు (శైశవము) నేర్పవలసిన శిక్షకును మూలాధారమని చెప్పవలసినట్టియు మీ స్త్రీలను మీరెంత తృణీకరించుచున్నారు. మీ పనియంతయు వెట్టిపని. మీకంటె మీ స్త్రీలే ఎక్కువ గౌరవమునకు దగినవారని చెప్పుటలో అతిశయోక్తి యేమియు లేదు. మీ పిల్లల పుట్టుకకును వారి శిక్షణమునకును మానవజాతి నశింపకుండుటకును గృహనిర్వాహణమునకును స్త్రీలేగదా కారణము?

గ్రామస్థులు.—ఇదంతయు సరియే.

సాక్రటీసు.—ఈ పనులన్నిటిలోకూడ వారు మీ సహధర్మచారిణులు కారా?

గ్రామస్థులు.—సందేహమేమియు లేదు.

సాక్రటీసు.—కావున మీరు వారిని సహధర్మచారిణులవలె ఆదరించి వారికితగిన గౌరవమును చూపి పిల్లలను చక్కగ పెంచుటకు కావలసిన విద్యను వారికి నేర్పినయెడల, నగలకై మిమ్ము పీడించుటమాని శుభ్రముగను ఆరోగ్యముగను అందము

గను ఉండు తమ పిల్లలను, సౌఖ్యదాయకములగు తమ ఇండ్లను చూచికొని వారు వానితో తృప్తిపొందియుందురు గదా?

గ్రామస్థులు.—ఈ యభిప్రాయముతో మే మేకీభవించుట కెట్టి సందేహము లేదు.

సాక్రటీసు.—భగవంతుని సృష్టిలో అందములైనవి—పిల్లలు చిన్న జంతువులు కాక—మరేమైననున్నవా?

గ్రామస్థులు.—లేకేమి? భగవంతుడు పుష్పములనుగూడ సృష్టించియున్నాడు.

సాక్రటీసు.—అట్లైన మీ యిండ్లనిండ పుష్పములున్న వనియు, ఋణముతీసియైనను మీరిట్టి సొగసైన వస్తువుల సమ కూర్చుకొనుచుందురనియు నేననుకొనుచున్నాను.

గ్రామస్థులు.—(నవ్వుచు) మాకెందుకు పుష్పములు?

సాక్రటీసు.—అందమైన వస్తువులపై మీకు నిజమైన ప్రేమ లేదనియేనా అర్థము.

గ్రామస్థులు.—ప్రేమ లేకపోలేదు. కాని పూలచెట్లను వేసి పెంచుటకు మాకు వ్యవధిలేదు; ఈ పనుల చేయుటకు మాకు తెలియనుకూడ తెలియదు. ఇందుకు కావలసిన విత్తనములు కూడ మావద్ద లేవు.

సాక్రటీసు—ఇంటిలోనుండు మీ ఆడువారు దీనినిగురించి ఏల నేర్చుకొనగూడదు? మీ యిండ్లను సొగసుగనుంచుటకై పూలచెట్లను పెంచుటకు వారికి వ్యవధియుండునని నేను తలచు చున్నాను. ఇండ్లను చక్కగనుంచుటకు వ్యవధిలేని స్త్రీ ఉండనే ఉండదు. ఇదంతయు అయినతర్వాత ఇంకను నగలుకావలెనని స్త్రీలు కోరినయెడల పిన్నవయస్సుననే అట్టివారు నగిషీపని నేర్చు కొనుటయు, తర్వాత దానిని తమ కుమార్తెలకు నేర్పుటయు

మంచిది. మీ డబ్బునంతయు నగలకై వ్యర్థపరచుటకు బదులు మీ ఆడువాండ్రు నగిషీపనియందో, పూలచెట్లను పెంచుట యందో తమ కాలమును గడపుచు ఇట్టి పనులలో ఒకరినిమించి మరియొకరు ఎక్కువనేర్పును సంపాదించుటకై ప్రయత్నింతురు. ఇట్టి మార్పు జరిగినయెడల కంసాలివద్ద ఎక్కువ నగలుచేయించు స్త్రీగాక ఎక్కువ తెలివితేటలుగల స్త్రీయే స్త్రీలందరిలో గణుతి గాంచును.

గ్రామస్థులు.—మహాశయా, మేమీ విషయమై ప్రయత్నముచేసెదము.

సాక్రటీసు.—మన సంభాషణయొక్క సారాంశ మిప్పటికి తేలినదిగదా? మీరు మీ స్త్రీలకు చదువుచెప్పింపవలెను. ఇంటిలో మీతో సమానముగా మీరు వారిని గౌరవించవలెను. ఇంటిని సొగసుగ నుంచుటయందును పిల్లలను శుభ్రముగను, సోల్లాసముగను ఉంచుటయందు మీరు వారికి తగు సహాయము చేయవలెను; చేతులతో నాణ్యమైనపనుల చేయుటకును, పూలచెట్లను పెంచుటకును వారికి మీరు నేర్పవలెను. మీ గ్రామములను కూడ అందములుగను, నివాసయోగ్యములుగను మీరు చేయవలెను. ఇదంతయు జరిగినయెడల నగలయొక్క ఆవశ్యకత ఉండనే ఉండదు. మీవద్ద డబ్బు మిగిలియున్నయెడల దానిని బ్యాంకిలో దాచుకొనుటకును ఏటేట అది అభివృద్ధిచేసికొనుటకును మీకు వీలుకలుగును. నగలు కొనుటయు అవి అరిగిపోవుటయు మీ అప్పులు వృద్ధియగుటయు తప్పును. అన్నిటికంటె ముఖ్యమైనదేమనగా మీ జీవితమును మీ కుటుంబములోనివారందరి జీవితమును సంతోషసౌఖ్యములతో నిండి ఉండును.

గ్రామస్థులు.—అయ్యా, మీ యుపదేశము మిక్కిలి చక్కగనున్నది. దానిప్రకార మాచరించుటకు మేము ప్రయత్నించెదము. కాని, వీనినన్నిటిని చేయుట కెన్నియో సంవత్సరములు పట్టును.

## నీళ్లు, కష్టాలు, ఎరువు

మరియొకపర్యాయము సాక్రటీసు గ్రామములోనికి వచ్చునప్పటికి గ్రామమందచ్చటచ్చట పేర్చిన పిడకలప్రోగులు అతని కంటబడెను. స్త్రీలు పిడకల పేర్చుటయందు మునిగియుండిరి; పురుషులు మంచములపై కూర్చుండి చుట్టలత్రాగుచుండిరి; ఎక్కడబట్టినను పెంటయే. దారిద్ర్యచిహ్నములులేని ప్రదేశములేదు. అంతయు ఉపేక్షకు లోనైనట్లగుపడెను.

“మిత్రులారా, నమస్కారములు. క్షేమముగనున్నారా,” అని సాక్రటీసు పలికెను.

మంచి ప్రశ్న వేసితిరి. క్షేమమునకు లోపమేమి? భూసారమంతయు తగ్గిపోయినది. మొలచిన పైరు అడవిపందులు ఎలుకలు తినివేయుచున్నవి. వర్షమూ లేదు. పొలములు ఎండిపోవుచున్నవి. జ్వరబాధవలన కలిగిన బలహీనత ఇంకను పోయినది కాదు. పశువులకు గడ్డిలేదు; మాకు అన్నములేదు. ఇట్టి స్థితిలో మా యోగక్షేమములు అడుగవలెనా?

అప్పుడే గాలి కొంచెము కొట్టుటవలన పెంటదిబ్బలోనుండి కొంత దుమ్ము సాక్రటీసుయొక్కయు తక్కిన గ్రామస్థులయొక్కయు ముఖములమీదవచ్చి పడెను. గ్రామస్థులు దీనిని లక్ష్య

పెట్టలేదుగాని సాక్రటీసుమాత్రము దగ్గుటకు మొదలిడెను; అతని కన్నులుగూడ మంటలెత్తసాగెను.

"ఎంత అసహ్యము," అని సాక్రటీసు అనెను.

గ్రామస్థులు.—ఇందులో ఏమియున్నది. గాలికొట్టునప్పు డంతయు మామూలుగ ఇట్లే జరుగుచుండును. మాకిది అల వాటే.

సాక్రటీసు.—మీ భూములు నిస్సారములగుచున్నవని విచారించుటకు కారణమేమి? ఈ పెంటనంతయు లోతైన గోతు లలో వేసి బాగుగ మగ్గినపిమ్మట పొలములలో పోసినయెడల మీ పొలములు మిక్కిలి సారవంతములగును కదా?

గ్రామస్థులు.—ఆలాగా! ఈ పని చేయుటకు మాకు కాలమేలేదు. ఈ విధముగ మా గ్రామమును శుభ్రపరచు కొనుటకు మాకు డబ్బు ఎక్కడిది? ఇదంతయు ధనికులకు వీలగు పనులు.

సాక్రటీసు.—ఈ అపరిశుభ్రతయే మీ దారిద్ర్యమునకు హేతువు. గ్రామముల నసహ్యపరచు ఈ పెంట పొలములను సారవంతములుగ చేయగలదు. మీరు ధనికులు కాకుండుటకు కారణమేమియో నాకు తెలియుటలేదు. మీ గ్రామవీధుల వెంట వచ్చుచుండగా ఎన్నియో చెట్లు క్రిందపడి పుచ్చిపోవు చుండుట నేను చూచితిని. ధనికులు తప్ప తక్కినవారెవరైన ఇంత నిర్లక్ష్యభావముతో వీని పుచ్చిపోనిత్తురా?

గ్రామస్థులు.—ఈ కొయ్యలతో మాకేమిపని? వీని కొను వారెవ్వరు ఈ చుట్టుపట్లలేరు.

సాక్రటీసు.—వంటకును పాలుకాచుకొనుటకును మీరే వీని నుపయోగింపరాదా?

గ్రామస్థులు.—మాకిది అక్కరలేదు. మేము పిడకల నుప యోగించుచున్నాము.

ఇది వినగనే సాక్రటీసు పకుక్కన నవ్వెను.

గ్రామస్థులు.—ఏమి? అంత బిగ్గరగ నవ్వుచున్నారు.

సాక్రటీసు.—నవ్వక ఊరకుండుటెట్లు. మీ చర్యలన్నియు చిత్రములుగ నున్నవి. భూమి సారహీనమగుచున్నదనియు, దారిద్ర్యము దుర్భరమగుచున్నదనియు మీరొకవైపు దుఃఖించుచు, మరియొకవైపు పిడకలన్నిటిని కాల్చివేయుచున్నారు. పిడకలను ఎరువుగ ఉపయోగించినయెడల ఇంతకంటె పదింతలు అధికమగు లాభము దొరుకునుకదా? పిడకలను మీరు కట్టెపుల్లలకు బదులుగ వాడుచుండ ఈ ఎండిన చెట్లన్నిటిని చెదపురుగులు తినిపోవుచున్నవి. దరిద్రులెక్కడైన చెదపురుగులను పెంచెదరా? ఆ పిడకలకుప్ప ఖరీదెంత?

గ్రామస్థులు.—అయిదు రూపాయలకు తగ్గదు.

సాక్రటీసు.—దానినే ఎరువుగ అమ్మినయెడల ఎంత సొమ్ము వచ్చును.

గ్రామస్థులు.—సొమ్ము మాటకేమి? అంతటి ఎరువువేసిన యెడల, మరి అయిదారుతూముల ధాన్య మెక్కువగ పండును. దానితోపాటు రెండుబండ్ల గడ్డికూడవచ్చును.

సాక్రటీసు.—అనగా ఏబది రూపాయలు లాభమని చెప్ప వచ్చునా?

గ్రామస్థులు.—అంతకంటె తగ్గదు.

సాక్రటీసు.—మీ భూమి నిస్సారమగుటకును, మీరు దరిద్రులగుటకును కారణమిప్పుడైన తెలిసినదా? ఒక కుచ్చెల పిడకల పెట్టుటకు మీ ఆడువారి కెంతకాలముపట్టును.

గ్రామస్థులు.—మూడు నెలలు.

సాక్రటీసు.—మూడు నెలలకాలము మీ స్త్రీలు ఈ పెంట లోపడు కష్టమువలన కలుగు ఆదాయము అయిదు రూపాయలా? ఒక చొక్కాకుట్టుటకై దర్జీవానికి మీ రిచ్చుకూలి ఎంత?

గ్రామస్థులు.—నాలుగణాలో ఆరణాలో.

సాక్రటీసు.—ఒక చొక్కాకుట్టుట కతని కెంత కాలము పట్టును?

గ్రామస్థులు.—రెండు గంటలకాలము.

సాక్రటీసు.—నాలుగణాల విలువగల పిడకలచేయుటకు మీ ఆడువారి కెంతకాలముపట్టును?

గ్రామస్థులు.—సుమారొక వారము.

సాక్రటీసు.—పిడకల పెట్టుటకంటె, చొక్కాకుట్టుట మీ ఆడువారికి లాభకరముగదా?

గ్రామస్థులు.—మా ఆడువారికి చొక్కాలకుట్టుట రాదు.

సాక్రటీసు.—రాదన్న మాట నాకుకూడ తెలియును. పుట్టినప్పటినుండియు పిండివిసరుటయు పిడకలపెట్టుటయు తప్ప మరేమియు వారెరుగరు. సరేగాని, పిడకలపెట్టుట, బట్టల కుట్టుట—ఈ రెండు పనులలో ఏది ఎక్కువ గౌరవమైనది?

గ్రామస్థులు.— సందేహమేమున్నది. బట్టలకుట్టుటయే గౌరవమైన పని.

సాక్రటీసు.—అట్లైనను మీరేమి చేయుచున్నారు? తక్కువ జాతివాడని భావింపబడు దర్జిచేత బట్టల కుట్టించుకొనుచున్నారు; ఎక్కువజాతివారగు మీ ఆడువారిచేత పిడకలపెట్టించుచున్నారు.

గ్రామస్థులు.—నిజమే.

సాక్రటీసు.—ఇట్టి సందర్భములో దర్జీచేత పిడకల పెట్టించి మీ స్త్రీలచేత బట్టలకుట్టించుట యుక్తియుక్తముగదా?

గ్రామస్థులు.—కానేకాదు. దర్జీవాడు పిడకల పెట్టనే పెట్టడు.

సాక్రటీసు.—వాడు చేయడన్న మాట నాకును తెలియును. వాడట్టి తెలివిమాలినవాడు కాడు. పిడకలపెట్టుటయే అనావశ్యకమని నా అభిప్రాయము. మీ దారిద్ర్యమునకంతకు, పిడకలపెట్టుటయే కారణము.

గ్రామస్థులు. — పిడకలులేనియెడల మేము వంటచేసికొనుట యెట్లు? పాలను కాచుకొనుటెట్లు?

సాక్రటీసు. — మీ ఊరిచుట్టు పడి పుచ్చిపోవుచుండు వందలకొలది చెట్లకట్టెలతోడను మీ పొలములో పండు జొన్న, సజ్జ, జనుము మొదలగువాని దంట్లతోడను వంటచేసికొనవచ్చును.

గ్రామస్థులు.—కాని, కట్టెలతో పాలను కాచునపుడు మా స్త్రీలు ప్రొయ్యిదగ్గరనే కూర్చుండి పాలు పొంగకుండ చూచుచుండవలెను. ప్రొయ్యిని వదలి అటు ఇటు వెళ్లుటకు వీలుండదు.

సాక్రటీసు.—ఇందులో తప్పేమియున్నది? పిడకలపెట్టుటలో వినియోగమగు కాలమంతయు పాలు కాచుటలో వినియోగమగును. పాలు కాచుచు వారు మీకును మీ పిల్లలకో లేక సొంత ఉపయోగమునకో బట్టల కుట్టుచుండవచ్చును. మీరిప్పుడు దర్జీవానికిచ్చు కూలి మీకు మిగులును. ఇంతే కాదు. ఈ మధ్య నెల్లూరిలో జరిగిన సంతయందు నేనొక

"సెపరేటర్" అను మిషనును చూచితిని. అది బహు సుల భముగ పాలనుండి వెన్నను వేరుపరచగలదు. దానివలన మనకు మామూలుగ లభించు నెయ్యికంటె ఎక్కువ నెయ్యియు మంచి నెయ్యియు దొరకుటయేగాక దీనికంతకు కావలసిన కట్టెలు మామూలుగ మనముపయోగించువానిలో అయిదవ వంతుకంటె ఎక్కువ కావలసివచ్చుటలేదు. పశువులకు మేత దొరకుటలేదని మీరు నాతో చెప్పియుంటిరిగదా?

గ్రామస్థులు.—అవును. మేత చాల తగ్గియున్నది.

సాక్రటీసు.—దీనికికూడ కారణమిదియేకదా? పేడను, పెంటను, చెత్తను మీరు పొలములలో వేయుటలేదు. సత్తువ చేయనియెడల గడ్డి ఎట్లు పెరుగును?

గ్రామస్థులు.—సత్తువచేసినప్పటికిని పంటలు పండుటకు వర్షమెక్కడిది?

సాక్రటీసు.—నేను వచ్చుచున్నప్పుడు నాకగపడిన ఆ మడుగు ఏమిటిది?

గ్రామస్థులు.—అదియా? దానివలన మాకెట్టి ప్రయోజ నములేదు. మేము సేద్యముచేయుటకు వీలులేకుండునట్లు మా పొలములలో కొన్నిటిని ముంచుట తప్ప దానివలన మరే లాభము మాకు కలుగుటలేదు.

సాక్రటీసు.—అందులోని నీటిని మీ పంటలకేల ఉపయో గింపరాదు?

గ్రామస్థులు.—ఎట్లు?

సాక్రటీసు.—ఏమీ? కాలువలు త్రవ్వి నీటిచక్రము నేల పెట్టకూడదు?

గ్రామస్థులు.—ఇది మేమెన్నడు చేసినదికాదు. మాకీ అలవాటులేదు. ఇందుకు కావలసిన ద్రవ్యముకూడ మావద్దలేదు.

సాక్రటీసు.—సర్కారువారును పరపతి సంఘమువారును అప్పిచ్చెదరుకదా?

గ్రామస్థులు.—అప్పైన కేమిగాని, మేనెల వచ్చునప్పటికి ఈ నీళ్లంతయు ఎండిపోవునే?

సాక్రటీసు.—నేల తక్కువ పంటలన్నియు పండును. ఒక వేళ మీలో తెలివిగలవారెవరైన చెరకువేసినయెడల అందుకై మీరొక చిన్ననూతిని త్రవ్వి (వర్షమువచ్చి మడుగు నిండువరకు) దానినుండి మీ పొలమునకు నీరెత్తవచ్చును.

గ్రామస్థులు.—పందులువచ్చి మా పైరులను తినివేయు చుండును. చెరకువేయుటవలన లాభమేమి?

సాక్రటీసు.—పందులెక్కడనుండి వచ్చుచున్నవి?

గ్రామస్థులు.—ఆ పొదలలోనుండి.

సాక్రటీసు.—పొదలలో అవి ఎట్లు నివాసముచేయగలవు?

గ్రామస్థులు. — పొదలలోని ఆ ముండ్లచెట్లక్రింద అవి నివసించును.

సాక్రటీసు. — పందులవలన మీకు లాభములేనియెడల మీరా ముండ్లచెట్ల నేల పెంచెదరు?

గ్రామస్థులు.—(నవ్వుచు), అయ్యా, ముండ్లచెట్లను పెంచు నంతటి మూఢులెవ్వరు లేరు.

సాక్రటీసు.—ఆ పొదలెవరివి? మీవేకదా?

గ్రామస్థులు.—మావే.

సాక్రటీసు.—ముండ్లచెట్లు మీకక్కరలేనియెడల మీరు వాటి నెందుకు పెరుగనిచ్చుచున్నారు?

గ్రామస్థులు.—తమంతట తామే పెరుగుచున్నవి.

సాక్రటీసు.—తమంతట తామే? ఆ పొదలు మీరావని చెప్పితిరే? మీ యిండ్లలో ముండ్లచెట్ల పెరుగనిచ్చుచున్నారా?

గ్రామస్థులు.—పెరుగనియ్యము.

సాక్రటీసు.—మీ యింటియందు ముండ్లచెట్టైన మొలచినయెడల మీరేమి చేయుదురు?

గ్రామస్థులు.—పెరికివేసెదము.

సాక్రటీసు.—అట్లైన ఆ పొదలలోనుండు ముండ్లచెట్లనేల కొట్టివేయరు? అప్పుడు పందులక్కడ ఉండుటకు వీలుండదుకదా? సరేకాని మీకా పొదలెందుకు?

గ్రామస్థులు.—అయ్యా మా పూర్వులు పశువులమేతకై ఏర్పరచిన బీడుప్రదేశమే అది.

సాక్రటీసు.—మీ పశువులు నాగుజెముడు మొదలగు ముండ్లచెట్లను తినునా?

గ్రామస్థులు.—తిననే తినవు.

సాక్రటీసు.—ఈ ప్రదేశమంతయు ముండ్లచెట్లతో నిండియున్నదే.

గ్రామస్థులు.—నిజమే

సాక్రటీసు.—పశువులమేతకని బీటిప్రదేశము నేర్పరచుటలో మీ పూర్వులకుండిన ఉద్దేశము నెరవేరుటలేదనియు, దీనివలన అడవిపందులుమాత్రమే బ్రతికిపోవుచున్నవనియు గదా దీని అర్థము.

గ్రామస్థులారా, మీరెంతో తెలివితక్కువవారు. ముండ్లచెట్లను కొట్టివేయుటకు బదులు మీరీ బీటిపొలమునంతయును పాడుచేయుచున్నారు. మీ పశువులకన్ననో మేత

లేదు. ఈ బీడంతయు అడవిపందుల కాశ్రయమైనది. అవి అచట దాగియుండి అప్పుడప్పుడు పైకివచ్చి మీ పైర్లను పాడు చేయుచున్నవి. కట్టెలకుగాను మీరు చెట్లనువేసి పెంచుట లేదు; తమంతట పెరిగినచెట్లను చెదపురుగులవాతబెట్టి ఎరువు నంతయు కట్టెలకుబదులుగ కాల్చివేయుచున్నారు. పైరులకు కావలసిన సత్తువలేదు; భూమి సారహీనమగుచున్నది. తినుటకు మీకాహారములేదు; మీ పశువులకు మేతలేదు. గ్రామమంతయు పెంటతో నిండియున్నది. మీ పిల్లలకును మీకును వచ్చుచుండు రోగముల కిదియే కారణము. దీనిని గోతులలో వేసియుంచి పక్వమగు ఎరువైనతర్వాత పొలములోనికి తీసికొని పోవలెను. మీరట్లు చేయుటలేదు. మడుగులోని నీళ్లను పైర్లకు మీరుపయోగించుటలేదు. నీళ్లు, కట్టెలు, ఎరువు మీకున్నవి; కాని వీనిని మీరు వ్యర్థపుచ్చుచున్నారు. రైతు భాగ్యవంతుడగుటకు కావలసినవి ఈ మూడేగదా? కాని ఈ మూటిని మీరు రిత్తపుచ్చుచు దారిద్ర్యము పీడించుచున్నదని గోడుగోడున ఏడ్చుచున్నారు.

## గ్రామమును శుభ్రపరచుకొనుట—స్వయంసహాయము

మరియొకనాడు సాక్రటీసు గ్రామమునకు వచ్చునప్పటికి గాలి అతి తీవ్రముగ వీచుచుండెను. వీధులలోని పెంట బూడిద, దుమ్ము పైకిరేగుచు ప్రజల కన్నులలోను, ఊపిరితిత్తులలోను ప్రవేశించుచుండుటచేత అచట నిలబడుటయే కష్టమయ్యెను.

సాక్రటీసు.—ఈ దుమ్ము మీలో పడుచు మీ కడుపులో ప్రవేశించుచు మీ అన్నమును నీళ్లను అపరిశుభ్రపరచుచు

మీకు విరేచనవ్యాధిని కల్పించుచు మీ యొక్కయు, మీ పిల్లలయొక్కయు ఆరోగ్యమును చెరచుచు—ఇంతటి యుపద్రవమును కలిగించుచుండుట మీకు కష్టముగ లేదా?

గ్రామస్థులు.—మేమేమి చేయగలము? వీధులను శుభ్రపరచవలెనని మేము వీధుల తుడుచువారిని ఆజ్ఞాపించితిమి; కాని వారీకాలములో మామాట లక్ష్యపెట్టుటయే లేదు. పనిచేయుట లేదని మేము వారి చెవులను మెలిబెట్టినయెడల వెంటనే వారు మాపై నేరము మోపి దావాచేయుటకు సిద్ధమగుచున్నారు.

సాక్రటీసు.—ఈ గ్రామమునకు అధికారులు వీధుల తుడుచువారనియేనా మీ అభిప్రాయము.

గ్రామస్థులు.—వారధికారులెట్లగుదురు? రైతులమగు మేము అధికారులము.

సాక్రటీసు.—మీరు సుఖముగనుండుటో, లేకుండుటో నిర్ణయించువాడు వీధులతుడుచు పాకీవాడనిగదా మీరిప్పుడు చెప్పితిరి? గ్రామమును శుభ్రముగనుంచుటయు ఉంచకపోవుటయు అతని యిష్టమేకదా! వీధుల నతడు తుడిచినయెడల మీరు సుఖముగనుందురు; లేనియెడల మీరిప్పుడు పడుచుండు అవస్థయే పడుచుందురు. గనుక మీరు పాకీవాని అధీనమందున్నవారని చెప్పవలసియున్నది.

గ్రామస్థులు.—అవును.

సాక్రటీసు.—గనుక ఈ గ్రామమునకు పాకీవాడు యజమానుడు.

ఒక గ్రామస్థుడు.—(కంటిలోపడిన దుమ్మువలని బాధ తొలగుటకై కన్నుల నలుపుకొనుచు) ఇప్పట్లో అతడే యజమానుడని తోచుచున్నది.

సాక్రటీసు.—కాని గ్రామమునంతయును అసహ్యముగ చేసినవారెవ్వరు? పెంటనంతయును వీధులలో వేసినవారెవరు?

గ్రామస్థులు.—మేము, మా స్త్రీలు.

సాక్రటీసు.—పాకీవారు వీధుల చిమ్మరను భయమున్నపుడు మీరిట్లేల చేయుచున్నారు.

గ్రామస్థులు.— ఇది మా ఆచారము.

సాక్రటీసు.—గ్రామముచుట్టు మీరీమధ్య త్రవ్విన గోతులలో దీని నెందుకు పడవేయకూడదు? మీరట్లు చేసినయెడల పాకీవాడు మీ మాట వినినను వినకున్నను మీ గ్రామము శుభ్రముగనుండును గదా? సరేగాని, వీధులను మీరే ఎందుకు చిమ్మకూడదు?

గ్రామస్థులు.—మేము గొప్ప కులమువారము. వీధులను చిమ్మవలసినవారు మాలమాదిగలు.

సాక్రటీసు.—గొప్పకులములో పుట్టినవారిపని గ్రామమును అశుభ్రపరచుటయు తక్కువకులములో పుట్టినవారిపని శుభ్రపరచుటయా?

గ్రామస్థులు.—దీనికి సందేహమేమి?

సాక్రటీసు.—ఒక వస్తువును మైలపరచుట ఎక్కువ గౌరవమైన పనియా? మైలను తుడిచివేయుట గౌరవమైన పనియా?

గ్రామస్థులు.—మైలను తీసివేయుటయే గౌరవమైన పని. సందేహమేమున్నది?

సాక్రటీసు.—పాకీవాడు మీకంటె గౌరవపాత్రుడనియే కదా దీని కర్థము?

గ్రామస్థులు.—కానేకాదు.

సాక్రటీసు.—అట్లైన మీరే ఈ పని నెందుకు చేయ కూడదు?

గ్రామస్థులు.—మా కలవాటులేదు.

సాక్రటీసు.—అట్లైన మీరు అశుభ్రపరచు అలవాటుగల వారేలకావలెను? ఎవనికర్మ వాడనుభవించవలెనను ధర్మము మీకు తెలియనిదా? గ్రామమును అశుభ్రపరచువాడుగదా దానిని శుభ్రపరచవలెను? శుభ్రముగనుండుట మీ మతమున కేమైన విరోధమా?

గ్రామస్థులు.—కాదు.

సాక్రటీసు.—అట్లైన మీరే మీ గ్రామమును శుభ్రపర చుకొనరాదా? మీరే శుభ్రపరచుకొనవలసివచ్చినట్లైన, మీ రింత అశుభ్రపరతురని నేను తలంపను. ఇదిగాక, గ్రామమం దుండి మీరు వెలుపలికి తీసికొనిపోవు ప్రతి వస్తువు ఎరువుక్రింద ఉపయోగమగునుగదా? కావున మీరెంత చక్కగ వీధులను చిమ్మి ఎంత ఎక్కువగ శుభ్రపరచెదరో అంత ఎక్కువగ మీకు ఎరువు దొరకును. ఎరువును చక్కగా సంగ్రహించుట సేద్యము నకు మిక్కిలి అవసరముగదా?

గ్రామస్థులు.—ఉత్తమమైన సేద్యమున కదియే లక్షణము.

సాక్రటీసు.—వీధులను చిమ్ముట అనుటకు బదులు ఎరువును సంగ్రహించుట అను పేరుపెట్టినయెడల గొప్ప రైతులుకూడ చేయుటకు తగినదని ఈ పని అనిపించుకొనును గదా?

గ్రామస్థులు.—తప్పక.

సాక్రటీసు.—సరే. ఇది మొదలు వీధులను చిమ్ముట అను మాటలను మరచిపొండు. ప్రతిదినము ప్రతి గృహస్థుడు తన శక్తికొలది కొంత ఎరువును సంగ్రహింపవలెనని ఒక ఏర్పాటును

మీరు చేసికొనుడు. అట్లు చేసికొనినయెడల మీ గ్రామ మందు పెంటయనునది ఉండనే ఉండదు.

గ్రామస్థులు.—ప్రయత్నముచేసి చూచెదము.

సాక్రటీసు.—దీని సారాంశము తెలిసినదా? రైతనువాడు తన గ్రామమునకు యజమానుడు కావలెను. గ్రామమును శుభ్రముచేయు పూచీ అతనిపై నున్నది కావున అతడు దాని నెప్పుడు అశుభ్రముగనుంచుట కిష్టపడడు. నౌకర్లవలన గ్రామమును శుభ్రముచేయించువారికి అశుభ్రతయనిన లక్ష్యమేయుండదు. గ్రామములను శుభ్రముచేయు భారము తమపై పడినప్పుడే గ్రామస్థులు పెంటను వీధులందువేయుటకు సంశయింతురు. కావున నిజమైన సంసారి తన గ్రామము అశుభ్రముగ నున్నదనియు, ఎరువువలన మంచి పంటలు పండుననియు గ్రహించి వీధులలోని పెంటనంతయును స్వయముగ సంగ్రహించును. గ్రామమును శుభ్రపరచుటయనిన, ఎరువును కూర్చుట తప్ప వేరుకాదని గ్రహించినవాడై అతడు గ్రామమును కడు జాగరూకతతో శుభ్రపరచుచు ఆ పనికై యితరులపై ఆధారపడుట మానును......ఆ, ఏమి ఇది? ఇట్టి అసహ్యపు కంపుకొట్టుచున్నది.

గ్రామస్థులు.—ప్రతి ఉదయము ఈ చుట్టుపట్లనుండు పొలములలో బహిర్భూమికి వెళ్లుచుందుము. అదియే దీనికి కారణము.

సాక్రటీసు.—గాలికొట్టినప్పుడంతయు ఈ కంపు గ్రామమందంతటను వ్యాపించుచున్నది. ఈగలు ఈ కశ్మలముపై వ్రాలి, అటుపిమ్మట మీ పిల్లల కన్నులపై వ్రాలుచుండును. మీ పిల్లలు గ్రుడ్డివారైపోవుట కిది కారణమను మాట మీకు

తెలియదు. వాని జోళ్లను తీసివేసి పాదముల కడుగుకొని అటు పిమ్మట ఈ ఈగలు మీ అన్నముమీఁదను, మీ పిల్లల కన్నుల మీఁదను వ్రాలుననియా మీ తాత్పర్యము?

గ్రామస్థులు.—ఇదికూడ మాకు మామూలు. ఎల్లప్పుడు ఈ పొలములే మేము బహిర్భూమికి పోవుచోటు.

సాక్రటీసు.—అయ్యా, మీరిప్పుడీ గోతులను త్రవ్వితిరి గదా? రెండు కొయ్యచెక్కలు ఆ గోతిపైవేసి ఒక గోడనో తెరనో దానిచుట్టు కట్టినయెడల అది ప్రశస్తమైన మరుగుదొడ్డిగ మారునే. వీథులలోను, ఖాళీస్థలములలోను మీరు ప్రతి ఉదయము పోయుచుండు బూడిదెనంతయును ఈ గోతిలో ఏల పడ వేయరాదు? మనుష్యుని మలము బహు ప్రశస్తమైన ఎరువు. బూడిదెకూడ మంచి ఎరువే ఈ గోతిని మరుగుదొడ్డిగ ఉప యోగించి దానియందు బూడిదె పోయసాగినయెడల ప్రశస్త మైన ఎరువులు రెండు మీకు లభించును. గ్రామమందీ దుర్గంధ ముండదు; ఇప్పటివలె ఈ బూడిదె గాలికి కొట్టుకొనిపోవుటయు మీ కన్నులలోను, అన్నములోను పడుటయు తప్పిపోవును.

గ్రామస్థులు.—ఆర్యా, మేమట్లే చేసెదము.

సాక్రటీసు.—ఇప్పుడు మీరేమిచేయుచున్నారో ఎరుగు దురా? మతము మతము అని చెప్పుచు పెంటను ముట్టుకొనుట కును, గ్రామమును శుభ్రపరచుటకును భయపడుచున్నారు; కాని మీరు తిను అన్నమందును, త్రాగు నీటియందును, పీల్చు గాలియందును ఈ దుర్గంధపు అంశములు చేరుచున్నవి. మీ మతము దీనినంతయు నంగీకరించుచున్నదా ఏమి? గాలి వీచు నప్పుడును, పశువులు నడుచునప్పుడును, నేలమీఁదనుండు కశ్మల

మంతయు పైకిలేచి మీరు పీల్చు గాలితోడను, తిను ఆహారము తోడను, త్రాగు నీటితోడను మీలోపల ప్రవేశించుచున్నది.

గ్రామస్థులు.—మతమిదంతయు చేయుమని చెప్పుచున్నట్లు మేమికవినాదట చెప్పము. అందరు పరిశుభ్రముగ నుండవల యునని యే మామత ముపదేశించుచున్నది. గనుక మేము మీ సలహా ననుసరించి మా గ్రామమును శుభ్రపరచుకొనె దము. అట్లు చేసినయెడల ఎరువు ఎక్కువ దొరకును; మాకును మా పశువులకును కావలసిన ఆహార మధికముగ నుత్పత్తి యగును.

సాక్రటీసు.—మంచిది. మీరు చెప్పునది సరి. త్వరలో మీ గ్రామములు మనుష్యులు నివసించుటకును, పిల్లలుపుట్టి చక్కగ పెరుగుటకును, యోగ్యములు కాగలవని నేను నమ్ముచున్నాను. సెలవు. ఈ కంపువలనను ఈ రేగుచుండు దుమ్మువలనను నాకు ఇచ్చట నిలుచుట కష్టముగానున్నది. నేను వెళ్లెదను.

గ్రామస్థులు.–చిత్తం. ఈ పర్యాయము మీరు వచ్చులో పల మీరుకూడ కూర్చుండుటకు తగునట్లుగ మా గ్రామమును శుభ్రపరచెదము.

## స్వభావసిద్ధములట! ప్రతీకారము లేదట!

ఒక మధ్యాహ్నము సాక్రటీసుగారు గ్రామమునకు వచ్చి ఒకచోట కూర్చుండి ఏమియు తోచనివానివలె నగపడగా గ్రామస్థు లతనిచుట్టుచేరి, "సాక్రటీసుగారూ, మీరేమో వ్యా కులపడుచున్నట్లున్నదే? మీ విచారమునకు కారణమేమి?" అని అడిగిరి.

సాక్రటీసు.—విచారముతోడనే ఉన్నాను. నాతో మీ రెల్లప్పుడు మీ దారిద్ర్యమునుగూర్చి మొరబెట్టుకొనుచుండెదరు; కాని నేను మీ గ్రామమునకువచ్చు దారిలో పైరునంతయును ఎలుకలు తినివేయుట చూచితిని; ఎక్కడబట్టిన ఎలుకల కలుగులే (కన్నములే); నిర్భయముగ ఎలుకలు పైరును కొరుకుచుండుట నేను చూచితిని.

గ్రామస్థులు.—ఓహో: ఇది స్వభావసిద్ధము. ఇందులో మనము చేయగలిగిన దేమున్నది.

సాక్రటీసు.—ఇంతేకాదు. మరి కొంతదూరము వచ్చునప్పటికి మేతలేక ఒక వట్టి బయలుప్రదేశములో నిలబడియుండు మీ పశువులును దానికెదుట ముండ్లపొదలతో నిండిన యొక విశాలప్రదేశమును నాకంటబడెను. దగ్గరనున్న పశువుల పిల్లవానిని చూచి, "అందులోని పచ్చనిపదార్థమును మీ ఆవులు తినుటలేదేమి?" అని అడిగితిని; కాని అతడు నన్నుచూచి నవ్వెను. "ఏమీ, ఈ నాగుజెముడు ముండ్లకంపలు—వీనిని మీ పశువులు తినవా," అని అడిగితిని. నేనెవడనో యొక పిచ్చివాడనని భావించి అతడు తన చేతితో తల గీరుకొనెను.

గ్రామస్థులు.—నిజమే. ఇట్టి ప్రశ్నవేయువాడు తప్పక పిచ్చివాడనియే అతడూహించియుండును.

సాక్రటీసు.. సరేగాని, పశువులు తిననట్టి ముండ్లచెట్లను మీరేల పెంచుచున్నారు.

గ్రామస్థులు.—మేము పెంచుటలేదు. అది స్వభావసిద్ధముగా పెరుగుచున్నవి.

సాక్రటీసు దీనికి జబాబుచెప్పులోపల వీథిలో కుక్కలు జగడమాడు శబ్దము వినబడెను; ఇంతలో నొక డచటికి పరుగెత్తు

కొనివచ్చి కుక్క యొకదానికి పిచ్చిపట్టెననియు, అది యొక బిడ్డను కరచెననియు చెప్పెను.

సాక్రటీసు.—ఈ కుక్కలవలన మీకేమైన లాభముకలదా?

గ్రామస్థులు.—లేదు.

సాక్రటీసు.—అట్లైన వానిని ఏల పెంచెదరు? నేనెక్కడికి వెళ్లినను కుక్కలు, కుక్కపిల్లలు అనేకములు నాకు కనబడుచున్నవి. వానివలన మీకెట్టి ప్రయోజనములేనియెడల మీరెందుకు వానిని పెంచుచున్నారు.

గ్రామస్థులు. — మేము వానిని పెంచుటలేదు. అవి స్వభావసిద్ధముగా బుట్టి పెరుగుచున్నవి.

సాక్రటీసు.—మిత్రులారా, ఈ గ్రామమునకు యజమానులు మీరేనా?

గ్రామస్థులు.—మేమే. కాకేమి?

సాక్రటీసు.—అలాగా? అయితే "స్వభావసిద్ధము, స్వభావసిద్ధము" అని పలుమారు మీరు చెప్పుచుండు దానికి అర్థమేమి? ఎలుకలు మీకక్కరలేనియెడల వానిని చంపరేమి? కుక్కలవలన లాభములేనియెడల వానిని చంపకుండుటకు కారణమేమి? నిరుపయోగములగు పొదలు చెట్లు మీకక్కరలేనియెడల వానినేల కొట్టివేయరు? నిరుపయోగములగు ఈ కుక్కలనన్నిటిని చంపి, ప్రతి మనుష్యుడును సొంతముగ మంచికుక్క నొకదానిని పెంచి పోషించి విశ్వాసపూర్వమగు దానిసహాయమును పొందరాదా? ఎలుకలనన్నిటిని నాశముగావించి మీ భూముల నుండి మంచిపంటల పండించుకొనరాదా? యోగ్యుడైన రైతు తన పొలములో ముండ్లచెట్లను పెరుగనిచ్చి దానిని చెడగొట్టు కొనడు. తనకు కావలసిన చెట్లను పొదలనుమాత్రమే

పెంచును; తన పైర్లను ఎలుకలవాత పెట్టడు; ఎలుకలనన్నిటిని చంపివేయును. గ్రామమందంతట నిరుపయోగములైన కుక్కలను తిరుగనియ్యడు; కుక్కలనన్నిటిని నిర్మూలమైన చేయును లేక చక్కగ పోషించి వానిలో మంచిజాతి కుక్కలను ఇంటియం దుంచుకొనును. యోగ్యుడైన రైతున కివియే లక్షణములు. మీ పొలములలో ఎలుకల నుండనిచ్చినయెడల ఆ పొలములకు యజమానులు మీరని చెప్పుటకు వీలులేదు. నిజమైన యజమానులు ఎలుకలే; పండినదానిని మొట్టమొదట అనుభవించునవియే; అవి యనుభవించినతర్వాత శేషించునది సున్నయే. గ్రామమును పాకీవారిచే చిమ్మించునంతవరకు మీరు పాకీవారికి దాసులు. వీధులవెంట తిరుగు కుక్కల బాధలకు మీరు లోబడునంతవరకు మీరు కుక్కలకు నౌకర్లని చెప్పదగి యుందురు. అట్లే బీడుప్రదేశములపై ముండ్లచెట్లు పెరుగునంతవరకు మీరాచెట్లకు బానిసలని చెప్పవలసియుండును.

## పల్లెటూరి కుక్కలు

గ్రామస్థులు కొందరు వెంటరాగా సాక్రటీసు గ్రామమందంతట తిరిగి వెలుపల కొంతదూరము వచ్చెను. అప్పుడతడు తన స్నేహితులను చూచి ఈ విధముగ పలికెను. "మనమిప్పుడు మీ ఇండ్లకు కడుదూరముగవచ్చి దుర్గంధము దుమ్ము లేనట్టి శుభ్రమైనగాలిని పీల్చగలిగియున్నాము గనుక కొంతసేపిచట కూర్చుండి హాయిగ మాటలాడవచ్చును. ఒక క్రొత్త విషయమునుగురించి నేను మీవద్ద నేర్చుకొనవలసియున్నది. మీ గ్రామము కుక్కలమయమై యున్నది; కాని ఆ కుక్క

లకు యజమానులు లేరు; అవి ఉపయోగమైనపని దేనిని చేయుచున్నట్లగపడలేదు; వానిస్థితి బహు దుఃఖకరముగ నున్నది; వాని శరీరములు గజ్జి మురికిపుండ్లు—వీనితో నిండి యున్నవి. నిజముగా అవి మీ పిల్లలకంటె అధ్వాన్నముగ నున్నవని చెప్పవలసియున్నది. మీరు వాని విషయము తలంచుటయే లేదా? ఏమి?

గ్రామస్థులు.—మాకు వ్యవధి ఎక్కడిది? ఇదిగాక ఇవి నిరుపయోగములైన జంతువులు.

సాక్రటీసు.—అట్లైన వానిని మీ గ్రామములో నేల ఉంచుకొనుచున్నారు.

గ్రామస్థులు.—అవి యుండుటకు కారణము మేముకాము. వానియంతట అవి వచ్చును; ఉండును.

సాక్రటీసు.—మిత్రులారా! గ్రామములో జరుగుదానికంతకు మీరే పూచీయని నేనెన్నిమార్లు చెప్పితిని? గ్రామమునకు యజమానులు మీరుకాని కుక్కలుకావుగదా? అవి గ్రామమందుండుటకును, గ్రామములో వానియొక్క నడతకును మీరే పూచి. అవి నిరుపయోగములనిగదా మీరిప్పుడు చెప్పితిరి. అవి నిరుపయోగములుమాత్ర మగుటయే కాదు. అవి కాజేయు భోజనపదార్థములు, వానియొక్క అఱపులు, వానిలో కొన్నిటికి పిచ్చిబట్టి మిమ్ములను కరచుట—ఇదంతయు ఆలోచించినయెడల వానివలన విస్తారనష్టము కలుగుచున్నదనికూడ చెప్పవలెను.

గ్రామస్థులు.—నిజమే.

సాక్రటీసు.—అట్లైన మీరేల వానిని నాశనముచేయుట లేదు?

గ్రామస్థులు.—అది మా మతమునకును, ఆచారమునకును విరుద్ధము. అవి కుక్కలైనను భగవంతుడేగదా తక్కిన జంతువులవలె వానినిగూడ సృష్టించినవాడు.

సాక్రటీసు.—చక్కనిజబాబు. మనుష్యులవలె కుక్కలు కూడ భగవత్సృష్టిలో చేరినవేకాని భగవంతుడు కుక్కల నెందుకు సృష్టించెనో మీకు తెలియునా? కుక్క పెంపుడు జంతువు. తక్కిన పెంపుడుజంతువులన్నియు మీ లాభము కొరకుగదా సృష్టింపబడియుండుట. స్వారిచేయుటకు గుఱ్ఱము, పాలిచ్చుటకు ఆవు, మరియొక ప్రయోజనమునకై మరియొక జంతువు సృష్టింపబడియున్నవిగదా? కుక్కమాత్రము మీకు తొందరను బాధను కలిగించుటకై సృష్టింపబడినదా?

గ్రామస్థులు.—ఆలాగే తోచుచున్నది.

సాక్రటీసు.—మూర్ఖులారా! అట్లైన భగవంతుడు నిందార్హుడనియా మీ యభిప్రాయము? మీ బుద్ధిహీనతకును, క్రౌర్యమునకును మీరు తిరిగి దేవుని నిందించుచున్నారే. ఈ దోషమును భగవంతునిపై వేయవచ్చునా? మనుష్యుని మూర్ఖతకు పరమేశ్వరుడా కారణము?

గ్రామస్థులు.—అయ్యా, దయయుంచి మాకు చెప్పుడు. భగవంతుడు కుక్కలను సృష్టించి పెంపుడుజంతువులుగ చేయుటకు కారణమేమి?

సాక్రటీసు. — వినండి. ఆవులను మీ లాభముకొర కేలాగు సృష్టించెనో అట్లే కుక్కలనుకూడ మీ లాభముకొరకే భగవంతుడు సృష్టించెను. ప్రపంచములోని తక్కినదేశము లనేకములలో ప్రతి కుక్కను పోషించి దానివలన ప్రయోజనము పొందుచుండు యజమానులున్నారు. యజమానుడులేని

కుక్క ఉండుటలేదు. ఈ విధముగ తర్ఫీతుచేయబడిన కుక్క కంటె విశ్వాసముగలది మరియొకటి యుండజాలదు; ఎల్లకాలమందు అట్టి కుక్క తన యజమానునికి పనిచేయుచు ప్రేమపూర్వముగ నతనిని రక్షించుచుండును. దొంగలురాకుండ ఇంటిని కాపాడును; పొలములను పాడుచేయునట్టియు, ఇంటిలో దాచియుంచుకొనిన ధాన్యమును తినివేయునట్టియు ఎలుకలను చంపును; యజమానుడు ఏదైన పనిచేసికొనుచుండునపుడు అతని సామగ్రులను, ఆహారపదార్థములను, బట్టలను, అన్నిటిని కడుజాగ్రత్తతో రక్షించుచుండును. అన్నివిధములగు పనులను దానికి నేర్పవచ్చును. ఆ కారణముచేత రైతులకది మిక్కిలి ప్రయోజనకారిగ నున్నది. పశువుల గుంపులనుగాని, గొఱ్ఱె మందలనుగాని కాపాడుటకును, అవి తప్పించుకొని పారిపోకుండునట్లు చేయుటకును, యజమానుని ఆజ్ఞ ననుసరించి వానినన్నిటి నొకచోట చేర్చి ఇంటికి తోలుకొనివచ్చుటకును దానికి సామర్థ్యముకలదు. కుక్కలవలన పొందదగిన లాభము లింకను ఎన్నియో కలవు; ఇప్పుడు నేను చెప్పిన లాభములనన్నిటిని మీరు పొందినతర్వాత తక్కినవానినిగురించి వివరించెదను; అప్పటికి నేను చెప్పవలసిన అవసరములేకయే మీరు సొంతముగ గ్రహింపగలరు. ఇంతటి లాభమును పొందుటకు మనము పడవలసిన శ్రమ విస్తారముకాదు; కొంత తిండిబెట్టి కుక్కయెడ కొంచెము శ్రద్ధను అభిమానమును చూపిన చాలును. కుక్కలను మీరీవిధముగ పెంచి వానిమూలమున నష్టముగాక లాభము పొందుదురను ఉద్దేశముతోగదా భగవంతుడు వానిని సృష్టించెను.

గ్రామస్థులు.—మీరు చెప్పునది చాల న్యాయముగ నున్నది. తక్కిన విషయములందువలె దీనియందుకూడ మేము తెలివిలేనివారమై యుంటిమి. సమస్త వస్తువులను మా యుపయోగముకొరకే భగవంతుడు సృష్టించినను మేమింతవరకు ఆ విషయము తెలిసికొనలేకుంటిమి.

## స్త్రీలను గౌరవింపవలెను

ఒకదినము సాక్రటీసు గ్రామచావడివద్దకు వచ్చి తనలో తాను మిక్కిలి సంతోషపడుచుండెను. అతడిట్టి స్థితియందుండుట చూచి గ్రామస్థులు చాల అద్భుతపడి కొంతసేపు వరకు మాటలాడక నిలబడియుండిరి. తర్వాత,

గ్రామస్థులు.—తాతా, నమస్కారములు. ఈ దినము ఏమైన విశేషములు చూచితిరా? గ్రామము శుభ్రముగ నున్నదా? పిల్లలు (నగలుపెట్టుకొనక) శుభ్రముగ నుండుటగాని, మా ఆడువారిలో చదువుకొనుచున్నవారెవరైన ఉండుటగాని మీకు గానవచ్చినదా? మీ సంతోషమునకు కారణమేమి?

సాక్రటీసు.—అట్టిదేమియు చూడలేదు. ఈ ఉదయము నాకొక కష్టము కలిగినది. (అని మరింత సంతోషము చూపసాగెను.)

గ్రామస్థులు.—మీ సంతోషములో మమ్ము పాల్గొననీయకూడదా? మీకు కోపమువచ్చినపుడంత మమ్ముల నిష్ఠురములాడుచుందురుగదా; నిష్ఠురములకు పాత్రులమగుచుండు మేము సంతోషమునకుమాత్రము పాత్రులముకాకూడదా?

సాక్రటీసు.—(బిగ్గరగా నవ్వుచు) మంచిది. మీకు కోపము లేనియెడల నేను జరిగినదంతయు చెప్పెదను.

గ్రామస్థులు. — మీరీ దినమేమిచెప్పినను, మేము కోప పడము; మీ సంతోషమునకు భంగము కలిగింపము.

సాక్రటీసు.—అట్లైన వినుడు. రాచకీయ వ్యవహారియగు నొక పెద్దమనుష్యునితో కలిసికొని అనేక విషయములగురించి ముచ్చటించుచుంటిని. కొంతవరకు మా ప్రసంగము సుముఖము గనే వెళ్లెనుగాని అటుతర్వాత అతడు బహు రోషముతోడను, కోపముతోడను, "ప్రాచీనకాలమున నాగరకతకును, విజ్ఞాన మునకును ప్రసిద్ధిగాంచిన మా భరతఖండమునకు ఈ కాల మున తగిన గౌరవము దొరకుటలేదు." అని పలికెను. ఈ మాట వినగనే నాకు పట్టరాని నవ్వువచ్చినది. అందుమీదట అతడు మరింత కోపముతో నాపైబడి నన్నును ప్రపంచమును తిట్టుటకారంభించెను.

"బాబూ, క్షమింపుడు. మీ వింతమాటలకు నవ్వాక తప్పినదికాదు" అని నేనంటిని.

"ఏల," అని అతడడిగెను.

"మిమ్ము మీరే గౌరవించుకొననప్పుడు ప్రపంచమంతయు మిమ్ము గౌరవింపవలయునని అనుకొనుటకంటె వింతయే మున్నది," అని నేను జబాబుచెప్పి తిరిగి నవ్వుటకారంభించితిని.

అతడందుపై, "అస్పృశ్యులు మాలో కొందరున్నా రనియా మీ అభిప్రాయము. ఇది క్రొత్తవిషయముకాదు; మీరు అనుకొనునంతటి ముఖ్యవిషయముకూడ కాదు," అని ఎత్తి పొడుపుగా పలికెను.

"నేనీ విషయమును గురించిగాదు చెప్పుట. అస్పృశ్యతా దోషము ఘోరమైనదే; దానిమూలమున మన కెక్కడలేని అవమానము కలుగుచున్నది. కాని, నేను దీనినిగురించి ప్రసంగించుటలేదు." అని చెప్పితిని. "అట్లైన దేనినిగురించి మీ యాక్షేపణ?" అని అతడడిగెను. "అయ్యా, జనసంఖ్యలో సగము స్త్రీలుకదా?" అని నేనంటిని. "అవును," అని అతడు జబాబుచెప్పెను. "పురుషులందరు స్త్రీలకడుపులో పుట్టినవారేనా," అని నేనడిగితిని. "అవును, ఎందుకు ఈ తెలివిమాలిన ప్రశ్నలవేయుట" అని అతడనెను. "ఆలాగా? స్త్రీలకంటె పశువులనుకూడ అధికముగ గౌరవించుచు, స్త్రీలయెడ గౌరవమును నది మీరు చూపకుండునంతవరకు మీకు ఆత్మగౌరవమెక్కడిది? ఇతరదేశస్థులు మిమ్ములను గౌరవించుటెట్లు?" అని నేనంటిని. అందుపై ఆయన కెక్కడలేని కోపమువచ్చి ప్రాచీన నాగరకత లోనగు విషయములగురించి బహు తీవ్రముగ నతడేమేమో మాటలాడసాగెను. అందుపై నేనక్కడ నిలువలేక పారివచ్చితిని.

దీనినంతయు విని గ్రామస్థులలో యువకుడొకడు "అయ్యా, ఇందులో నవ్వుటకేమున్నదో మాకు తెలియుటలేదు. మీ అభిప్రాయమును మరింత స్పష్టపరచవలెను," అని కొంచెము బిరుసుగ చెప్పెను.

సాక్రటీసు.—మీ గ్రామమున ఎవరైన గోహత్య గావించినయెడల గొప్ప అల్లరి జరుగునుగదా?

గ్రామస్థులు.—అవును.

సాక్రటీసు.—ఎవడైన ఒక పురుషుడు వాని భార్యను బాధపెట్టినపుడును, ఆ బాధను భరింపజాలక ఆమె ఆత్మహత్యచేసి

కొనుటగాని లేక బాధచే చచ్చుటగాని, లేక ఇల్లువెడలి పారి పోవుటగాని సంభవించినపుడు అల్లరి జరుగునా?

గ్రామస్థులు.—జరుగదు. అట్టిదేదైన సంభవించినపుడు మేమా పురుషునియెడల మా సహానుభూతిని చూపి, అతడు తిరిగి వివాహముచేసికొనుపక్షమున మేమెల్లర మా శుభకార్య మునకు వెళ్లుదుము.

సాక్రటీసు.—మీ ఆవు ఈనునపుడు మీరెవరి సహా యము నపేక్షింతురు.

గ్రామస్థులు.—తెలివియు అనుభవమునుగల పెద్దమను ష్యునియొక్క సహాయమును.

సాక్రటీసు.—మీ స్త్రీలలో నెవరైన ప్రసవబాధపడునపు డెవరిని పిలిపింతురు?

గ్రామస్థులు.—మంగలి మంత్రసానిని.

సాక్రటీసు.—చాల తక్కువకులపు స్త్రీనిగదా?

గ్రామస్థులు.—అవును.

సాక్రటీసు.—బాలింతను చీకటిగదియందుకదా ఉంచెదరు? మురికి ప్రాతగుడ్డలనుగదా ఆ సమయమున మీరామె వాడుక కొసగుట?

సాక్రటీసు.—స్త్రీలు బహిర్భూమికి వెళ్లుటకు ప్రత్యేకమైన మరుగుదొడ్లను మీరు కట్టు అలవాటులేదుగదా? ఆ కారణ ముచే వారు చీకటిపడువరకు వేచియుండుటయో, లేక పగటి పూట ఏ చెట్టువెనుకనో బహిర్భూమికి వెళ్లి మానము పోగొట్టు కొనవలసియుండుటయో కదా జరుగుచున్నది? గోషాలోనుండు స్త్రీలగతికూడ ఇట్టిదేకదా? గోషా, గోషా అని ఘోషపెట్టు వారుకూడ దీనిని గురితించుటలేదే. స్త్రీలు బహిర్భూమికి రాత్రి

పూట వెళ్లినను, పగటిపూట వెళ్లినను మరుగుప్రదేశము లేనికా రణమున వారెల్లప్పుడు భయపడి పురుషులెవరైన మార్గమువెంట వత్తురేమోయను సంశయముతో బెదరిన కుక్కలవలె ఇచ్చ టచ్చటికి ప్రాకుచుండవలసినదేనా?

గ్రామస్థులు. — ఇదంతయు సత్యము. మాలోని చెడు ఆచారములలో నొకదానిని మీరు కనుగొంటిరి.

సాక్రటీసు.—ఆడుపిల్లలను తగువిధమున పెంచుటకుగాని, వారిని చదివించుటకుగాని మీరెట్టి ప్రయత్నము చేయుటలేదు గదా?

గ్రామస్థులు.— లేదు.

సాక్రటీసు.—ఆడుపిల్లపుట్టినపుడు తండ్రికి విచారమేకదా? అతనితో సమానముగ మీరుకూడ విచారింతురుకదా?

గ్రామస్థులు.— అవును.

సాక్రటీసు. — ఆడుపిల్లలరక్షణము మగపిల్లలసంరక్షణము కంటె చాల సులభమైనదని వైద్యుల అభిప్రాయమైనను మీ ఆడుపిల్లలను శైశవమందును, బాల్యమందును మీరు చక్కగ సంరక్షింపకపోవుటచేత మగపిల్లలకంటె ఆడుపిల్లలే ఎక్కువగ చచ్చిపోవుట సంభవించుచున్నది.

గ్రామస్థులు.—కొంతవరకు మేమీ విషయమున నిందింప తగినవారమే. ఆడుపిల్లల విషయములో మేమశ్రద్ధచేయు చున్నాము.

సాక్రటీసు.—ఇంతేగాక గృహనిర్వాహకత్వమనిన ఏమో తెలియకపూర్వము పిల్లలను పెంచుటకుగాని భర్తలకు శుశ్రూష చేయుటకుగాని వారికి తెలియకముందే బాల్యమందున్న ఆడు పిల్లలకు మీరు వివాహముచేయుచున్నారు. బడికివెళ్లి చదువు

మూలమునను, ఆటలమూలమునను వారి మనస్సులును, శరీరములును దృఢపడవలసిన వయస్సునందు మీరు వారిని నిర్బంధపెట్టి సంతానవతుల చేయుచున్నారు.

గ్రామస్థులు.—ఇదంతయు మాలో ననేకులయందు కనబడుచుండు దోషమే; మీరు చూపించిన లోపములలో కొన్ని మా అందరియందున్నవి.

సాక్రటీసు.—మీలో కొందరు మీ స్త్రీలను యావజ్జీవము గదులలో పెట్టి తాళము వేయుచుందురు గదా?

గ్రామస్థులు.—మాలో కొందరము గోషాపద్ధతి నవలంబించుచున్నాము.

సాక్రటీసు.—గోషా ఆచారములేని కుటుంబములవారు కూడ కొంత ధనమును కొంత విద్యను సంపాదించినతర్వాత వారి స్త్రీలకు గోషాను విధించుచుండుట ఆచారము.

గ్రామస్థులు.—ఇదికూడ కలదు.

సాక్రటీసు.—స్త్రీలు ఇంటిచాకిరిచేయుచు బిడ్డలను పెంచుచుండ పురుషులు హాయిగ కూర్చుండి చుట్టత్రాగుచుందురు?

గ్రామస్థులు.—ఇదియుకూడ చాలవరకు సత్యమే.

సాక్రటీసు.—భార్యకు మగసంతానముగాక ఆడుపిల్లలే పుట్టుచుండునపుడు ఆమెను నిరాదరించుటయు, కొన్ని సమయములందు ఆమెను వదలిపెట్టి మరియొకతెను పెండ్లాడుటయు కలదుగదా?

గ్రామస్థులు.—ఇదికూడ చాలవరకు నిజమే.

సాక్రటీసు.—పురుషులగు మీరు అపరిశుభ్రముగను, అసహ్యముగను ఉండు ఇండ్లను కట్టుటచేతను, శిశుసంరక్షణకు సంబంధించినట్టియు, మశూచి మొదలగు సాధారణ రోగములురాకుండ

చేసికొనుటకు కావలసినట్టియు, జ్ఞానము మీ స్త్రీలకు ఒసగక పోవుటచేతను మీ పిల్లలు ఆరోగ్యహీనులగుట సంభవించు చున్నది. రోగపీడితులగు పిల్లలకు ఉపచారముచేయు పని అంతయు స్త్రీలదేగదా? స్త్రీలచేతులలోనే గదా అట్టివారు చచ్చిపోవు చుండుట?

గ్రామస్థులు. — అయ్యా, ఈ విషయమునకూడ తప్పు మాదేయని యొప్పుకొనుచున్నాము.

సాక్రటీసు.— మీరు కొంత మేల్కొని ఈ చెడ్డయలవాటులను మానినయెడల సగము రోగము లడుగంటును.

గ్రామస్థులు.— మాకుకూడ ఆ నమ్మకముకలదు.

సాక్రటీసు.— మీ ఆడుపిల్లలకు చదువుచెప్పించి, చదువు పూర్తియగువరకును వారికి మంచి వయస్సువచ్చువరకును వివాహముచేయుట మానినయెడల శిశుసంరక్షణపద్ధతులు వారు తెలిసికొని పిల్లల కకాలమృత్యువును తెచ్చు వ్యాధులరానీకుండ చేసికొనెదరు. సదా రోగపీడితులగు శిశువులను కనిపెట్టుకొని యుండుటకు వారు పడు కష్టమును, విచారమును, పుట్టినపిల్లలొకరితర్వాతనొకరు చచ్చుట చూచుచుండుటవలని విషాదమును వారికి తప్పునుకదా?

గ్రామస్థులు.— మీరారోపించు నేరములన్నియు సత్యములే.

సాక్రటీసు.— టీకాలువేయుటవలన లాభమున్నదని ఎరిగిన తల్లి టీకాలవేయుటకై వైద్యుడు వచ్చినపుడు తన బిడ్డను దాచిపెట్టునా?

గ్రామస్థులు.— అట్లు చేయనేచేయదు. బిడ్డపై తండ్రికంటె తల్లికే ఎక్కువ ప్రేమ. టీకాలవేయుటవలన కలుగు లాభమును

ఆమె నిజముగ గ్రహించినపక్షమున తన బిడ్డకు మశూచిరాకుం డునట్లు ఆమె తప్పక చేసికొనును.

సాక్రటీసు.—మీ స్త్రీలయెడ మీకు గౌరవములేదనియు, స్త్రీలకంటె పశువులనే మీరెక్కువగ గౌరవించుచున్నారనియు నేను చెప్పినమాట సత్యమునకు దూరమైనదా?

గ్రామస్థులు.—మీరు చెప్పినది పరమసత్యము.

సాక్రటీసు.—నా మాటలను మీరు శ్రద్ధతో ఆలకింప వలెను. మీకు చాకిరిచేయుటకును దాసీజనమువలె మీ నిరా దరణకు పాత్రులగుటకును, స్త్రీలు సృజింపబడిరను అభిప్రాయ మును మీరు మాని; స్త్రీలు పురుషులవంటి ప్రాణులేయని భావించి తగువిధముగ గౌరవించి పెంచి మీ కష్టసుఖ ములందు మీతో సమానముగ వారుకూడ పాల్గొనునట్లు చేసిన నిమిషమున, మీ సంసారములు సుఖముగను, సంతోష ముగను ఉండుటయు ప్రపంచమంతయు మిమ్ములను గౌరవించు టయు కలుగును.

## సదాచారములు—ఉపాధ్యాయుని ఆదర్శము

గ్రామస్థుడు.—సాక్రటీసుగారూ, మీరు ప్రతిదానిని మార్చి మా గ్రామమును తలక్రిందుచేయుటకు ప్రయత్నించు చున్నారు.

సాక్రటీసు.—లేదు. కాని క్రూరములగు దురాచార ములు నా కంటికగపడునపుడు నాకు పట్టరాని కోపోద్రేకము కలుగును; మొగమోటములేక మాటలాడుట నా స్వభావము.

గ్రామస్థుడు.—ఎల్లప్పుడు మా లోపములను చూపుచు మమ్ములను చీవాట్లుపెట్టుటయే మీ పనియైయున్నది.

సాక్రటీసు.—నిజమే. ఇన్ని దురాచారములు నా కంట పడుచుండ ఊరకుండు టెట్లు?

గ్రామస్థుడు.—మాలో మంచిదేదియు మీ కగపడుట లేదా?

సాక్రటీసు.—ఎన్నియో మంచి ఆచారములున్నవి. కాని మంచినిగురించి మాటలాడుట అనావశ్యకము. దాని మంచి తనమే దానిని రక్షించును; మంచి ఆచారములు మీరనుస రించుచుండుట చూచి నేనెంతో సంతోషించుచున్నాను. వైద్యుడెన్నడైన దృఢగాత్రులను, ఆరోగ్యవంతులను, చూచు టకు వచ్చునా? బలహీనులతోడను, రోగపీడితులతోడను గదా అతనికి పని?

గ్రామస్థుడు.—నిజమేగాని దృఢగాత్రులను, ఆరోగ్యవం తులను బొత్తిగ చూచుటకు మానినయెడల వారుకూడ జబ్బు పడుట తటస్థించును.

సాక్రటీసు.—నీ అభిప్రాయముతో నే నేకీభవించుచు న్నాను. మీరిప్పుడు మీ సదాచారములను మాని దురా చారములను మాత్రమే అనుసరించుచున్నారనుమాట జ్ఞప్తికి వచ్చుచున్నది. ఇదిగాక చెడు అలవాటులు బహు త్వరితముగ నేర్చుకొనుటయు మంచివాని నేర్చుకొనుటలో చాల అలసు లుగనుండుటయు, మీ స్వభావము పొట్టిబాతుకు నీళ్లలో ప్రవే శించుట యెంత సులభముగ పట్టుపడునో మీకు శిగరెట్ల త్రాగు అలవాటు అంత సులభముగ పట్టుపడినది; పెంటను

పోయుటకు మీచే గోతులను త్రవ్వించుట బ్రహ్మాప్రళయమైనది కదా?

గ్రామస్థుడు.—మంచి అలవాటుల పట్టుపరుచుకొనుటయు పట్టుపరుచుకొనినతర్వాత వానిని సాగించుటయు కష్టము. చెడు అలవాటులు అప్రయత్నముగ తమంతటతామే పట్టువడును. ప్రాచీనకాలపు సత్సంప్రదాయములనుకూడ మేమెంత వేగముగ వదలిపెట్టుకొనుచున్నాము!

సాక్రటీసు.—అవును. పూర్వకాలమున గ్రామస్థుడు మితవ్యయముచేయువాడుగను, నీతియం దభిమానముగలవాడుగను నుండెను. ఇప్పుడున్ననో ఈ మోటార్లు, రైలుబండ్లు, ఇంగ్లీషు విద్య—వీనిమూలమున ఈ సుగుణములను కోల్పోయి ప్రాతకాలపు దుర్గుణములకుతోడు క్రొత్త దుర్గుణములను కొన్నిటిని అలవరుచుకొనుచున్నాడు.

అప్పుడచటికి గ్రామపాఠశాలోపాధ్యాయుడు వచ్చెను.

సాక్రటీసు.—(ఉపాధ్యాయుని చూచి) ఇదంతయు మీరు చేయవలసిన పని.

ఉపాధ్యాయుడు.—ఏమిటీ! ఈ నెలసరిలెక్కలు తయారు చేయుటతోను క్రొత్తవిషయముల నేర్చుకొని బోధించుటతోను నా పని అయిపోవుచున్నది.

సాక్రటీసు.—మేస్టరుగారూ, సదాచారములు నశింపకుండునట్లు సంరక్షించు పని మీదికదా?

ఉపాధ్యాయుడు.—ఉన్నపనులు చాలక ఈ క్రొత్తపని కూడనా? అయ్యా ఈ పనిచేసినయెడల నా జీతమేమైన వృద్ధియగునా?

సాక్రటీసు.—కాజాలదు; కాని, ఈ గ్రామముయొక్క పురోభివృద్ధియంతయు మీ చేతులోకదా ఉన్నది. మీ బడిలో చదువుకొనుచుండు ఈ మగపిల్లలను, ఆడుపిల్లలను మీ రెట్లు తయారుచేయుచున్నారో దానినిబట్టికదా ఇకముందు ఈ గ్రామముయొక్క యోగ్యత నిల్వబడుట. ఆడుపిల్లలు చాల మంది మీ బడిలో ఇప్పుడు చదువుకొనుచుండుట నాకు సంతోషము కలిగించుచున్నది.

ఉపాధ్యాయుడు.—అయ్యా, చదువుట, వ్రాయుట, లెక్కలవేయుట, చరిత్ర, భూగోళము వీని నేర్పుటయే నా పని.

సాక్రటీసు.- ఈ చరిత్ర భూగోళము ఎవరికి కావలెను? శిష్యులను విద్యావంతుల చేయుటకదా మీ పని? విద్యయనగా వారిని బుద్ధిమంతులుగ చేయుటయేగాక యోగ్యులుగ చేయుట కూడ కదా?

ఉపాధ్యాయుడు.— నాకున్న పనులలో నేను వారిని యోగ్యులుగ చేయుటకు వ్యవధియు మార్గమును ఎక్కడిది?

సాక్రటీసు.—స్వయముగ మీరు మంచివారు; ప్రాతకాలపు ఆచారములలో మంచివానిని సంరక్షించి చెడువానిని నిర్మూలముచేయుట ఆవశ్యకమని మీ అభిప్రాయమవునా?

ఉపాధ్యాయుడు.—అవును.

సాక్రటీసు.—మీ శిష్యులకు క్రొత్త దురభ్యాసములు పట్టువడుట మీకు సమ్మతమా?

ఉపాధ్యాయుడు.— కాదు.

సాక్రటీసు.—మంచిది. మీ శీలముమూలమునను, ప్రవర్తనమూలమునను, అప్పుడప్పుడు మీరుచేయు ఉపదేశముల వలనను, మంచియందు అభిముఖత్వము చెడుగునందు పరాఙ్ముఖ

త్వమును మీరు ఎల్లప్పుడు చూపుచుండుటవలనను, మీరు మీ శిష్యులకు మార్గదర్శులై వారి నెల్లప్పుడు మంచిమార్గమున నడుచునట్లు చేయవలెను.

ఉపాధ్యాయుడు.—ఈ పనిని చేయగలను.

సాక్రటీసు.—మంచిది, తప్పక చేయుడు. దీనికి కాలవ్యయము ధనవ్యయముగాని లేదు. అజ్ఞానాంధకార బంధురమగు ఈ గ్రామమునకు మీరేకదా విజ్ఞానదీపమువంటివారలు. ఈ దీపమును కాంతియుతముగనుంచుట మీ ధర్మము.

ఉపాధ్యాయుడు.—నావంటి బీదబడిపంతుల కిదియంతయు శక్తికిమించిన పని; అయినను దీనిని చేయుటకు నా శక్తికొలది ప్రయత్నించెదను.

సాక్రటీసు.—మీరట్లుచేసినయెడల మీ గ్రామవాసులు మీ పేరు నెల్లప్పుడు స్మరించుకొనుచుందురు. ఈ పిల్లలు మీ కధీనులైయున్నారు. వారివిషయమున మీరెట్టి శక్తివంచన చేయకూడదు. మీరెల్లప్పుడు సన్మార్గదర్శులై యుండవలెను. నాకిప్పుడు మరియొకటి జ్ఞప్తికివచ్చుచున్నది. నిన్నటిదినము నేను మీ బడివైపు వెళ్లుచుండగా మగపిల్లలు, ఆడుపిల్లలు ఎన్నియో నగలపెట్టుకొనియుండుటయు, పుట్టినప్పటినుండి స్నానమనునది ఎరుగనివారివలె శరీరము అసహ్యముగ నుంచుకొనియుండుటయు చూచితిని. కొందరు ఆడుపిల్లలు చెవులందు ఎన్నియో తీగెలను మరేవో నగలను పెట్టుకొనియుండిరి. వారి చెవిలో నేదో యంత్రమున్నట్లు నేననుకొంటిని.

ఉపాధ్యాయుడు.—అవును. వారెల్లప్పుడు అలాగే బడికి వచ్చుచుందురు.

సాక్రటీసు.—ఉన్న డబ్బును కైవ్వనా దోమతెరలు మొదలగువానిని కొనుటకై వ్యయపెట్టుటకు బదులు ఈ విధముగ నగలకై ఖర్చుగావించుట తెలివితక్కువగదా?

ఉపాధ్యాయుడు.—అవును.

సాక్రటీసు.—వా రీస్థితిలోనున్నప్పుడు వారికి చదువుటయును, వ్రాయుటయును నేర్పుటవలన ప్రయోజనమేమున్నది?

ఉపాధ్యాయుడు.—అయ్యా, వీనిని నేర్చుకొనుటకొరకే వారు బడికివత్తురు; వీనిని నేర్పుటయే నా పని. తక్కినవిషయముల నేర్పుట నా ఉద్యోగధర్మముకాదు.

సాక్రటీసు.—వారిని విద్యావంతులచేయుటకదా మీ ఉద్యోగధర్మము. ఆరోగ్యము, పరిశుభ్రత—ఈ రెండును లేక విద్యయనునది యుండునా?

ఉపాధ్యాయుడు.—ఇవి లేనియెడల విద్య సార్థకముకాదను మాట నేనెరుగుదును. కాని వీనిని నేర్పుట నా విధికాదు.

సాక్రటీసు.—అట్లైన ఈ పని ఎవరు చేయవలసినది?

ఉపాధ్యాయుడు.—నాకు తెలియదు. ఇది నా పనికాదని మాత్రము నేను చెప్పగలను. బహుశః ఇది తల్లిదండ్రులు చేయవలసిన పని.

సాక్రటీసు.—నిజము; కాని ఇప్పుడీపిల్లలకు మీరు నేర్పుచుండు చదువేకదా ఆ తల్లిదండ్రులు నేర్చుకొనినది? కావున వారికిమాత్రము ఏమి తెలియును? అయ్యా, ఎవరో ఒకరు దీనిని నేర్పుటకు ప్రారంభించవలెను గదా?

ఉపాధ్యాయుడు.—నాకు తెలియదు. బడిలో నే నుపయోగించు పాఠపుస్తకములలో ఈ విషయమై ఏమియు లేదు.

సాక్రటీసు.—బహుశః ఆ పుస్తకములన్నియు పల్లెటూళ్లలోని స్థితిగతులెరుగనివారిచే వ్రాయబడినవి కాబోలు.

ఉపాధ్యాయుడు.—ఉండవచ్చును.

సాక్రటీసు.—మీరీబడిలో బోధించు విద్యయొక్క ఉద్దేశమేమి?

ఉపాధ్యాయుడు.—చదువుట వ్రాయుట లోనగువానిని నేర్పుట.

సాక్రటీసు. — పిల్లలు చదువుట వ్రాయుట లోనగువానిని నేర్చుకొనుటలో ఉద్దేశమేమి?

ఉపాధ్యాయుడు. — నాకు తెలియదు. చదువుటకును, వ్రాయుటకును శక్తిగలిగియుండుటయే.

సాక్రటీసు.—కాని దీనికంతకు ప్రయోజనమొకటి యుండవలెనుగదా?

ఉపాధ్యాయుడు.—నాకేదియు కనిపించుటలేదు. బహుశః బ్రదుకుదెరువేర్పడుట పరమార్థము కాబోలు. కోటివిద్యలును కూటికొరకుగదా.

సాక్రటీసు.—డబ్బంతయు నగలకై ఖర్చుపెట్టువారికి జీవనోపాయము ఎక్కడిది? శుభ్రతలేనిపక్షమున రోగమువచ్చి బాల్యముననే మృత్యువుపాలగుదురు కదా?

ఉపాధ్యాయుడు. — మీ ప్రశ్నలు మీ సిద్ధాంతములు నన్ను తబ్బిబ్బు పరచుచున్నవి.

సాక్రటీసు.—మంచిది. పిల్లలను పిల్లకాయలను మంచివారినిజేసి, వారికి ఆరోగ్యముగను, సుఖముగను, యుక్తముగను జీవించువిధము నేర్పుటయే విద్యయొక్క ఉద్దేశము. ఇండ్లను

షాలములను చక్కబెట్టుకొనుటకు వలయు శక్తి సంపాదించుట యందు తోడ్పడును గనుక చదువుటను నేర్చుకొనవలెను.

ఉపాధ్యాయుడు.—విద్యయొక్క పరమార్థ మిదియనియే తోచుచున్నది.

సాక్రటీసు.—కావున బడికివచ్చినతోడనే మొట్టమొదట నేర్చుకొనవలసినది ఓనమాలు కావు; ముఖమును, కన్నులను, చేతులను తుడుచుకొని శుభ్రముగనుండుటయే నేర్చుకొనవలసినది. అట్లే నగలను పెట్టుకొనుటకాదు మొదట నేర్చుకొనవలసినది; క్రైనాదోమ తెరలు—ఇట్టివాని ఉపయోగమును అందరు నేర్చుకొనవలెను.

ఉపాధ్యాయుడు.—ఇవన్నియు మంచి పాఠములనుట సత్యము.

సాక్రటీసు.—ఇంతకంటె మంచివేమైన ఉన్నవా?

ఉపాధ్యాయుడు.—లేవు.

సాక్రటీసు.—అట్లైన మీ రీపాఠముల నేల నేర్పుటలేదు.

ఉపాధ్యాయుడు.—వీనిని నేర్పుచుండినయెడల మా పిల్లలు పరీక్షలందు తప్పిపోదురు; నాకు రావలసిన జీతము రాకపోవును.

సాక్రటీసు.—మీరు పొరపాటుపడుచున్నారు. ఇదియే యోగ్యమైన విద్యాభ్యాసము. దీనిని నేర్పినయెడల మీకు నష్టము కలుగజాలదు. మీ శిష్యులయొక్క తెలివితేటలు చురుకుదనము మరింత వృద్ధిగాంచును; పరీక్షలందు మరింత వేగముగ వారు కృతార్థులగుదురు; కొంతవరకైన మీరు నిజమైన విద్యను నేర్పి మీ శిష్యులు పెద్దవారైనతర్వాత సంసార కష్టముల నెదుర్కొనుటకు కావలసిన సామర్థ్యమును వారికి ప్రసాదించినవారగుదురు.

వీరిట్లు మాటలాడుచుండగా ఒక స్త్రీ ఆమె బిడ్డపై కోప గించుచు ఏమేమో తిట్లను తిట్టుచుండుట వారికి వినబడెను. ఆ తిట్టు మాటలను విని సాక్రటీసు దిగ్భ్రమ చెందెను; కాని తక్కిన వారెవరు ఆ తిట్లను పాటింపరైరి.

సాక్రటీసు.—ఇదియొక దురాచారము.

ఉపాధ్యాయుడు.—ఏది? నాకేమియు కనబడలేదే.

సాక్రటీసు.—మీరా తిట్లను వినలేదా?

ఉపాధ్యాయుడు.—తిట్లా! వానిలో ఏమున్నది. శిష్యుల యందు నాకుగల ప్రేమను సూచించుటకై నేనిట్టిమాటలను సామాన్యముగ వాడుచుందును. పిల్లల విషయమునను, పశు వుల విషయమునను అందరు ఈ మాటల నుపయోగింతురు. ఇందులో దురుద్దేశమేమియు లేదు.

సాక్రటీసు.—అయ్యా, ఇట్టి నీచపుమాటల వాడుట యుక్త మని మీరు తలచెదరా?

ఉపాధ్యాయుడు.—తలచుట లేదుకాని ఇందులో దురుద్దేశ మేదియు లేదు; దీని మూలమున ఎవరికిని ఎట్టి కీడుగాని కలు గుటలేదు.

సాక్రటీసు.—తప్పక కీడుకలుగుచున్నది. మీకు బాగుగ తెలియును.

ఉపాధ్యాయుడు.—ఆలోచించినయెడల కొంత కీడున్న దనియే చెప్పవలసియున్నది.

సాక్రటీసు.—అట్లైన మీరీ దురాచారమును మాని, ఇట్టి మాటల నసహ్యించుకొనవలెనని మీ శిష్యులకు బోధింప వలెను. మీరందరు ఇట్టి తుచ్ఛపుమాటల నుపయోగించు

చుండునంతవరకు మీకు గౌరవ మెట్లుకలుగును? మీ పిల్లలు వారి తల్లులను, అక్కచెల్లెండ్రను ఎట్లు గౌరవింతురు?

ఉపాధ్యాయుడు.—మీరింతగా నొక్కి చెప్పుచున్నారు; మీరు చెప్పునది సత్యము. ఇట్టి బూతుమాటలు గర్హింపదగినవే.

సాక్రటీసు.—అట్లైనయెడల మీ గ్రామమందైనను ఈ దురాచారము నిర్మూలమగుటకు మీరు ప్రయత్నింపవలెను. నేను బాలుడనుగా నున్నపుడు ఇట్టిమాట యొకటి నా నోట వచ్చినయెడల మా తల్లి ఏమి చేయుచుండునో మీ రెరుగుదురా? సబ్బుబిళ్లను కుంచెను తీసికొని ఈ మలినము పోవలయునని నా నాలుకపై రాచుచుండెడిది! ఈ కారణముచే అట్టి మాటల నుపయోగించు అలవాటు బహు శీఘ్రముగ నశించినది.

ఉపాధ్యాయుడు. — అట్టి పద్ధతి ననుసరించుటకు మేము నిశ్చయించుకొనినయెడల, మా పిల్లల నాలుకలనేగాక మా అందరి నాలుకలనుగూడ రాయవలసివచ్చుననియే నాభయము.

సాక్రటీసు.—నిజము. ఏలాగైననేమి, మీరీపని ప్రారంభింపవలెను. సద్వినియోగము చేయవలయుగాని ఉపాధ్యాయుని చేతిలో ఎంతయో అధికారము ఉన్నది.

## గ్రామనాయకుడు

పెద్దరెడ్డి.—సాక్రటీసుగారూ, తమ జీవితముల నేవిధముగ చక్కబెట్టుకొనవలసినదో మా గ్రామస్థులకు చెప్పి చెప్పి నాకెంతో విసుగుపుట్టినది; కాని నా మాట వినువారొక్కరు కూడ కనిపించుటలేదు.

సాక్రటీసు.—నేనెక్కడికి వెళ్లినను ఈ మాటలే చెవిని బడుచున్నవి. "ఎంత చెప్పినను వినువారొక్కరుకూడ లేర"ను మాటయే వినవచ్చుచున్నది.

రెడ్డి.—సత్యము. ఈ దినములలో మా స్థితి బహు కష్టముగనున్నది. మా ఉత్తరువులకు లోబడువారెవ్వరును లేరు.

సాక్రటీసు.—రెడ్డిగారు, ఏల అట్లు సెలవిచ్చుచున్నారు. ఇదివరకు మీకుండిన మర్యాద ఇప్పుడేమైనది. మిమ్ములను గౌరవించువారెవ్వరులేరా?

రెడ్డి.—గౌరవము మర్యాద – ఈ రెండును ఉన్నవి. కాని అదేమో నాకు తెలియదు. మా మాట వినువారుమాత్రమెవ్వరును లేరు.

సాక్రటీసు.—నా సలహాను మీరనుసరించుటవలన, మీ ఆరోగ్యమందును, ఐశ్వర్యమందును, సౌఖ్యమందును కలిగిన అభివృద్ధి చూచినవెంటనే మీరు నడుచుమార్గమున తక్కిన వారు నడువజాలరా?

రెడ్డి.—మీ అభిప్రాయము తెలియుటలేదు.

సాక్రటీసు.—నా మాటలలో గూఢార్థమేమియు లేదే. మీ రుపయోగించుచుండు పర్షియన్ రాట్నపు లాభములను చూచినవెంటనే తక్కినవారుకూడ ఆ రాట్నము నుపయోగింతురుగదా?

రెడ్డి.—పర్షియన్ రాట్నమును నే నుపయోగించుటలేదే.

సాక్రటీసు.—ఏమీ! ఈ రాట్నము నుపయోగించుట లాభకరమని ఎన్నియో సంవత్సరములనుండి మీరందరికి ఉపదేశించుచుంటిరి గదా.

రెడ్డి.—ఎంతో శ్రమపడి రాత్రిపగలు ఎన్ని సంవత్సరములుగానో నేను దీనిని అందరికి ఉపదేశము చేయుచున్నాను; కాని వినువారొక్కరును లేరు.

సాక్రటీసు.—రెడ్డిగారూ, చెప్పుటకంటె చేసిచూపించుట మంచిదియనుమాటను మీరు వినలేదా? గాంభీర్యముగ మీరు చేయు ఉపదేశములను విని మీ గ్రామస్థులు నవ్వుచు "ఈ రెడ్డిగారు చెప్పు మాటలలో సత్యమేయుండినయెడల వీరేల ఆ ప్రకార మాచరించుటలేదు. వీరు ఇట్టి రాట్నమును ఉపయోగించునంతవరకు మనము కాచియుండి, తర్వాత వీరు చేసినట్లు మనమును చేయుదము," అని చెప్పుచుందురు.

రెడ్డి.—నాకీ ఆలోచన తట్టినదికాదు. నేను చెప్పిన ప్రకారము ఇతరులు నడుచుకొనవలెనని చెప్పుటమాత్రమే నా పనియని నేననుకొంటిని.

సాక్రటీసు.—గ్రామోద్ధరణము కావలెనని నోటితో చెప్పుటయేగాని హృదయమందుమాత్రము మీకు పూర్వకాలపు దురాచారములం దభిమానము తగ్గినదికాదు.

రెడ్డి.—కాదు కాదు.

సాక్రటీసు.—గ్రామములోపలను వెలుపలను కుక్కలవలె ఎక్కడనిన అక్కడ బహిర్భూమికి వెళ్లు దురాచారమును మానవలెనని మీరందరికి ఉపదేశముచేయుచున్నారు గదా? మీరు, మీ ఆడువారు, మీ పిల్లలు ఈ దురాచారము నింకను అనుసరించుచున్నారా లేక పరిశుభ్రతయందును, ఆత్మ గౌరవమును కాపాడుకొనుటయందును మీరితరులకు మార్గదర్శులైతిరా?

రెడ్డి.—మార్గదర్శినికాలేదు. నేను కూడ తక్కినవారివలెనున్నాను.

సాక్రటీసు.—అనగా మీకు మేము చెప్పుదానియందు హృదయపూర్వకమగు అభిమానము లేదనియేగదా?

రెడ్డి.—లేదని చెప్పవలసినదే.

సాక్రటీసు.—అట్లైన నీవు నాయకుడని చెప్పుకొనదగిన వాడవు కావు. నీవు అనుచరుడవు. సంస్కర్తలవెనుక నిలబడి కుక్కలవలె మొరుగుటేగాని ఆచరణవిషయములో మీరెట్టి సహాయముచేయుటలేదు. ఇతరులు ముందంజవేసి ఈ క్రొత్త మార్పుల ప్రవేశపెట్టుటను కనిపెట్టి వారికేమైన లాభము కలిగినతర్వాత మీరామార్పుల చేసికొన చూచుచుందురు. గ్రామమునకు పెద్దరెడ్డిగనుండునట్టియు, నాయకుడు గౌరవార్హుడు అను కీర్తిని సంపాదింపకోరునట్టియు మీకిది తగదు. మీకు సిగ్గు లేదా? లోలోపల మీరు మిమ్ములను నిందించుకొనుటలేదా?

రెడ్డి.—నిజముగ మీ మాటలవలన నేను తలవంచుకొనవలసియున్నది. కాని గ్రామస్థులందరు పరిహాసముచేయుచుండ నే నొక్కడనే ఈ క్రొత్త పద్ధతుల ననుసరించుటకు జంకుచున్నాను.

సాక్రటీసు.—ఏ మట్లనెదరు. ఎవరో ఒకరు ముందు నడిచిన గదా ఇతరు లనువర్తించుట.

రెడ్డి.—మీరు చెప్పునది సత్యము.

సాక్రటీసు.—అట్లైన, ఈ గ్రామమునకంతకు నాయకుడను పేరుగాంచిన మీరుగదా ముందు నడువవలెను? మీకంటె తగినవారెవరున్నారు? మీరు కొంత ధనికులు గనుక క్రొత్తపద్ధతుల నాచరణయందుంచ సమర్థులు. ఒకవేళ ఆ పద్ధతులు ప్రారంభదశయందు లాభము కలిగించకపోయినను దానిమూలమున మీకువచ్చు నష్ట మపరిమితముకాదు. స్వల్పులకన్ననో

ఇట్టి క్రొత్తమార్పుల చేయుటకు వలయు శక్తియుండదు. పెద్ద వారు చేసి లాభముసంపాదించువరకు వారు నిరీక్షించియుండి, అవి మంచివని స్పష్టపడినతర్వాత వాని నవలంబింపదగినవారై యుందురు. కాని మీ రీవిషయములలో జంక నవసరము లేదు. ఈ క్రొత్తపద్ధతులన్నియు లాభముతెచ్చునవియే. తప్పక లాభముతెచ్చునవని స్థిరపడినపిమ్మటనే వానిని జిల్లా గెజటునందును, వ్యవసాయశాఖవారు ప్రకటించు పుస్తకములందును, పాటలందును, పత్రికలందును ప్రచురించుచున్నారు.

రెడ్డి.—మీ అర్థము బోధపడుచున్నది. నేను నాయకుడను గనుక అందరిని నడిపించుట నా పని. అందుకై కావలసిన ప్రయత్నమును నేను చేసెదను.

సాక్రటీసు.—ఏమి సుబేదారుగారు, రిసల్ దార్ సాహెబుగారు, ఎంతసేపు మీరు మీ రొమ్మును తట్టుకొనుచు మీ పదకములను చూపుచు ఫ్రాన్సు మెసపటోమియా దేశములందు సిపాయీలను మీ రేవిధముగ నడిపినదియు వర్ణించుచు మీ కాలమును గడుపుచుందురు? సిపాయీలను నడిపినట్లు గ్రామములోని మీ సోదరులనుకూడ మీ రేల నడుపకూడదు?

సుబేదారు.—సిపాయీలను యుద్ధరంగమున నడుపుటకంటె ప్రాతకాలపు దురాచారములను మాన్పించువిషయమున గ్రామస్థులను నడుపుట కెక్కువ ధైర్యముకావలెను.

సాక్రటీసు.—నిజము. అట్లైన మీ గ్రామస్థుల ఉద్ధరించుటకును, జ్ఞానము నభివృద్ధిచేయుటకును మీరు నాయకులై మరింత కీర్తిప్రతిష్ఠలను సంపాదింపకూడదా?

సుబేదారు.—తాతగారూ! అట్లే ప్రయత్నించెదను. కాని, నేను పింఛనుపుచ్చుకొని విశ్రాంతి ననుభవించుటకై స్వగ్రా

షమునకువచ్చి చేరితినిగాని గ్రామములోని మురికి, పెంట, రోగము, హీనత, దారిద్ర్యము లోనగువాని నిర్మూలముగావించుటకై మరియొక యుద్ధముచేయుటకు వచ్చినవాడనుగాను.

సాక్రటీసు.—మంచిది; కాని ప్రయత్నముచేసి చూడుడు. ఈ యుద్ధమునందు జయము నిశ్చయము; ప్రాణనాశముండదు. పరిహాసపాత్రుల మగుదుమేమో యను భయము విడువుడు. గుండ్లదెబ్బలవలె పరిహాసము ప్రాణనాశమును కలిగించదు కదా? ఇతరుల పరిహాసమును లక్ష్యపెట్టకుండు దార్ఢ్యము క్రమక్రమముగ మీకు లభించును. వారి పరిహాసము ఎక్కువ కాను కాను గ్రామోద్ధరణమందు మీకుగల దీక్షయు కార్య శూరతయు వృద్ధియగును.

సుబేదారు. — తాతా, ఈ పవిత్రయుద్ధమందు మేము మీతో చేరెదము.

సాక్రటీసు.-ఈ యుద్ధము తక్కిన యుద్ధములవంటిదికాదు. ఇందు జయము నిస్సందేహము; ఒక్కొక జయము సైన్యము యొక్క బలము నభివృద్ధిచేయును. (ఇది వాగ్యుద్ధముకాదు, కార్యయుద్ధమను మాట మీరు మరవకూడదు). మనలో చేరు ప్రతి మనుష్యుడును, మనము చెప్పులాగునను చేయులాగునను ఆచరించుటకు సిద్ధపడు ప్రతి కుటుంబమును మన మిత్ర కోటిలోనివారు. మన యుద్యమబలమును చాటువారు వీరే. కావున తుట్టతుదకు మనకు జయములభించుట సత్యము.

సుబేదారు, రెడ్డి.—మీరు చెప్పునది సరియని మాకు నమ్మకము కలిగినది. ఈ పురోభివృద్ధికై గావింపబడు కార్యములు జయప్రదములగును గాక.

## పవిత్రయుద్ధము

ఎప్పటివలె సాక్రటీసు గ్రామచావడివద్దకు వెళ్లునప్పటికి పింఛముపుచ్చుకొనిన సైన్యోద్యోగస్థులు, సిపాయీలు వారి వారి దుస్తులను పతకములను ధరించుకొని బహు ఆడంబరముతోడను, ఉల్లాసముతోడను అక్కడ కూర్చుండియుండిరి.

సాక్రటీసు.—నమస్కారము. ఈ దినము మీరందరు ఎంత నీటుగనున్నారు? మిమ్ములను చూడగనే నాకేమి జ్ఞప్తివచ్చుచున్నదో మీ రెరుగుదురా?

ఉద్యోగస్థులు.—ఏది వచ్చుచున్నది?

సాక్రటీసు.—పెంటదిబ్బలపై కూర్చుండు నెమిళ్లు జ్ఞప్తికి వచ్చుచున్నవి.

ఉద్యోగస్థులు. — మీరీ ఉదయము చాల కఠినముగ మాటలాడుచున్నారు. ఇట్టి అవమానకరమైన సాదృశ్యము నేల మీరు కల్పించితిరి?

సాక్రటీసు.—నేను చెప్పినదానిలో పొరబాటేమియు లేదు. మీరందరు బహు చిత్రమైన దుస్తులను పతకములను ధరించుకొనియున్నారు గాని మీ గ్రామము పెంటతో నిండియున్నది గదా?

ఉద్యోగస్థులు.—నిజమే; కాని, మీరు సూచించినస్థితి సహజమే అను మాట మీ సాదృశ్యమునుబట్టియే తేలుచున్నదిగదా?

సాక్రటీసు.—ఆలాగా? పెంటదిబ్బలపెట్టుట నెమిళ్లకు స్వభావమా?

ఉద్యోగస్థులు.—కాదు.

సాక్రటీసు.—ఈ గ్రామము నిట్టి అసభ్యమైన స్థితిలో నుంచుటకు మీరుత్తరవాదులు కారా?

ఉద్యోగస్థులు. — కొంతవరకు మేము ఉత్తరవాదులమే కాబోలు.

సాక్రటీసు.—సరే కాని, ఈ దినము ఏమి విశేషము. ఎవరింటిలోనైన వివాహమా, లేక వనసంతర్పణమా? మరేదైన ఉత్సవమా?

సుబేదారుమేజరు.—తాతగారూ! వనసంతర్పణ లెక్కడివి? మా గ్రామములలో ఉద్యానవనములు వేయు అలవాటులేదు.

సాక్రటీసు.—అట్లైన సాయంకాలములందు మీ ఆడు వాండ్రు ఆటలకై మీ పిల్లల నెచ్చటికి తీసికొనిపోయెదరు?

సుబేదారుమేజరు.—ఎక్కడికిని తీసికొనిపోరు. మీ ప్రశ్న చాల చిత్రముగ నున్నదే.

సాక్రటీసు. — సుబేదారుమేజరువలె అతని భార్యకూడ నాగరికముగను శుభ్రముగను తెలివితేటలుగలదిగను నుండును కదా? గ్రామములోని తక్కిన స్త్రీలవలె ఆమె చీకటియిండ్ల లోను పెంటదిబ్బలమధ్యను కాలముగడపునా?

సుబేదారుమేజరు. — తక్కిన స్త్రీలెట్లో ఆమెకూడ అట్లే కాలముగడపును.

సాక్రటీసు.—సైన్యమును వదలినతర్వాత యథాప్రకారము మీరు మీ పూర్వాచారములలో పడి, మీరు నేర్చుకొనిన దంతయు మరచి, దుస్తులను తీసివేసినట్లు మీకు కలిగిన పరిజ్ఞానమునుకూడ పరిత్యజించినయెడల సైన్యమందున్నపుడు మీకై యధికారులు పడిన శ్రమయంతయు వ్యర్థమైపోయి నట్లే గదా?

సుబేదారుమేజరు.—అయ్యా, మమ్ముల నేమిచేయుమనె దరు? మీ రెల్లప్పుడు ఏదో ఒక క్రొత్తపద్ధతి నుపదేశించుచుం దురు.

సాక్రటీసు.—క్రొత్తదేమున్నది. సైన్యమునువదలి మీరు మీ గ్రామములకు వచ్చినారుగదా, మీ రక్కడ సంపాదించిన జ్ఞానమును విజ్ఞానమును కొంత మీతో తీసికొనివచ్చి, సౌఖ్య విషయమునను, పరిశుభ్రతయందును మీరు మీ యిండ్లను ఇతరులకు ఆదర్శములుగ చేసి, మీ స్త్రీలును, పిల్లలును ఆనం దించుటకై సుందరములగు తోటలవేయుట మీకు యుక్తము గదా?

సుబేదారుమేజరు. — ఇదంతయు చాల హృదయరంజక ముగనున్నది; దీనిని చేయుటకు కావలసిన సౌకర్యములుకూడ మాకు కలవు. కాని ఇందుకు కావలసిన ఐకమత్యము మా యందు లేదు; తగిన నాయకులుకూడ లేరని చెప్పవలసియున్నది.

సాక్రటీసు.—ఇదంతయు ప్రాతపురాణమే కదా? కీడుచే యుటకనిన, ఐకమత్యము లేకపోలేదు. ఏదైన చెడ్డకార్యము నకు, నాయకుల లోపము కనిపించుటలేదు. మంచి చేయ వలసివచ్చినపుడే ఈ ఐకమత్యమును ఈ నాయకత్వమును లేకుండుట!

సుబేదారుమేజరు.—నిజమే. ఇది క్రొత్తకాదు. ఎల్లప్పుడు మా స్థితి ఇట్టిదే.

సాక్రటీసు.—అట్లైన ఈ స్థితిని మార్చుకొనుటకు ప్రయ త్నించవలెను. ఈ గ్రామములోనుండు పింఛను పుచ్చుకొనిన ఉద్యోగస్థులందరు కలసి ఒక సంఘముగ నేర్పడి, కొంతసొమ్ము

చందాలువేసికొని, స్త్రీలు పిల్లలు వినోదార్థము తిరుగుట కొరకు ఉపవనమును వేయుట కేల ప్రారంభింపకూడదు? గ్రామమును చక్కబెట్టుటకు కావలసినమార్గముల నాచరణలోనికి తెచ్చుటకు అట్టివారేల ప్రయత్నింపకూడదు? ఈ ఉద్యోగస్థులు దరిద్రులుకారు; మంచి విత్తనములు, ఇనుపనాగేళ్లు, పర్షియన్ రాట్నములు లోనగు క్రొత్తవన్నియు లాభముకూడ తెచ్చునట్టివి. అపరిశుభ్రతను, రోగములను పోగొట్టు తక్కిన పద్ధతులకుగూడ డబ్బు అక్కరలేదు. జ్వరము మున్నగు రోగములచే పీడింపబడు కారణమున ఇప్పుడు వ్యర్థమగుచుండు కాలమంతయు మనకు సార్థకమై మన ఆదాయమునుకూడ వృద్ధిచేయును. ఎట్లైనను, ఇందువిషయమై ప్రయత్నముచేయుట మంచిది.

సుబేదారుమేజరు.—చాల బాగున్నది. మేమే ప్రారంభించెదము. యుద్ధరంగమున యోధులను నడిపించినట్లు నెమ్మదిగనుండు మీా గ్రామమును ఈ నూతనపద్ధతుల విషయమున నడిపించి చూచెదము.

## ప్రజల సౌకర్యం

ఒకనాడు సాక్రటీసు గ్రామమునకు వచ్చునప్పటికి కరణము గ్రామమునసబు పెద్దకాపు రివిన్యూఇన్‌స్పెక్టరు మొదలగు ఉద్యోగస్థులు జమాబందిలెక్కల తయారుచేయుచుండిరి. అప్పటికి కొన్నిదినములనుండి వీధులను చిమ్మకపోవుటచేత గ్రామము చాల అసహ్యముగనుండెను. అక్కడక్కడ పిడకల ప్రోగు లతనికంటపడెను. కుక్కలు మొరుగుచుండెను. తక్కిన దుర్లక్షణములన్నియు అచ్చటచట నగపడుచుండెను. దీనినంతయును చూచి సాక్రటీసు మిక్కిలి కోపముచెంది ఆ ఉద్యోగ

స్థుల దగ్గరకు వెళ్లి. "నమస్కారము," అని అనెను. కాని ఎవ్వరు అతనికి జబాబు చెప్పరైరి. అప్పుడతడు మరింత బిగ్గరగ "నమస్కారము" అని కేకవేసెను.

"సద్దు, సద్దు. అధికారులందరు కలసి పనిచేసికొనుచుండుట మీకగపడలేదా? నీ వెవరవు, ఓయి ముసలితాతా; ఎందుకీలాగు గొణగుకొనుచు వీరి పనులకు భంగము కలిగించుచున్నావు," అని కరణము పలికెను.

సాక్రటీసు—మర్యాద తెలియని ఓ చిన్నపంతులూ, ఎవరీ అధికారులు.

కరణం.—జాగ్రత్త. అధికప్రసంగము చేయకుము. చేసిన యెడల నీకు కష్టము సంప్రాప్తమగును. నే నెవరనుకొనినావు? ఆరు నెలలనాడు ఖాయముచేయబడిన కరణమును; సర్కారు నౌకరిని. తక్కిన వీరందరుకూడ సర్కారు నౌకర్లు సుమా.

సాక్రటీసు.—క్షమింపుడు. మీరందరు అధికారులనిగదా ఇంతకుముందు చెప్పియుంటిరి. ఇప్పుడేమి నౌకర్లని చెప్పుకొనుచున్నారు?

కరణం.—నిజమే. మేమందరము అధికారులమే.

సాక్రటీసు.—నౌకరి అధికారియగుట ఎట్లు.

కరణం.—అందులో ఆశ్చర్యమేమున్నది. మేమందరము సర్కారు నౌకర్లము కామా? సర్కారు నౌకర్లందరు అధికారస్థులుకారా?

సాక్రటీసు.—నౌకరియొక్క ధర్మము యజమానునికి సేవచేయుటయేకదా? సేవచేయువా డధికారియగుట ఎట్లు?

కరణం.—మేము సర్కారు నౌకర్లము; ఆ కారణముచేత అధికారులము. జాగ్రత్త! మమ్ము నవమానపరచెదవా?

సాక్రటీసు.—జాగ్రత్తగనే యుండెదను; కాని విషయము లను తెలిసికొనగోరుచుండు నన్ను మీరు క్షమించి, మీ రెవ రికి సేవచేయు నౌకరులో సెలవియ్యవలెను.

కరణం.—మూర్ఖుడా, మేమందరము సర్కారునకు సేవ చేయువారము.

సాక్రటీసు.—సర్కారనగా ఏమిటి? అది యొక వ్యక్తియా, లేక వస్తువా, లేక మరేదైననా? అది జీవించుటెట్లు?

రివిన్యూ ఇన్‌స్పెక్టరు.—ఓయి కరణం—నేను జబాబు చెప్పెదను. నీవీ లెక్కలను చూచుచుండుము. ఓయి తాతా, దేశమునంతయును ఒక్కమార్గమున నడుచునట్లు చేయు ప్రతి ష్ఠాపనమే ఈ ప్రభుత్వము. అది వసూలుచేయు పన్నులు భూమిశిస్తు వగైరాలే దానికి జీవనాధారము.

సాక్రటీసు.—చిత్తము. ఈ పన్నులను శిస్తును చెల్లించువా రెవ్వరు.

ఇన్‌స్పెక్టరు.—రైతులు వర్తకులు మొదలగు ప్రజలు.

సాక్రటీసు.—అనగా వీరు సర్కారును భరించుచున్నా రనియు అందుచే సర్కారునకు వీరు (ప్రజలు) యజమానుల నియు అర్థముగదా?

ఇన్‌స్పెక్టరు.—నిజమే.

సాక్రటీసు.—అట్లైన ఈ గొప్ప సర్కారు వీరి లాభము కొరకుగదా స్థాపింపబడియుండుట.

ఇన్‌స్పెక్టరు.—అవును.

సాక్రటీసు.—కరణముగారు పేర్కొనిన సర్కారు నౌకరు లందరు ఈ గొప్ప సర్కారుయొక్క నౌకరులేగదా?

ఇన్‌స్పెక్టరు.—అవును.

సాక్రటీసు.—పన్నుల చెల్లించు ప్రజలు ఈ సర్కారునకు యజమానులు గనుక ఈ నౌకరులుకూడ ప్రజలయొక్క నౌకరులనియేగదా అర్థము.

ఇన్‌స్పెక్టరు.—నిజమే.

సాక్రటీసు.—ఈ గ్రామమందలివారు సర్కారునకు శిస్తు చెల్లించుచున్నారు గనుక ఇచ్చటి సర్కారునౌకరులందరు ఈ గ్రామముయొక్క మేలుకొరకుగదా ఉండుట.

ఇన్‌స్పెక్టరు.—ఆలాగే తోచుచున్నది.

సాక్రటీసు.—అట్లైన "అధికారులు, అధికారులు," అను ఈ గంభీరప్రసంగమంతయు పొరపాటుగదా? మీ కరణముతోపాటు మీరందరు సర్కారు నౌకరులు గనుక ఈ గ్రామస్థుల నౌకరులని చెప్పదగియున్నారు.

ఇన్‌స్పెక్టరు.—అందు కంగీకరించుచున్నాను.

సాక్రటీసు.—అట్లైనయెడల ఈ కరణము చిన్నవాడుగ నుండునప్పుడే ఇతని నోటిని మూసి, ఇతడీగ్రామస్థుల నౌకరియే గాని వీరిపై అధికారికాడని నేర్పుట ఆవశ్యకముగదా?

ఇన్‌స్పెక్టరు.—నేనతనికి దీనిని నేర్పెదను.

సాక్రటీసు.—సర్కారు నౌకర్లగు మీరందరు చదువుకొనిన వారేగదా?

ఇన్‌స్పెక్టరు.—కాకేమి? చదువురానియెడల మేము మా పనుల నెట్లు చేయగలిగియుందుము?

సాక్రటీసు.—అట్లైన, పెంటపోయుటకు గోతులు, పరిశుభ్రత, విద్య, టీకాలు, గ్రామపునరుద్ధరణము మొదలగు విషయములగురించి వ్రాయబడిన పత్రికలను జిల్లా గెజటును మీరు చదివితిరిగదా?

ఇన్స్పెక్టరు.—ఈ పత్రికలను చూచినట్లే జ్ఞప్తి.

సాక్రటీసు.—ఈ విషయముల గురించియు, గ్రామము లోని లోపములను చక్కబెట్టుటను గురించియు జిల్లా కలెక్టరుగారిచ్చిన యుపన్యాసమును మీరు వింటిరా?

కరణం, మునసబు, ఇన్స్పెక్టరు (అందరు కలసి): విననేమి? విసుగెత్తువరకు వింటిమి. అట్టి ప్రలాపముల నిదివరకెప్పుడు వినినదిలేదు. కాని అది అంతయు మాకెందుకు? ఒక్కొకమారు మా తహసీల్దారునకుకూడ ఈ పిచ్చిపట్టుచుండును. అతడుకూడ మాకీ లేనిపోనిపనిని కల్పింప ప్రయత్నించుచుండును. కాని ఇప్పటివరకు మేము మా అదృష్టవశమున ఈ బాధనుండి తప్పించుకొనగలిగితిమి.

సాక్రటీసు (రహస్యముగ).—ఇదంతయు పిచ్చి అయిన యెడల ఈ పిచ్చిబట్టిన కలెక్టరు మిమ్మందరిని కొరికిన బాగుండును. (కోపముతో బిగ్గరగ) మీరందరు విశ్వాసఘాతుకులు.

ఇన్స్పెక్టరు.—జాగ్రత్త. ఈ మాటలు చాల కఠినములైనవి. ముసలివాడవని చనవిచ్చినందుకు హద్దుమీరి మాటలాడుచున్నావు.

సాక్రటీసు.—ఏమిటిది? ఓయి అధికారీ—కాదు కాదు—ఓయి సర్కారునౌకరీ — ఈ విషయమునుగురించి నీకు సమస్తము తెలియునుగదా. ఇది మంచిపనియనియు ప్రజలకు మేలు చేయునదియనియు నీకు తెలిసియుండికూడ నీవు దానిని అసహ్యించుకొనుచు దానిని చేయుటకు ప్రయత్నించువారిని చూచి పరిహాసముచేయుచు వారికి సహాయముచేయుట మానుకొనుచున్నావు.

ఇన్స్పెక్టరు.—ఇది మా పనికాదు.

సాక్రటీసు.—ఆలాగా? మీరు సర్కారునౌకర్లనియు, అందుచే ఈ గ్రామస్థుల నౌకర్లనియు ఇప్పుడే చెప్పితిరిగదా? రోగమువలన మృత్యువాతపడనున్నట్టియు, రోతనుపుట్టించు స్థితిలోనున్నట్టియు, అనవసరముగ దారిద్ర్యబాధ ననుభవించు చుండునట్టియు ఈ ప్రజలను ఉద్ధరించుట మీ పనికాదా?

ఇన్‌స్పెక్టరు.—మాకు ఇతరవిధములగు పనులెన్నో ఉన్నవి. కాని ఇది వానిలో చేరినదికాదు.

సాక్రటీసు.—మీరు పొరపడుచున్నారు. వీరు చెల్లించు పన్నులనుండియేకదా మీకు మీ జీతములు ముట్టుచుండుట. వీరు చెల్లించు పన్నులమూలమున భరింపబడుచుండు పాఠశాలలు, రోడ్లు, ఆసుపత్రులులోనగువానినుండి మీరు లాభము పొందుచున్నారు గదా? ఇట్లుండియు వీరికి సహాయముచేయుట, వీరి స్థితిగతులను బాగుచేయుట, మీ పనికాదని మీరు చెప్పుట చాల అసంగతముగనున్నది.

ఇన్‌స్పెక్టరు.—మాకెన్నో పనులున్నవి. ఈ పని మాది కాదు.

సాక్రటీసు.—విద్యావంతులగు మీరే ప్రజాసేవ విషయమున ఈ విధముగ విముఖులైయున్నప్పుడు గ్రామము లిట్టి విషాదకరమగు స్థితియందుండుట ఒక వింతకాదు. ఒక పిల్లవాడు గాని, ఆవుగాని, స్త్రీగాని (స్త్రీని, కడపటను అప్రధానముగను పేర్కొన్నందుకు క్షమింపవలెను; ఈ గ్రామములలో నా అనుభవమునుబట్టి ఇట్లు చేసితిని) నూతిలోబడినయెడల, "నాకు అనేకములైన పనులున్నవి. సహాయార్థ మెవరినైన పిలుచుటయు బావినుండి వీరిని పైకిలేవదీయుటయు నా పనికాదు," అని మీరు చెప్పెదరా?

ఇన్‌స్పెక్టరు.—ఇట్టి తెలివితక్కువ మాటలు మాటలాడకుడు. ఇది సామాన్య విషయము. మనుష్యులన్న వారందరు చేయవలసిన పని. అట్టి సందర్భములో నేను వెంటనే కేకవేసి, చేత్రాడు తెచ్చి బావిలోపడినవారిని పైకెత్తెదను.

సాక్రటీసు.—ఇట్లు చేసినయెడల నీ కాలము వ్యర్థమగును; నీ బట్టలు తడిసిపోవును.

ఇన్‌స్పెక్టరు.—ఏమైనను ఇట్టి సమయమున సహాయము చేయుట నాకు విధి.

సాక్రటీసు.—ఇంటికి నిప్పంటుకొనినయెడల ఏమిచేసెదవు.

ఇన్‌స్పెక్టరు.—నా బట్టలు కాలిపోయినను నా శక్తికొలది సహాయముచేసి మంట చల్లార్చెదను.

సాక్రటీసు. — ఇదికూడ సామాన్య మానవవిధియగుట చేతనే కదా?

ఇన్‌స్పెక్టరు.—అంతే.

సాక్రటీసు.—ఇన్నిటి కంగీకరించియు, అశుభ్రత అనారోగ్యము అజ్ఞానములవలన పసిపిల్లలు చూపును ఆరోగ్యమును సౌందర్యమును జీవితమును పోగొట్టుకొనుచుండ; ఏమి చేయుటకు తెలియని కారణముచేతను లాభకరములగు వ్యవసాయ పద్ధతులు ఎరుగమిచేతను గ్రామస్థులు పంటలలో నష్టిపొందుచుండ వారేమిచేయవలసినదియు చెప్పుట మీ విధికాదని మీరు సెలవిచ్చుట యుక్తమా?

ఇన్‌స్పెక్టరు.—అయ్యా, ఇదివర కీవిషయమై ఇట్టి ఆలోచన నాకు తట్టినదికాదు. నీ ఉపదేశము సరియైనదనియు, ప్రజల నౌకర్లమగు మేము మమ్ముల పోషించు ప్రజలయెడ కృతఘ్నులముగ నున్నామనియు ఇప్పుడు నాకు తోచుచున్నది.

సాక్రటీసు.—బిడ్డ నూతిలోపడి చచ్చుటకును మశూచి కము అతిసారము లోనగు వ్యాధులమూలమున చచ్చుటకును భేదమేమున్నది? నూతిలోపడి చచ్చుట అంత బాధకరమైనది కాదనియు అంటువ్యాధివంటిది కాదనియుకూడ చెప్పదగియున్నదికదా?

ఇన్స్పెక్టరు. — మీరు చెప్పునది సరిగనున్నది. మా విధ్యుక్తధర్మములగురించి మీరు వ్యక్తపరచినది మిక్కిలి నూతనమైనను న్యాయమైన అభిప్రాయముగనున్నది. మీరు సెలవిచ్చినప్రకారము నేను నడుచుకొనెదను. నేనును నా కరణములు ఇదిమొదలు మీ సహాయకోటిలోనివారమగుచున్నాము. ఓయి మునసబు, పెద్దకాపూ, మీరుకూడ దీనిని తెలిసికొనవలెను. మనకందరికి మంచి పలుకుబడియు గొప్ప అవకాశములు ఉన్నవిగదా? వీనిని మంచిమార్గములం దుపయోగించి, ప్రజలను పీడించుటకు బదులు వారిని బాగుచేయుటకు ప్రయత్నింపవలెను. సాక్రటీసుగారూ, సెలవు. మీరు చేసిన ఉపదేశము కటువైనను చాల శ్రేష్ఠమైనది. దాని నెన్నడు నేను మరవజాలను.

ఈ ఉద్యోగస్థులందరు సెలవుపుచ్చుకొని వెళ్లిపోయిన తర్వాత సమీపమందు నిల్వబడి జరిగిన సంభాషణమునంతను వినుచుండిన పింఛనుపుచ్చుకొనిన పైనోద్యోగస్థుడు ఒకడు, "శభాష్, సాక్రటీసుగారూ, వీరందరు ప్రజాహింసకులు. వారిని సన్మార్గప్రవర్తకులుగ చేసినందుకు నేను చాల సంతోషించుచున్నాను" అని చెప్పెను.

సాక్రటీసు.—(బహు కోపముతో) పింఛనుపుచ్చుకొనిన ఉద్యోగస్థులును, సిపాయీలును అగు మీరుమాత్ర మెట్టివారు?

మీరు వీరి తాతలు. సైన్యమందుండినపుడు పరిశుభ్రత ఆరోగ్యము మొదలగు విషయములనుగురించి మీరు నేర్చుకొంటిరి; మీరనేక దేశముల చూచితిరి; గొప్పవారును విద్యావంతులును అగు నాయకుల సహవాసముచేసితిరి; మిమ్ములను వారు వారి బిడ్డలవలె చూచుకొనుచుండిరి. ఇప్పుడు మీరేమి చేయుచున్నారు? గ్రామస్థులు చెల్లించు పన్నులనుండి ఇయ్యబడు పింఛనులనుతీసికొని మీరిక్కడికివచ్చి మంచి యిండ్లుకట్టుకొనుట, లాభకరముగ సేద్యముచేయుట, పరిశుభ్రముగనుండుట మొదలగు విషయములలో వీరికి మార్గదర్శులై, స్త్రీలను గౌరవించవలసినదనియు, పిల్లలకు చదువుచెప్పించవలసినదనియు వీరి కుపదేశించుటకు బదులు వీరివలెనే మీరుకూడ పూర్వపు దురాచారములలో పడి సైనికపుదుస్తుల విడిచిపెట్టినవిధమున మీకు కలిగిన పరిజ్ఞానమునుకూడ విడిచి సోమరిపోతులై నేర్చుకొనినదానిననుసరించి నడుచుకొనుటకు వెనుదీయుచున్నారు. చీ.

పింఛనుపుచ్చుకొనిన ఉద్యోగి.—అయ్యా, మీరు చెప్పుదానిలో చాల సత్యమున్నదికాని వీరివలె మేము ప్రజలను పీడించువారమమాత్రము కాము.

సాక్రటీసు.—(ఇంకను మరింత కోపముతో) మీరు పీడించువారుకారు; అంతకంటె నీచులు. ఇతరులు పెట్టు అన్నమును తిని వారి కేవిధమైన ప్రత్యుపకారము చేయనివారు. మీరు కొంబుజూపురుగులవంటివారు. ఇప్పుడైనను మీరు మేల్కొని మీరిదివరకు నేర్చుకొనిన విషయముల నాచరణలో పెట్టి మీ ఇండ్లను, గ్రామములను, శుభ్రములుగను, ఆరోగ్యములుగను చేసికొనుడు.

పింఛర్ ఉద్యోగి.—ఈ దినము మీరు చాల కఠినముగ మాటలాడుచున్నారు. మేము మాచేతనైనంతవరకు ఈ గొప్ప కార్యమందు తోడ్పడెదము.

సాక్రటీసు.—చాల సంతోషము. సుబేదారుగారూ, కఠినోక్తులాడినందులకు నన్ను క్షమింపవలెను. అప్పుడప్పుడు మీపై కొంచెము కోపమువచ్చినను మీరు బాగుపడజాలరేమోయను విచారమప్పుడప్పుడు కలుగుచుండినను నా మనస్సునందు ద్రోహ చింత ఏమియులేదు. నేనుకూడ ఒకప్పుడు సైన్యమందు పని చేసితిని; సిపాయీలయెడ నాకుగల ప్రేమ అపరిమితము.

## మానవుని ఔన్నత్యము

సాక్రటీసు.—పల్లెటూళ్లలో కాపురముచేయు మీయొక్క పద్ధతులనుగురించి ఆలోచించుకొలది హీనజాతులని మీచే పరిగణింపబడు అడవిమృగములకన్న దేనియందును మీరు ఉత్తములుకానట్లు కనపడుచున్నది.

గ్రామస్థులు.—అయ్యా, ఎప్పటికంటె ఈ దినము మీరు మరింత కోపముతోనున్నారు. మా జీవితపద్ధతులన్నిటిని పూర్తిగ ఖండించుచున్నారు. కారణము తెలియుటలేదు.

సాక్రటీసు.—ఈ ఉదయమున నేను వచ్చుచుండినపుడు మీవారిలో ననేకులు దగ్గర పొలములలోను, డొంకలలోను జంతువులవలె మరుగుగాని, శుభ్రతగాని పాటింపక బహిర్భూమికి వెళ్లుచుండుట చూచితిని. ఈ విషయమున మీకంటె జంతువులు మేలుగనున్నవనికూడ చెప్పవచ్చును.

గ్రామస్థులు.—ఎక్కడనో ఒకచోట ఏదో ఒక సమయమున బహిర్భూమికి వెళ్లవలయునుగదా? ఈ విషయమున మా పద్ధతులు చాల మోటుగనున్నవనియు, దుర్గంధము సహింపరానిదనియు మేము ఒప్పుకొనుచున్నాము. కాని ఇదియంతయు మా కలవాటయి యుండుటచేత దీనిని మేము అంతగ పాటించుటలేదు. సరేగాని, మేమీ సందర్భమున చేయతగినది ఏమియున్నది.

సాక్రటీసు.—మీ గ్రామమందు పెంటపోయుటకై మీరిప్పుడు గోతులను త్రవ్వుచున్నారుగదా?

గ్రామస్థులు.—మీ యుపదేశము మూలమున మేమాపని చేయుచున్నాము. ఇప్పుడు మా గ్రామములెంతో పరిశుభ్రముగనున్నవి; మా పిల్లలు ఆరోగ్యవంతులుగ నున్నారు; వారి కన్నులు బాగుగనున్నవి; ఈగలు తగ్గినవి; దుమ్ముకూడ తగ్గిపోయినది; పంటలు రెండింతలైనవి. ఈ గోతులు మాకెంతో లాభకరముగ నున్నవి.

సాక్రటీసు.—అట్లైన ఆ గోతులను మీరు మరుగుదొడ్లుగ చేసికొనగూడదా? గోతిచుట్టును ఒక గోడనో, తెరనో కట్టి అడ్డముగ రెండు చెక్కలు వేసినయెడల ప్రశస్తమగు మరుగుదొడ్డియగును. ఆ దొడ్లలో కొన్నిటిని మగవారికిని కొన్నిటిని స్త్రీలకును వేరువేరు చేసి ఉపయోగింపవచ్చును. ఇట్లు చేసినయెడల పొలములకు కావలసిన ఎరువు అధికమగును; దుర్వాసన ఉండదు; జంతుజాలముకంటె మీరధికులుకారను అపవాదము కూడ పోవును. గోతులలో మీరు ప్రతిదినము పోయుచుండు పెంట, పేడ, బూడిద ఈ మలమును కప్పివేయుటచేత దుర్వాసనయు,

ఈగలు నశించును. మలముపై వ్రాలిన ఈగలు మీరు తిను అన్నముమీదను, మీ పిల్లల కన్నులపైని వ్రాలుట నిలిచిపోవుట చేత మీ ఆరోగ్యముకూడ వృద్ధియగును.

గ్రామస్థులు.—మొట్టమొదట స్త్రీలవిషయమై ఇట్టి ఏర్పాటుల గావించి, తర్వాత పురుషుల విషయములోకూడ ఇట్లు చేయుటకు ప్రయత్నించెదము.

సాక్రటీసు.—ఈ యేర్పాటుమాత్రము చాలదు. ఇతరవిషయము లనేకములలో మీరు జంతువులవలె నున్నారు.

గ్రామస్థులు.—ఏదీ? చెప్పి చూపింపుడు.

సాక్రటీసు.—ఎలుకల బొరియలవలెను, పందుల బొత్తెలవలెను మీ యిండ్లు చీకటిమయములుగను, కిటికీలు లేనివిగను ఉన్నవి గదా?

గ్రామస్థులు.—ఉన్నవి. కాని మాలో కొందరము కిటికీలు పెట్టుకొనుచున్నాము. మీ మాటలను పెడచెవిని పెట్టినవారము కాము.

సాక్రటీసు.—మీ వివాహములు పశువుల వివాహములవంటివేకదా? వివాహము జరిగినట్లు తెలియుటకు లిఖితపూర్వమగు ఆధారము ఏమున్నది?

గ్రామస్థులు.—ఈ విషయమున మీరు పొరపాటుపడుచున్నారు. వెనుకటిసారి మీరీవిషయమై చెప్పినతర్వాత మేము వివాహపు రిజిస్టర్లను పెట్టుకొనుటకు ప్రారంభించితిమి. దీని వలన కోర్టులకెక్కుట మొదలగు కష్టములు తగ్గిపోయినవి గనుక ఈ రిజిస్ట్రేషను సర్వసామాన్యముగను నిర్బంధముగనుండవలెనని మావారందరు ఇప్పుడంగీకరించుచున్నారు. ఇందుచే నిర్బంధ

శాసనము గావించవలెనని సర్కారువారిని కోరుటకు మేము ప్రయత్నించుచున్నాము.

సాక్రటీసు.—చాల బాగుగనున్నది. జంతుజాలముకన్న ఔన్నత్యమును పొందుటకు మీరు ప్రయత్నించుచున్నారు.

గ్రామస్థులు.—నిజము. కాని, మేము చేసికొనుచుండు తక్కిన మార్పులను మీరు మరచుచున్నట్లున్నది. పుస్తకములు, భవనములు, రైళ్లు, కుట్టుయంత్రములు, బైసికళ్లు—వీనిమాట ఏమిటి.

సాక్రటీసు.—నీవు వ్రాయగలవా?

గ్రామస్థుడు.—నా చేతకాదు.

సాక్రటీసు.—ఇటికతో ఇండ్లను కట్టగలవా?

గ్రామస్థుడు.—నేను తాపీవాడను కాను.

సాక్రటీసు.—బైసికిలునుగాని, కుట్టుయంత్రమునుగాని, అధమపక్షమొక బండినిగాని చేయగలవా?

గ్రామస్థుడు.—మేము వడ్రంగులము కాము. కమ్మరులము కాము.

సాక్రటీసు.—మీరు రైళ్లను చేయగలరా?

గ్రామస్థులు.—మేము ఇంజినీర్లము కాము. మేమందరము గొప్ప రైతులము.

సాక్రటీసు. — అనగా ఈ విషయములన్నిటిలో మీకును మృగములకును భేదములేదనియే నా అర్థము. వీనిలో దేనిని కూడ మీరు చేయలేరుగదా?

గ్రామస్థులు. — చేయలేము కాని, వీనినన్నిటిని ఉపయోగింపగలము.

సాక్రటీసు. — నిజమే. ఎలుక రైలుబండిలో కూర్చుండ గలదు; అంతమాత్రముచే అది మనుష్యునితో సమానమగు చున్నదా? ఇదిగాక, మీ బైసికిలుగాని, కుట్టుయంత్రముగాని చెడిపోయినయెడల దానిని చక్కచేసికొనుటకు మీకు చేత వచ్చునా?

గ్రామస్థులు. — దీనికేమిగాని, మేము మృగజాతికంటె ఉత్తములమే. సందేహములేదు.

సాక్రటీసు.—ఉత్తములా—కానేకారు. మీరు జాతిచేత వేరని చెప్పిన నేను సమ్మతింతును. ఏలాగు మీరు ఉత్తములు కారో నేను చెప్పెదను. మీ పిల్లలు మురికితోనుందురు; మీరు వారికి నీళ్లుపోయరు; మీ ఇండ్లు మురికిగనున్నవి. మృగములన్నను వాని పిల్లలను నివాసప్రదేశములను చాల శుభ్రముగ పెట్టుకొనుచున్నవి. మృగములకు రోగములు వచ్చుటలేదు; మీ పిల్లల కన్నులవలెను, మీ కన్నులవలెను వాని పిల్లలకన్నులు జబ్బుగనుండుటలేదు. మీవలె మృగ ములు ఆడుపిల్లలను నిర్లక్ష్యముచేయుటలేదు; మగపిల్లలను, ఆడు పిల్లలను ఒకేవిధముగ పెంచును. మృగములు మీవలె ఆడు జాతిమృగముల గదులలోపెట్టి తాళమువేసి ఆరోగ్యముగాని, సుఖముగాని లేకుండ చేయుటలేదు. మీవలె మృగములు ఇతరుల భార్యలను తీసికొని పారిపోవుటలేదు. మీవలె మృగ ములు పరస్పర విరోధములచేత కోర్టుల కెక్కుటలేదు; నూతి నీటిని మీరు చెరచునట్లు త్రాగెడినీళ్లను అవి చెరచుటలేదు.

గ్రామస్థులు.—చాలు చాలు; మీ మాటలు మాకు తల వంపులుగ నున్నవి.

సాక్రటీసు.—నేను నిజము చెప్పుచున్నానా అబద్ధమాడుచున్నానా?

గ్రామస్థులు.-అంతయు నిజమే. కాని వినుటకుమాత్రము చాల కష్టముగనున్నది.

సాక్రటీసు.—మీ మనస్సులకు ఇంపుగా నేను అబద్ధములాడవలయుననియా మీ కోరిక?

గ్రామస్థులు.—కాదు; దానివలన లాభములేదు. అట్టి స్తోత్రములను వందలకొలది సంవత్సరములనుండి వినుచున్నాము. కాని మాచేత పరుగెత్తుటకు రాదు; మేము మెల్లగ నడువవలసినవారము. కాలక్రమమున ఒక్కొక్కమార్పు గావించుకొనుచు మీరు చెప్పినదంతను కొంతకాలమునకు పూర్తిగ ఆచరణలోనికి తెచ్చుకొనెదము. మా సోదరులను ఆడువాండ్రను ఒప్పింపవలెను; ఒక్కొక్క క్రొత్తవిషయములో కొంతకాలమునకుగాని వారి అంగీకారముపొందుట కష్టము.

సాక్రటీసు.—ఇదంతయు చక్కగనున్నది. మీరు చెప్పిన దానియందు లోపమేమియు లేదు. కాని ఒక్కొక్కప్పుడు మాత్రము నాకు కొంచెము విసుగుపుట్టి మీరింతకంటె మంచి స్థితికి రారేమో అను భయము కలుగుచుండును.

గ్రామస్థులు. — మేమిప్పుడు పూర్వముకంటె కొంచెము మంచిస్థితికి వచ్చియున్నాము. దీనిని మీరెరుగుదురు గదా?

సాక్రటీసు.—అవును. అనేకములగు మార్పులు నాకు కనిపించుచున్నవి. పెంటగోతులు, వివాహపు రిజిస్టర్లు, కొన్ని కిటికీలు, నగలకై చేయు వ్యయముతగ్గుట – లోనగు మంచి మార్పులు కొన్ని నా కంటపడుచున్నవి.

గ్రామస్థులు.—అయ్యా, మీకు చాల కృతజ్ఞులము. మీ మాటలు మాకు చాల ప్రోత్సాహకరములుగ నున్నవి.

సాక్రటీసు.—అవును (అని చెప్పుచు, మూలదారిని ఇంటికి వెళ్లుచు కపటమగు నవ్వుతో). ఒక విషయమునమాత్రము మృగములకంటె మీరు ఔన్నత్యము గాంచియున్నారు. దానిని చెప్పక నేను వెళ్లిపోగూడదు. కల్లుత్రాగుటగాని, చుట్టపట్టుట గాని మృగములకు తెలియదు.

## మానవులు, మృగములు

సాక్రటీసు గ్రామచావడివద్దకు వచ్చునప్పటికి గ్రామము లోని పెద్దలందరు ఎప్పటివలె చుట్టత్రాగుచు కూర్చుండియుండిరి.

సాక్రటీసు.—నేను మీ గ్రామమునకువచ్చి మీమధ్య కాపురముండి మీ సంప్రదాయములను, ఆచారములను గమనించి (పరికించి) చూడవలయునను కోరికతోనున్నాను.

ఈ మాట వినగనే గ్రామస్థులు తలలూచి ఆగ్రహముతోడను, సంభ్రమముతోడను గొణగసాగిరి. తుదకు వారిలో ముసలివాడొకడు, "సాక్రటీసుగారూ, మాకు మీయందుగల గౌరవము మెండు; మీ వయస్సును, పాండిత్యమును మేమెంతో కొనియాడుచున్నాము. కాని మీరు మామధ్య కాపురముండుటకుమాత్రము మాకు బొత్తిగ ఇష్టములేదు" అని పలికెను.

సాక్రటీసు.—ఏమీ? తిరిగి మీకు ఆగ్రహము కలిగించి నట్లున్నాను. నేను మీమధ్య కాపురముండి మీ అలవాటుల కనుగొనకూడదా?

గ్రామస్థులు.—క్షమించవలెను. కోపపడకుడు. ఇదిమా త్రము జరుగతగినదికాదు. మేమందరము ఆడువారితోను, పిల్లలతోను ఉండు గృహస్థులము; కావున ఇది ఎంతమాత్రము వీలుకాదు.

సాక్రటీసు.—ఏల?

గ్రామస్థులు.—అది వీలులేనట్టి పని.

సాక్రటీసు.—ఏల వీలుకానట్టిది?

గ్రామస్థులు.—స్పష్టముగ చెప్పవలసినదేనా? వినుడు. మా స్త్రీలలో కొందరికి ఘోషా ఉన్నది. మీరు గ్రామమందు కాపురముండినయెడల మా ఆడువారు మీరు చూచెదరను భయముచేత ఇటు అటు తిరుగుటకును, వారి పనులను చేసికొను టకును సంకోచపడుచుందురు.

సాక్రటీసు.—(గట్టిగ నవ్వుచు) మీ మాటలు ఎంత బాగుగ నున్నవి! నేనుమాత్రము కుటుంబినికానా? నాకు అరువది సంవత్సరముల వయస్సుకాదా? నన్నుచూచి భయపడుటేల?

గ్రామస్థులు.—(కొంత కలవరపాటుతో) మీ రేమనుకొనినను సరే. ఇది మా ఆచారము. మీరుమాత్రము మా గ్రామమందు కాపురముచేయ వీలుపడదు.

సాక్రటీసు.—అట్లైన నేను మీ గ్రామమునకు వెలుపల కాపురముండి మీ కభ్యంతరములేనపుడు లోపలికివచ్చెదను.

గ్రామస్థులు.—(సిగ్గుతో) ఇదికూడ సాధ్యముకాదనియే తోచుచున్నది.

సాక్రటీసు.—ఈలాగు సెలవిచ్చుచున్నారేమి? మీ పశువులకుగూడ ఘోషా ఉన్నదా? బైట కాపురముండుటవలన మీ కేట్టి కష్టము కలుగును?

గ్రామస్థులు.—అది కాదు; కాని బైట ఉండుటకూడ కాని పనియే.

సాక్రటీసు. — మీ రేదో గుప్తముగనుంచుచున్నారు. ఆ రహస్యమును చెప్పుడు. మీకు కోపము కలిగింపవలెనని నేను కోరుటలేదు; కాని సాధ్యమైనంతవరకు మీ సమీపమున కాపురముండుటయే నా అభిలాష.

గ్రామస్థులు.—మాకుకూడ ఎట్టి అభ్యంతరము లేదు. మీరు మా మేలును కోరువారన్నమాట మాకు తెలియును. కాని మా గ్రామముచుట్టును పెంటదిబ్బలున్నవి; మేమచటనే బహిర్భూమికి వెళ్లుచుందుము. ఈ కారణముచేత మీవంటి వారు గ్రామమునకు బైట కాపురముచేయుట దుష్కరము. సమస్తము పరిశుద్ధముగనుండవలెనని చెప్పు మీరు ఆ ప్రదేశమున కాపురముచేయజాలరు. ఇదియునుగాక మా ఆడువారు అచటికికూడ వెళ్లుచుందురు.

సాక్రటీసు. — ఏమిటీ! మీ ఆడువారికి ఘోషా అని ఇప్పుడేకదా చెప్పితిరి?

గ్రామస్థులు.—అవును. వారికి ఘోషాయే.

సాక్రటీసు. — మీ ఘోషా చాల చిత్రముగనున్నదే. ఇంటిలో ఘోషా, బహిర్భూమికి పదిమందిలో బహిరంగముగ కూర్చుండుట! మీ ఆచారములు చాల వింతగనున్నవి.

గ్రామస్థులు.—వారు బహిర్భూమికి రాత్రిపూటనే వెళ్లెదరు.

సాక్రటీసు.—ఇది మరింత వింతగనున్నది. అయ్యా, వారికి జబ్బుచేసి పగటిపూటనే వెళ్లవలసివచ్చినయెడల ఏమిచేయుదురు?

గ్రామస్థులు.-- చీకటిపడువరకు వారెట్లో వేచియుండెదరు?

సాక్రటీసు.-ఎంత బాధ, ఎంత కష్టము, ఎంతటి అనారోగ్య హేతువు? పురుషు లీవిధముగ బాధపడుటకు మీ రంగీకరించెదరా?

గ్రామస్థులు. — మాకేల ఇట్టిబాధ? మేము ఎప్పుడనిన అప్పుడు, ఎక్కడికనిన అక్కడికి వెళ్లెదము.

సాక్రటీసు.—స్త్రీలవిషయమున మీరెంత కఠినహృదయులుగ నున్నారు.

గ్రామస్థులు.—అంతగ వెళ్లవలసినయెడల స్త్రీలు పైర్లమధ్య కూర్చుండెదరు.

సాక్రటీసు.—సంవత్సరము పొడుగునను పైర్లుండునా?

గ్రామస్థులు.—పొదలులోనగునవి యుండును.

సాక్రటీసు.—అవును. కాని అచట మరుగెక్కడిది. బహిర్భూమికై అందరు అక్కడికి వచ్చుచుందురు; పొద లనేకము లుండవు; చాటు ఒకవైపునేగాని అన్నివైపుల ఉండదు. వారక్కడ కూర్చుండియుండునపు డెవరైనవచ్చినయెడల వారు నిలువబడి పరుగెత్తిపోవలసినదే కదా? ఎంత అసహ్యము!

గ్రామస్థులు.—ఇదంతయు నిజమే.

సాక్రటీసు.—అట్లైన మీరు స్త్రీలవిషయమున కఠినహృదయులగుటమాత్రమే కాదు. అంతకంటెను గొప్ప అపచారమును గావించుచున్నారు. మీలో ఘోషాయున్నట్లును మీరు అగ్రవర్ణస్థులనియు విఱ్ఱవీగుచున్నను, మీ స్త్రీలకు మానభంగము కలిగించుచున్నారు. మీ ఆచారములు క్రూరములు; రోతను పుట్టించునవి; అవమానకరములైనవి; మీ స్త్రీలమానమును భంగపరచునవి.

గ్రామస్థులు.—సరి. కాని దీనికి ప్రతిక్రియ ఏమిటి?

సాక్రటీసు.—ప్రతిక్రియ చాల సులభమైనది. మీ పెంటకును, ఎరువునకును గోతుల త్రవ్వియున్నారుగదా?

గ్రామస్థులు.—అవును.

సాక్రటీసు.—అట్లైన వాటిచుట్టును గోడలనో, తెరలనో కట్టి (గోడలుకట్టుట ఉత్తమము. అవి ఈగలు రాకుండ జేయును) వాని మధ్య రెండు చెక్కలువేసినయెడల ప్రశస్తమగు మరుగుదొడ్డి యగును. ఈ ప్రకారము గ్రామముచుట్టు ఏర్పడిన మరుగు దొడ్లలో కొన్నిటిని స్త్రీలకును, కొన్నిటిని పురుషులకును వేరు చేయుడు. ఇట్లు చేసినయెడల మీ స్త్రీలు రాత్రిగాని, పగలుగాని, సుఖముగను, నిర్భయముగను బైటికి వెళ్లగలిగియుందురు. వారును మీరును ఉదయమున ఈ గోతులలో దొడ్డికి వెళ్ల వచ్చును; తర్వాత మీ ఇండ్లను, వీధులను చిమ్మినపిమ్మట బూడిద, పెంట, పేడలోనగువాని నన్నిటని ఆ గోతులలో పడవేసినయెడల దుర్వాసనగాని, ఈగలుగాని ఉండవు. మీ పొలములకు మరింత ఎక్కువగ ఎరువుదొరకును.

గ్రామస్థులు.—మేమిలాగే చేసెదము. మా ఆచారములలో గర్హింపదగినదానినొకటి మీ రీవిధముగ సూచించినందుకు మేము చాల కృతజ్ఞులము. ఎంతకాలమునుండియో దీనిని ఆచారముగ పరిగణించినవారమగుటచేత మా మనస్సులు గట్టిపడిపోయినవి. మా కృతజ్ఞతను మీకు మరిమరి చూపవలసియున్నది. నమస్కారము.

## ముగ్గురు యజమానులు

సాక్రటీసు.—సోదరులారా, నమస్కారము.

గ్రామస్థులు.—నమస్కారము.

సాక్రటీసు.—ఈ ఉదయము మీ గ్రామమంతయు పెంటతోడను దుర్గంధముతోడను నిండియున్నది. ఇక్కడకు వచ్చినప్పటినుండి తల తిరుగుచున్నది.

గ్రామస్థులు.—ఏమిచేయగలము! పాకీవారందరు ఈ రోజు ఎక్కడికో పెండ్లికిపోయిరి; ఆ కారణముచే గ్రామమంతయు రోతగనున్నది.

సాక్రటీసు.—ఎంత విచారకరము! కాని ఈ గ్రామమునకు రెడ్లును, నాయళ్లును యజమానులుగాని, పాకీవారు యజమానులుకారని గదా నే ననుకొనియుంటిని. పాకీవారా దీని కిప్పుడు యజమానులు. మీరు కారా?

గ్రామస్థులు.—మేమే యజమానులము. పాకీవారు మాకు యజమానులనియు, ఈ గ్రామమువారిదనియు మీరనుకొనుటకు కారణమేమి?

సాక్రటీసు.—వర్షములేనియెడల పంటలుపోవుటయు ఆకలి బాధవలన మీరందరు చచ్చుటయు సంభవించునుగదా?

గ్రామస్థులు.—అవును.

సాక్రటీసు.—వర్షమును కురిపించువాడు భగవంతుడుగదా?

గ్రామస్థులు.—అవును. ఈ ప్రశ్న ఏల?

సాక్రటీసు.—ఈ కారణముచే భగవంతుడు మీకు యజమానుడని ఒప్పుకొందురు గదా?

గ్రామస్థులు.—తప్పక.

సాక్రటీసు.—సర్కారువారు సిపాయీలను, పోలీసువారిని, కోర్టులను, రోడ్లు లోనగువానిని ఏర్పాటు చేయనిపక్షమున అంతయు గందరగోళమైపోవును గదా?

గ్రామస్థులు.—నిజమే. రాత్రిపూట దొంగలు కొట్టుట, రోడ్లమీద ప్రయాణము అసాధ్యమగుట, పోస్టాఫీసులు లేకపోవుట, కాలువలనుండి పొలములకు నీళ్లురాకుండుట—ఇట్టి నష్టములు సంభవించును.

సాక్రటీసు.—కావున సర్కారువారు మీకు యజమానులని మీరు అనుకొనుచున్నారు గదా?

గ్రామస్థులు.—సర్కారువారుకూడ మాకు యజమానులే.

సాక్రటీసు.—కావున పాకీవారుకూడ మీకు యజమానులని నేను చెప్పుచున్నాను.

గ్రామస్థులు.—కానేకారు. ఇట్టిమాటల సెలవిచ్చెదరేల?

సాక్రటీసు.—పాకీవాడు మీ గ్రామమును ఊడువనియెడల పారిశుద్ధ్యము చెడి మీరందరు మృత్యువువాతబడెదరు; మీ పిల్లలకు అజీర్ణవిరేచనములు వచ్చును; వారి కన్నులు చెడిపోవును; ఇప్పటికే అనేక కారణములవలన నివాసయోగ్యముకాని మీ గ్రామము ఇకమీద బొత్తిగ నివాసయోగ్యము కాకపోవును.

గ్రామస్థులు.—ఇదంతయు నిజమే. ఇప్పుడుకూడ మా గ్రామము శుభ్రముగనుండుట అరుదు. పాకీవారు మేము చెప్పినమాటను లక్ష్యపెట్టుటయే లేదు. వారిచేత పనిచేయించుట కష్టసాధ్యముగ నున్నది.

సాక్రటీసు.—అనగా పాకీవారు మీ ప్రభువులన్నమాట స్థిరపడుచున్నదా?

గ్రామస్థులు.—అలాగే కనిపించుచున్నది.

సాక్రటీసు.—కావున మీకు ముగ్గురు యజమానులు (ప్రభువులు) న్నారు.

గ్రామస్థులు.—అట్లనకుడు. కాని, మీ వాదముకాదనుట కష్టమే.

సాక్రటీసు.—ఈ ముగ్గురి యజమానులలో ముఖ్యమైన వాడు పాకీవాడనికూడ చెప్పవచ్చును. ఇతని యనుగ్రహము లేనియెడల పది రోజులలో మీ గ్రామము పందులు నివసించుటకుకూడ అనర్హమైనదగును.

గ్రామస్థులు.—ఇదికూడ సత్యమే.

సాక్రటీసు.—ఈ కాలములో పాకీవారు ప్రతిదేశమందున్నారా? ఇంగ్లండుదేశము చాల శుభ్రముగనున్నది; అచటి పాకీవారు కడు నేర్పరులుగను, నమ్రులుగను ఉండవలెను.

పింఛను పుచ్చుకొనిన సిపాయి.—లేదు. నేను ఇంగ్లండునకు వెళ్లియుంటిని. అచట పాకీవారే లేరు.

రెండవ సిపాయి.—పాలెస్టైనులోగాని, సలోనికాలోగాని పాకీవారు నాకగపడలేదు.

మూడవ సిపాయి.—మెసపటోమియాయందును ఆఫ్రికాలోనుకూడ పాకీవారు లేరు.

సాక్రటీసు.—ఇండియాదేశమొకటియే పాకీవారి కాశ్రయమైనట్లు కనుపించుచున్నది.

గ్రామస్థులు.—మాకుకూడ అలాగే తోచుచున్నది. ఆ వర్ణస్థులు మరేదేశమందును ఉన్నట్లు లేదు.

సాక్రటీసు.—అట్లైన ప్రపంచములోని దేశములన్నిటిలో ఇండియాదేశము శుభ్రతమమైనదని చెప్పవలసినదేకదా?

సిపాయీలు.—(కలిసి) కానే కాదు. ఇంగ్లండు దేశము, ఫ్రాన్సు దేశము ఇండియాకంటె శుభ్రముగనున్నవి. మేము వెళ్లిన దేశములలో దేనిలోను మా గ్రామములవంటి అపరిశుభ్రములగు గ్రామములు మేము చూచినది లేదు.

సాక్రటీసు.—శుభ్రపరచుటకై ప్రత్యేకకులమువారుండు ఈ దేశము, తక్కిన దేశములన్నిటికంటె నెక్కువ శుభ్రముగ నుండుటకు బదులు ఎక్కువ అశుభ్రముగ నున్నదని చెప్పవలసినదేకదా?

గ్రామస్థులు.—అవును; కాని కారణముమాత్రము మాకు తెలియుట లేదు.

సాక్రటీసు.—కారణమా! నేను చెప్పెదను. కార్యఫలమందాసక్తి ఎవని కెక్కువయో అతడే ఆ కార్యమును చక్కగా చేయగలవాడు. పరిశుభ్రత ఎక్కువ కాను కాను మీ పొలములకు కావలసిన ఎరువుకూడ వృద్ధియగుచుండును; మీ పిల్లలు మరింత ఆరోగ్యముతో నుండెదరు. పంటలు బాగుగ పండవలెననియు, పిల్లలు ఆరోగ్యవంతులుగ నుండవలెననియు ఆసక్తి మీకెక్కువా లేక పాకీవారి కెక్కువా?

గ్రామస్థులు.—మాకే ఎక్కువ. ఇట్టి ఆసక్తి మరెవరికుండును?

సాక్రటీసు.—కావున గ్రామము శుభ్రముగనుండవలయుననిన మీరే గ్రామమును చిమ్ముటకు పూనుకొనవలెను.

గ్రామస్థులు.—ఈలాగు సెలవిచ్చుట న్యాయమా? మేము రెడ్లము, నాయుళ్లము; మేమా మా చేతులతో అశుద్ధమును ముట్టుకొనుట! ఇది అసాధ్యము, అసంగతము. తాతా, మీరు మమ్మిట్లన్నందుకు సిగ్గుపడుట లేదా?

సాక్రటీసు.—క్షమింపవలెను. గొప్పజాతిలో పుట్టిన మీ వంటివారి కట్టుదిట్టములు నాకు తెలియవు. ఇట్టి పొరపాటు గావించినందుకు చాల చింతించుచున్నాను. కాని, నేను వచ్చుచుండగా గాలికొట్టినది కాబోలు—లేక పశువులు వీధులవెంట నడుచుచు మేతకు వెళ్లుచుండినవేమో—దుమ్ము రేగినది. అందుచేత ఊపిరితోకూడ గాలితోకూడ దుమ్మును లోపలికి పీల్చవలసివచ్చెను. దీనిమూలమున నాకు కొంచెము దిగ్భ్రమకలిగినది; నా తెలివికూడ కొంతవరకు తప్పినది.

గ్రామస్థులు.—నిజమే. ఈ దుమ్ము ఎల్లప్పుడు తొందరగలిగించుచుండును. గౌరవార్హులగు మీవంటి వృద్ధుల విషయమున ఆగ్రహపడినందులకు మమ్ము క్షమింపవలెను. కాని మీరు చెప్పిన మాటలుమాత్రము మాకు పరువునష్టము కలిగించునవి యని మీరు తెలిసికొనవలెను.

సాక్రటీసు.—నాకుకూడ విచారము కలుగుచున్నది. ఇట్టి సూచనలచేయుటలో నేనికమీాద కడుజాగ్రత్తగనుండెదను. కాని నే నొక చిన్న ప్రశ్నను వేయవచ్చునా? గాలికొట్టునప్పుడును, మనుష్యులుగాని, పశువులుగాని నడుచునప్పుడును పైకి రేగుచుండు దుమ్ము ఆ పెంటదిబ్బలమీాదనుండి కదా వచ్చుచుండుట?

గ్రామస్థులు.—అవును. మా గ్రామముచుట్టు ఇట్టి దిబ్బలెన్ని యోయున్నవి.

సాక్రటీసు.—మీ పూర్వులు పోసిన దిబ్బలమీాదనేగదా మీ గ్రామము కట్టబడియుండుట.

గ్రామస్థులు.—అవును.

సాక్రటీసు.—ఈ దిబ్బలమీాదనుండి పైకిరేగు దుమ్మును మీారు లోపలికి పీల్చుచున్నారు. అది మీ అన్నములో కలియు

చున్నది. కుండలలోను, నూతులలోను ఉండు నీళ్లలో అది పడుచున్నది. వర్షము పడినపుడది కొట్టుకొనివచ్చి స్నానమునకును పశువులు త్రాగుటకును ఉపయోగింపబడు చెరువునీటిలో కలిసిపోవుచున్నది.

గ్రామస్థులు.—అవును. ఇందులో తప్పేమున్నది? ఇది ఎప్పటినుండియో జరుగుచున్నది. సాక్రటీసుగారు! ఈ రోజు మీ రేకారణముచేతనో మా పూర్వాచారములను పద్ధతులను బహు తీవ్రముగ పట్టి చూచుచున్నారు.

సాక్రటీసు.—క్షమింపవలెను. ఆహారముతో కలిపి మీరు తినుచుండునట్టియు, నీళ్లలో కలిపి మీరు త్రాగుచుండునట్టియు, గాలిలోకలిపి మీరు పీల్చుచుండునట్టియు ఈ దుమ్ము చక్కగ పొడిచేయబడిన అశుద్ధము.

గ్రామస్థులు.—కావచ్చును.

సాక్రటీసు.—గొప్ప కుటుంబమునబుట్టినవాడు అశుద్ధమును తినవచ్చును, అశుద్ధమును నీటిలో కలిపి త్రాగవచ్చును, అశుద్ధమును గాలితోకూడ పీల్చవచ్చును. (ఆహారమునకు రుచికలిగించు పదార్థమిదియే, పానమునకు తీపినిచ్చునది ఇదియే). ఇందులో దోషమేమియు లేదు. కాని, తానును తన పిల్లలును ఉపయోగించు ఆహారము నీళ్లు, గాలి శుభ్రముగనుండుటకై అతడు గ్రామములోని వీధులనుచిమ్మి శుభ్రపరచవలెనని చెప్పుట మీ కందరికి ఆగ్రహము కలిగించుచున్నది; ఇట్లు చెప్పితినని మీరు నన్నాక్షేపించుచున్నారు. బహుశః ప్రపంచమునంతయును అపరిశుద్ధముచేయుటయు, శుభ్రపరచు విషయమున ఎట్టి శ్రద్ధను వహింపకుండుటయు అగ్రవర్ణములవారి

జన్మహక్కు కాబోలు! గ్రామస్థులారా, మీ కులకట్టుబాట్లు బహు క్లిష్టములుగనున్నవి.

గ్రామస్థులు.—సాక్రటీసుగారూ, క్షమింపవలెను. ఈ పర్యాయమేలాగో మేము మీ చేతిలో చిక్కుకొంటిమి. మీ యెడల తగినమర్యాద చూపనందులకు చింతించుచున్నాము. కాని మేమేమి చేయగలము. ఆచారము చాల బలిష్ఠమైనది. మా చిన్నతనమందు మేమపరిశుభ్రులముగనే యుంటిమి. మా తల్లిదండ్రులు మమ్ము అట్లు పెంచిరి. మా కలవాటైన పద్ధతులనుసరించి మేము మా పిల్లల పెంచుట సులభముగాని మా యిండ్లును పిల్లలును శుభ్రముగను, ఆరోగ్యముగను ఉండుటకై మా ప్రాత అలవాటుల మార్చుకొని మా గ్రామములను శుభ్రపరచుట సులభముకాదు.

సాక్రటీసు.—నేనీ విషయమున మీతో ఏకీభవించుచున్నాను. ఉద్ధరణమార్గము నిర్ణయముగను, ఇరుకుగను ఉండును. అందు నడుచుట కొంత కష్టసాధ్యమే. కాని మీవలె మీ పిల్లలు మలినములగు ప్రాతమార్గముల బడకుండుటకును, జీవితసౌఖ్యమును బడయుటకును మీరు వారికి క్రొత్తమార్గము లుపదేశించుట యుక్తము.

గ్రామస్థులు.—ఆలాగే ఉపదేశించెదము. కాని దీనిని చేయుట ఎట్లు?

సాక్రటీసు.—స్కౌటు పద్ధతియొకటి ఉన్నది. ప్రతి పిల్లవాడు శుభ్రముగనుండి శుభ్రమైన ఇంటిలో కాపురము చేయుచు, పాకీవారిమీదను, తదితరులమీదను ఆధారపడక సర్వమును తానే సొంతముగ శుభ్రపరచుకొనుచుండవలెనని

ఈ పద్ధతి ముఖ్యముగ ఉపదేశించుచున్నది. దీని ముఖ్యలక్షణములు స్వాయంసహాయము, సంఘసేవ. కావున మీరు మీ పిల్లలనందరిని స్కౌటుసంఘమున చేరునట్లును చిన్నతనముననే ఆత్మగౌరవమును పరిశుభ్రతయు నేర్చుకొనునట్లును ప్రోత్సాహపరచవలెను.

## తర్ఫీదు (శిక్ష)

సాక్రటీసు.—రెడ్డిగారూ, క్షేమమా.

రెడ్డి.—క్షేమమే. మీరు క్షేమముగ నున్నారా?

సాక్రటీసు.—ఏమో ఉన్నాము. నేను ముసలివాడను, ఒంటరికాడను అన్నమాట మీకు తెలియునుగదా? ఇందుకేమిగాని, ఈ ఉదయము మీ కుమారుడెక్కడ? కనివించలేదే?

రెడ్డి.—అతడు పొలమునకు వెళ్లి అచ్చట గుఱ్ఱమును తర్ఫీదు చేయుచున్నాడు.

సాక్రటీసు.—తర్ఫీదెందుకు?

రెడ్డి.—స్వారిచేయుటకే.

సాక్రటీసు.—దీనికి ప్రత్యేకముగ తర్ఫీదుకావలసియున్నదనుమాట నాకు తెలియదే.

రెడ్డి.—కావలసియున్నది. ఎద్దులకు దున్నుటయును, బండ్లలాగుటయును నేర్పవలసియున్నది. అట్లే స్వారి కుపయోగపడుటకును, పోలో ఆడుటకును, అవి చేయవలసిన తక్కిన పనుల చేయుటకును గుఱ్ఱములు తర్ఫీదుపొందవలెను.

సాక్రటీసు.—ఇదంతయు రైతునకు చాల కష్టముగదా? తన వద్దనున్న జంతువులనన్నిటిని వానివాని పనులు చక్కగచేయునట్లు తర్ఫీదుచేయుట సులభముకాదుగదా?

వీరిట్లు మాటలాడుచుండగా రెడ్డిగారిభార్య రెడ్డిగారిని పెండ్లిపనులన్నియు పూర్తియయ్యెనా అని అడిగెను. దానిని విని,

సాక్రటీసు. — ఓహెూ! నేను మిమ్ముల నభినందింప వచ్చునా? ఎప్పుడు పెండ్లి? ఎవరికి?

రెడ్డి.—మా కుమార్తకే, పెండ్లి రేపు ప్రారంభమగును.

సాక్రటీసు.—గృహస్థధర్మములు నిర్వహించుటకు మీరు మీ కుమార్తెను చక్కగ తర్ఫీదుచేసితిరని నమ్ముచున్నాను.

రెడ్డి.—మీా అభిప్రాయము మాకు బోధపడుటలేదు.

సాక్రటీసు. — వానివాని పనులు చక్కగ చేయుటకై జంతువులను తర్ఫీతుచేయవలెనని మీారిప్పుడే చెప్పితిరిగదా?

రెడ్డి.—అవును; చెప్పితిని. కాని దానికి దీనికి సంబంధమేమి?

సాక్రటీసు.—వారి పనులను చక్కగ చేసికొనునట్లు ఆడుపిల్లలను తర్ఫీదుచేయుట ఆవశ్యముకదా?

రెడ్డి.—ఇదియా. సరే. మాపిల్ల పిండి విసరగలదు. వడ్లు దంచగలదు. పిడకలు పెట్టగలదు. ఒకపాటి వంటచేయుటకూడ ఆమెకు తెలియును. ఇంతకంటె నేర్చుకొనవలసినదేమి యున్నది? ఎటుచూచినను, ఆమె ఆడుదేకదా?

సాక్రటీసు.—బాగుగానున్నది. ఇంతటి నేర్పుగలభార్యను పెండ్లాడిన భర్త చాల అదృష్టవంతుడని చెప్పవలెను.

రెడ్డి.—అదృష్టవంతుడే. ఇదిగాక ఆమె నగలకై నేను వేలువేలుగ ఖర్చుపెట్టియున్నానుగదా? అతడుకూడ మంచి పిల్లవాడే. అతని పేరును వంశమును శాశ్వతముగనుండుటకై భగవంతుడతనికి మంచి సంతానమును కలిగించుగాక. ఇదివరకాయింటిలో అతని తండ్రియొక్క మనుమలందరు శైశవముననే గతించిరి—అతని అదృష్టమిట్లున్నది.

సాక్రటీసు.—తన పిల్లలు బలవంతులుగను, ఆరోగ్యవంతులుగను పెరుగవలెనని ప్రతి గ్రామస్థుడు మనఃస్ఫూర్తిగ కోరుచుండునుగదా?

రెడ్డి.—ఇది యొక్కటె మా కోరిక.

సాక్రటీసు.—పిల్లలను పెంచు పని ఎవరిది?

రెడ్డి.—తల్లిది.

సాక్రటీసు.—తల్లి చేయవలసిన పనులన్నిటిలో ముఖ్యమైన దిదియేనా?

రెడ్డి.—చాలవరకు.

సాక్రటీసు. — రోగములు, గండములు, అపరిశుభ్రత, లోనగువానితో కూడుకొనియుండు ప్రస్తుతపు పల్లెటూళ్ల పరిస్థితులలో ఈ పని చాల కష్టమైనదేనా?

రెడ్డి.—అవును. నా స్నేహితుని మనుమలందరు శైశవమునందే గతించిరని ఇప్పుడేగదా చెప్పితిని. ఇప్పటివర కతనికి మనుమలు లేరు.

సాక్రటీసు.—ఈ విషయమున తల్లికిగల బాధ్యత చాల గొప్పదికదా?

రెడ్డి.—అవును. ఈ బాధ్యతను నా కుమార్తె చక్కగ నిర్వహించగలదని నేను నమ్ముచున్నాను.

సాక్రటీసు.—నీవు గావించిన తర్ఫీదు ఇందుకేమాత్రము పనికిరాదు.

రెడ్డి.—ఏమిటీ! తిరిగి అట్లు చెప్పుచున్నారు?

సాక్రటీసు.—వానివాని పనులను చక్కగ చేయుటకై జంతువులను తర్ఫీదుచేయుచున్నామని మీరు చెప్పితిరిగదా? మీ కుమార్తె మీ పశువులకంటె ఎక్కువ ముఖ్యమైనదేనా?

పిల్లలను పెంచుటయను కష్టమైన పనిని చక్కగ చేయుటకు మీ రామెను తర్ఫీదుచేసితిరని అనుకొనుచున్నాను.

రెడ్డి.—మీరు చెప్పునది అర్థమగుటలేదు. పిండివిసరగల దనియు, వస్త్రు దంచగలదనియు, పిడకల పెట్టగలదనియు, సామాన్య పదార్థములను వంటచేయగలదనియు చెప్పితినిగదా? ఇంతకంటె కావలసినది ఏమున్నది.

సాక్రటీసు. — పిల్లలకు నీళ్లుపోయుట, అన్నముపెట్టుట, పిల్లల బట్టలను కుట్టుట, బాగుచేయుట, కండ్లకలక, గాయములు, కడుపునొప్పి మొదలగు చిన్నజబ్బుల కుదుర్చుట, వీని నన్నిటిని మీరు మీ కుమార్తెకు నేర్పియున్నారని తలచుచున్నాను. ఇంటిని శుభ్రముగ ఉంచుకొనుటకును, మసూచి, జ్వరము, ప్లేగు మొదలగు రోగములు రానీయకుండ చేసికొనుటకును ఆమెకు తెలియునుగదా?

రెడ్డి.—ఏమి ఇట్టి తెలివితక్కువమాటలు మాటలాడుచున్నారు. ఇవన్నియు పెద్దవాడనగు నాకే తెలియవే? చిన్నబిడ్డయు, అందులో ఆడుదియు అగు నా కుమార్తె కివి ఎట్లు తెలియగలవు? ఇవన్నియు కర్మాధీనములు. భగవంతుడు కరుణించెనా, ఆమెయొక్క పిల్లలు చక్కగను, ఆరోగ్యముగను పెరిగెదరు; భగవంతుని కరుణలేనియెడల — సరే, చెప్పవలసిన దేమున్నది.

సాక్రటీసు.—టీకాలువేయుట, క్వైనా, మరుగుదొడ్లు, దోమతెరలు—వీనిమాట ఏమిటి? వీనినిగురించి నీకు తెలియును గదా? వీనిమూలమున సైన్యములోనివా రారోగ్యవంతులై యున్నారుగదా?

రెడ్డి.— ఇవన్నియు మంచివే. కాని, ఆడుదానికి ఇవి ఎందుకు తెలియవలెను.

సాక్రటీసు.—పిల్లలు ఆరోగ్యవంతులుగా నుండవలెననిన ఇన్నియు ఎక్కువగ తెలిసికొనవలసినవే. మీ కుమార్తె బట్టలు కుట్టగలదా?

రెడ్డి.—కుట్టలేదు. వడ్లుదంచుట, పిడకలుపెట్టుట మొదలగు పనులతో ఆమెకు సరిపోవుచుండ దీనిని నేర్చుకొనుట కామెకు వ్యవధియే లేదు. ఇదిగాక, దీని నామెకు నేర్పువారెవరు? ఆమెతల్లి కుట్టుపనిని నేర్చుకొనియుండలేదు.

సాక్రటీసు. — పిండివిసరుటకు వడ్లుదంచుటకు మిషనులున్నవి; పిడకలపెట్టుటను మానివేసి కట్టెలనో బొగ్గునో వంటకై ఉపయోగించి పేడను పొలములలోవేసి మీ పంటలను ఆదాయమును రెండింతలు చేసికొనవచ్చును.

రెడ్డి.—దీనినంతయును నేను చేయగలను. కాని ఆడుబిడ్డలవిషయమున, ఈ ప్రసంగమెందుకు?

సాక్రటీసు.—పనులన్నిటిలో పిల్లలను పెంచుట మిక్కిలి ముఖ్యమైనదని మీరిప్పుడేగదా చెప్పితిరి.

రెడ్డి.—అవును.

సాక్రటీసు. — మీ వంశము శాశ్వతముగనుండుటకై పిల్లలు ఆరోగ్యముగనుండుట అత్యావశ్యముకదా?

రెడ్డి.—అవును.

సాక్రటీసు. — పిల్లలు సాధారణముగ శైశవమందే మృతిచెందుచుందురనికూడ మీరు చెప్పితిరిగదా?

రెడ్డి.—నిజమే.

సాక్రటీసు.—సైన్యములోనివారి ననేకవిధముల ఆరోగ్యవంతులుగ చేయవచ్చునని మీరు ఒప్పుకొనియుంటిరి గదా?

రెడ్డి.—అవును.

సాక్రటీసు. — దీనినిబట్టి ఇదంతయు ఒక భగవదిచ్ఛ మాత్రమే కాదని చెప్పవచ్చునుగదా?

రెడ్డి.—చెప్పవచ్చును.

సాక్రటీసు.—అట్లైన కొద్దికాలములో పిల్లలను కనబోవునట్టి మీ కుమార్తె ఈ ముఖ్యమైన పనిచేయుటకు సమర్థురాలగునట్లు తర్ఫీదుచేయరాదా?

రెడ్డి.—ఏలాగు?

సాక్రటీసు.—బడికి పంపి.

రెడ్డి.—ఎక్కడికి? ఇచ్చట బడి లేదే.

సాక్రటీసు.—మగపిల్లల బడి యున్నదికదా?

రెడ్డి.—ఉన్నది.

సాక్రటీసు.—పిల్లలను పెంచు బాధ్యత తల్లిదా, తండ్రిదా?

రెడ్డి.—తల్లిదే.

సాక్రటీసు.—అట్లైన మీ మగపిల్లలను బడికి పంపుటకు బదులు ఆడుపిల్లల నేల పంపరు? ఆడుపిల్లల బడి ఎక్కువ ఆవశ్యకమైయుండగా మగపిల్లల బడిని మీరెందుకు పెట్టుకొనియున్నారు? సరేగాని, మీ కుమార్తెయు కుమారుడును ఒకేబడికి ఏల వెళ్లకూడదు?

రెడ్డి.—ఇట్టి పనికిమాలిన ప్రశ్నలచే నేమిప్రయోజనము? ఇది సాధ్యముకాని పనియని మీకు తెలియదా?

సాక్రటీసు.—ఏల?

రెడ్డి. — మగపిల్లలు మగపిల్లలే, ఆడుపిల్లలు ఆడుపిల్లలే, వారిద్దరు కలసి ఒకేబడికి వెళ్లుట ఎట్లు కుదురును?

సాక్రటీసు.—వీధులలో వారందరు కలసి ఆటలాడుచుందురు కదా?

రెడ్డి.—అవును.

సాక్రటీసు. — అప్పుడు వారిని కనిపెట్టువారెవరైన ఉండెదరా?

రెడ్డి.—ఉండరు.

సాక్రటీసు. — అందుచే ఏమైన ప్రమాదము కలుగుచున్నదా?

రెడ్డి.—లేదు. యోగ్యులమగు మాపై ఇట్టి అపోహాల పడకుడు.

సాక్రటీసు.—బడిలో వారిని కనిపెట్టువారుందురు కదా?

రెడ్డి.—ఉందురని చెప్పవచ్చును.

సాక్రటీసు.—అట్లైన బడిలో ప్రమాదము కలుగుట కవకాశమేమున్నది?

రెడ్డి.—మీరిప్పుడు చెప్పినదానిని విన్నతర్వాత ప్రమాదముండదనియే తోచుచున్నది.

సాక్రటీసు. — అట్లైన మీ ఆడుపిల్లలను బడికి పంపుడు. వారప్పుడు విద్యావంతులై గృహకృత్యముల నెరవేర్చుటకును, పిల్లల పెంచుటకును కావలసిన సామాన్యజ్ఞానమును సంపాదింపగలిగియుందురు. అట్లు చేసినయెడల మీరు కేవల పూర్వా

కర్తవ్యబద్ధులమను నమ్మకమును మరచి మీ నిర్లక్ష్యభావమువలనను, అజ్ఞానమువలనను పిల్లలకు కలుగు మృత్యువునుండి వారిని కాపాడినవారగుదురు.

రెడ్డి.—సాక్రటీసుగారు, నా విషయమునను నా పిల్లలవిషయమునను ఇది చేయుటకు కాలము దాటిపోయినది; కాని, నా మనుమలు వారి ఆడుపిల్లలకు చదువుచెప్పునట్లు చేసెదను.

## గ్రామోద్ధరణమునకు వలయు వ్యయము

సాక్రటీసు గ్రామచావడివద్దకు వచ్చునప్పటికి ఏమో సందడిగనుండెను. అందరును కలసి ఒకేమారు మాటలాడుచుండిరి.

సాక్రటీసు.—సోదరులారా, ఏమిసమాచారము? పైర్లను సులభముగ కోయుటకుగాని, నూతినుండి సులభముగ నీళ్లను ఎత్తుటకుగాని, ఎవరైన క్రొత్తయంత్రము నేమైన కనిపెట్టినారా?

గ్రామస్థులు.—అటువంటిదేమియు కాదు. ఇట్టి యంత్రముల కావశ్యకతయేమున్నది? ఇదివరకు మాకుండు యంత్రములు చాలవనియా మీ యభిప్రాయము? మీ రెల్లప్పుడు క్రొత్తవానినిగురించియే కలవరపడుచుండెదరు.

సాక్రటీసు.—సరేగాని మీ సందడికి కారణమేమి?

గ్రామస్థులు.—ప్రతి సంవత్సరము మహాసూలుకాగానే మేము కొంత చందానియ్యవలెనని చెప్పుచున్నారు.

సాక్రటీసు.—ఎంత ఘోరము!

గ్రామస్థులు.—ఘోరముకాకేమి? ఇదివరకు విననట్టిది! ఎంతటి అపవాదము! పన్నుల బాధచేత ఇదివరకే నలిగిపోయిన మావంటి రైతులవిషయముననా ఇట్టి ఘోరము.

సాక్రటీసు.—మీకు కలిగిన ఈ ఘోరమగు ఆపత్తునకై నేనుకూడ విచారించుచున్నాను. చందాను మీరియ్యరు కదా?

గ్రామస్థులు.—ఇయ్యనే ఇయ్యము.

సాక్రటీసు.—చాల మంచిపని.

గ్రామస్థులు.—చూడుడు. మొన్నటివారమునాడే ఎవరో ఒక ఇంగ్లీషు చదువుకొనినవారు దొరవేషముతో వచ్చి, "ఈ పర్యాయము మీరు నన్ను మెంబరుగ ఎన్నుకొనినయెడల శాసన సభలో మీ భూమిశిస్తు, తక్కిన పన్నులు తగ్గునట్లు చేసెదను" అని చెప్పెను.

సాక్రటీసు. — గొప్పవాడుసుమీ! ఎన్నికలలో అతనికి జయముకలుగునని నమ్ముచున్నాను.

గ్రామస్థులు. — మేముకూడ అట్లే కోరుచున్నాము. మేమందరము మా వోట్లను అతనికే ఇయ్యదలచియున్నాము.

సాక్రటీసు—ఇప్పుడు మీరు చెప్పిన చందా ఎందునిమిత్తము? సిమ్లాపట్టణములో గంటస్తంభము కట్టుటకు కాబోలు.

గ్రామస్థులు. — కాదు. గ్రామోద్ధరణమునకని వారు చెప్పిరి.

సాక్రటీసు.—అట్లైన అది అంత చెడ్డదిగ కనిపింపలేదు. అది ఘోరమనియు, అపకారమనియు చెప్పుట నాకిష్టములేదు.

గ్రామస్థులు.—ఎందువలన? ఉద్ధరించవలసిన బాధ్యత సర్కారువారిది కాదా?

సాక్రటీసు.—అవును. కాని, వారికి సహాయముచేయువలసిన పూచీ మీయందు లేదా?

గ్రామస్థులు.—ఎందుకుండవలెను?

సాక్రటీసు.—మీరు సొంతముగ చేసికొనిన తప్ప, ఈ పనులకన్నిటికి డబ్బు కావలెనుగదా?

గ్రామస్థులు.—కావలసినదే.

సాక్రటీసు.—ఈ పనికై ప్రత్యేకముగ కొందరు ఉద్యోగస్థులను సర్కారువారు మీ గ్రామమునకు పంపుట మీ కిష్టమైనయెడల ఇందుకై కొంత ద్రవ్యము ఖర్చు కావలెనుగదా?

గ్రామస్థులు.—అవును.

సాక్రటీసు.—అట్టి ఉద్యోగస్థులు ఇందునిమిత్తమై ప్రత్యేకముగు శిక్షణము పొందవలెను; వారు ఊరూరికి వెళ్లవలెను; వారికి జీతములు, ప్రయాణవ్యయములు, బత్తాలు ఇయ్యవలసియుండును.

గ్రామస్థులు.—నిజమే.

సాక్రటీసు.—మీకుగల తీరికను ఇందునిమిత్తమై మీరుపయోగించునపుడు కావలసిన ద్రవ్యముకంటె, జీతములిచ్చి ప్రచారకుల నేర్పాటుచేసి మీరు చేయవలసిన పనులను చేయించి చూపుటకు ఎక్కువ ద్రవ్యము కావలసినదేనా?

గ్రామస్థులు.—ఆహా. కావలసినదే.

సాక్రటీసు.—ఈ ఖర్చునంతయును పెట్టుకొనువారెవరు?

గ్రామస్థులు.—సర్కారువారు. సందేహమేమున్నది?

సాక్రటీసు.—పోయిన అయిదారు సంవత్సరములలో మైళ్లకొలది కంకరరోడ్లు మీ గ్రామములకు వేయబడినవా?

గ్రామస్థులు.—వేయబడినవి.

సాక్రటీసు.—అనుపత్రులు అనేకములు కట్టబడినవా?

గ్రామస్థులు.—కట్టబడినవి.

సాక్రటీసు.—పాఠశాలలయొక్కయు, చదువుకొను పిల్లల యొక్కయు సంఖ్య రెట్టించెనా?

గ్రామస్థులు.—నిజమే.

సాక్రటీసు.—మీ పన్నులేమైన హెచ్చినవా?

గ్రామస్థులు.—లేదు.

సాక్రటీసు.—ప్రతి వస్తువు పూర్వముకంటె ఇప్పుడు ఎక్కువ ఖరీదుగలదిగనున్నదా?

గ్రామస్థులు.—ఉన్నది.

సాక్రటీసు.—అట్లైన ఈ పనులన్నిటికి కావలసిన ద్రవ్యమంతయు ఎచటనుండి వచ్చుచున్నదని మీ అభిప్రాయము?

గ్రామస్థులు.—సర్కారువారివద్దనుండి.

సాక్రటీసు.—సర్కారువారనిన మీరేగదా? పన్నుల చెల్లించువారు మీరుగదా? మీవద్దనుండికాక మరేదైన గనినుండి గాని, నిధినుండిగాని సర్కారువారు ద్రవ్యమును సంపాదించుచున్నారా?

గ్రామస్థులు.—పన్నులన్నిటిని చెల్లించువారము మేమే.

సాక్రటీసు.—అట్లైన మీరెక్కువగ పన్నులను చెల్లించని పక్షమున, సర్కారువారీ ఎక్కువపనిని ఎట్లు చేయగలరు?

గ్రామస్థులు.—మేము కడుదరిద్రులము.

సాక్రటీసు. — సర్కారువారు చేయుచుండు ఈ పనుల మూలమున మీ ఆదాయము వృద్ధియగుచున్నది కదా?

గ్రామస్థులు.—ఎట్లు?

సాక్రటీసు.— క్రొత్త విత్తనములమాట మీకు తెలిసియే యున్నది. వానిమూలమున పండు పంటయు గడ్డియు హెచ్చెను గదా?

గ్రామస్థులు.— హెచ్చినది.

సాక్రటీసు.—చింతలదేవిలో పెంపబడు ఆబోతులమాట ఏమిటి? అట్టి ఆబోతులు ఈ జిల్లాలలో ఏడువందలున్నవి.

గ్రామస్థులు.—నిజమే.

సాక్రటీసు. — ఒక్కొక ఆబోతునకు సంవత్సరమునకు ఏబదిదూడలు పుట్టుచున్నవా?

గ్రామస్థులు. — అంతకంటె ఎక్కువే. డెబ్బదియైదో నూరో అని చెప్పవచ్చును.

సాక్రటీసు.—సరాసరి ఏబది అని అనుకొందము. ఏడు వందల ఆబోతులకు ఎన్నిదూడలు పుట్టును?

ఒక బడిపిల్లవాడు.—ముప్పై అయిదువేలు.

సాక్రటీసు. — ఈపాటి లెక్కను నీ తండ్రి వేయలేడు సుమా! మునుపటి ఆబోతునకు పుట్టు దూడకంటె ఈ దూడ యొక్క ఖరీదు ఎంత ఎక్కువ?

గ్రామస్థులు.—ఇరువదియైదు మొదలు నూరు రూపాయల వరకు.

సాక్రటీసు. — మూడు నాలుగు సంవత్సరములలో ఈ పెయ్యదూడలకు క్రొత్తదూడలుపుట్టి మరింత ఆదాయమును తెచ్చునా?

గ్రామస్థులు.—అవును.

సాక్రటీసు.—ఒక్కొక దూడవలన ముప్పది రూపాయల ఆదాయము వచ్చునా?

గ్రామస్థులు.—ఆమాత్రము వచ్చును.

సాక్రటీసు.—ముప్పది ముప్పది అయిదు వేలు ఎంత?

బడిపిల్లవాడు.—లక్షా అయిదు వేలు.

సాక్రటీసు.—ఆలోచించి చెప్పు.

కరణం.—పదిలక్షల యాబది వేలు.

సాక్రటీసు.—బాగున్నది. సంవత్సరమునకు పదిలక్షల యాబదివేల ఆదాయము......గోతులలోని ఎరువుమాట ఏమిటి? గోతుల త్రవ్వినతర్వాత ఎరువుకూడ ఎక్కువైనదిగదా?

గ్రామస్థులు.—ఎంతో ఎక్కువైనది.

సాక్రటీసు.—పూర్వపు ఎరువుకంటె ఇది ఎక్కువ సారము కలదేనా?

గ్రామస్థులు.—అవును.

సాక్రటీసు.—ఇప్పుడు సుమారు యాబదివేల గోతులున్నవి కదా?

గ్రామస్థులు.—ఆలాగే.

సాక్రటీసు.—కొన్ని గోతులు సంవత్సరమున కొకపర్యాయమును, కొన్ని రెండుపర్యాయములను పూరింపబడుచున్నవా?

గ్రామస్థులు.—అవును.

సాక్రటీసు. — దీనిమూలమున ఒక్కొక ఎకరానుండి పూర్వముకంటె అధమపక్షము ముప్పది రూపాయల పంట యెక్కువ వచ్చుచున్నదా?

గ్రామస్థులు.—నూరు రూపాయలని కూడ చెప్పదగి యున్నది.

సాక్రటీసు.—ముప్పది అని అనుకొందము. దీనివలన మొత్తముమీద ఎంత ఆదాయము వృద్ధియగును?

బడిపిల్లవాడు.—పదున్నేను లక్షలు.

సాక్రటీసు.—ఈ పర్యాయము సరిగా చెప్పితివి. ఈ గోతుల త్రవ్వుటవలన పరిశుద్ధత హెచ్చి రోగములు, జ్వరములు తగ్గిపోయెనుగదా? దీనిమాట ఏమిటి?

గ్రామస్థులు.—దీనిమూలమున కూడ చాల లాభము కలిగినది.

సాక్రటీసు.—పర్షియను రాట్నముల మరిచిపోతిరా?

గ్రామస్థులు.—ఎట్లు మరవగలము. అవి బంగారు గని యనియే చెప్పవచ్చును.

సాక్రటీసు.—నగలు, మగవారి అంటుజోళ్లు, పిల్లల ఆభరణములు—ఇవన్నియు తగ్గిపోవుట; పెండ్లిండ్లు మొదలగువానికై చేయబడు ఖర్చు తగ్గుట—దీనివలన కలిగిన లాభమెట్టిది?

గ్రామస్థులు.—అదికూడ చాల ఎక్కువే.

సాక్రటీసు.—పరపతిసంఘములలో మీరు దాచుకొనిన ఇరువది అయిదులక్షల మూలధనముపై వడ్డీవలని లాభమో?

గ్రామస్థులు.—అదికూడ స్వల్పమైనదికాదు. కాని వడ్డీ లెక్కలువేయుట మాకు తెలియదు.

సాక్రటీసు.—కావున మొత్తముమీద మీ ఆదాయము సంవత్సరమునకు ఏబది లక్షలవంతున వృద్ధియైనదని చెప్పవచ్చునా?

గ్రామస్థులు.—ఇది చాల తక్కువ మతింపు.

సాక్రటీసు.—పోనిండు. దీనినే అంగీకరింతము. సర్కారుకు మీరు చెల్లించు భూమిశిస్తు ఎంత?

కరణం —జిల్లాకంతకు పదియారు లక్షలు.

సాక్రటీసు. — అనగా మీ సముద్ధరణమునకై అయిన ఖర్చువలన, మీరు చెల్లించు పన్నులకంటె మూడింత లెక్కువ ఆదాయము కలిగినదా?

గ్రామస్థులు.—అవును.

సాక్రటీసు.—అయినను మీరు చందాల నిచ్చుటకు వెనుదీయుచు, మీ పన్నుల తగ్గింపవలయునని కోరుచున్నారు గదా?

గ్రామస్థులు. — ఇదివర కట్లే చేయుచుంటిమి కాని మీ మాటలు విన్నతర్వాత కొంత అనుమానము కలుగుచున్నది.

సాక్రటీసు.—ఉద్ధరణమునకై ఖర్చగు ఒక్కొక రూపాయనుండియు పది రూపాయలో, ఇరువది రూపాయలో లాభము మీకు దొరకుచున్నదా?

గ్రామస్థులు.—మీరు వేసిన లెక్కల ననుసరించినయెడల లాభ మింతకంటె ఎక్కువయని చెప్పవలసియుండును.

సాక్రటీసు —తక్కువపన్నులు చెల్లించుటకంటె ఎక్కువ పన్నుల చెల్లించుట ఉత్తమమని ఇప్పుడైన మీకు బోధపడుచున్నదా?

గ్రామస్థులు. — ఇప్పుడట్లే తోచుచున్నది. ఇదివరకు మాత్ర మేమట్లనుకొనలేము.

సాక్రటీసు.—పన్నుల తగ్గింతునని చెప్పి మీ వోట్లను కోరు అభ్యర్థి మీకు మంచిచేయుటకు బదులు కీడుచేయువాడేగదా?

గ్రామస్థులు.—అవును.

సాక్రటీసు.—ఉద్ధరణమునకును, అభివృద్ధికొరకును ఖర్చుచేయబడు ద్రవ్యమంతయు, లాభము తెచ్చు పెట్టుబడియనియు, దానిమూలమున పంటలు ఆరోగ్యము, సౌఖ్యము, ఐశ్వర్యము—అన్నియు వృద్ధికాగలవనియు స్పష్టమయినదా?

గ్రామస్థులు.—అయినది.

సాక్రటీసు.—అట్లైన చందాలు చెల్లించుటకు మీరు సిద్ధపడవలెను. ఇంతేగాక, పన్నులను తగ్గింతునని చెప్పు అభ్యర్థిని ఎన్నుకొనుటకు బదులు దేశముయొక్క ఉద్ధరణమునకును అభివృద్ధికిని తోడ్పడునట్టియు, అవసరమైనయెడల ఎక్కువ పన్నులను వసూలుచేయుటకు భయపడనట్టియు అభ్యర్థిని మీరెన్నుకొనవలెను.

గ్రామస్థులు.—తప్పక అట్లే చేసెదము.

సాక్రటీసు.—ఓ గ్రామస్థులారా! మీరు రేశీట నగలకొరకును, కోర్టులెక్కుటకును, లంచములిచ్చుటకును, హెచ్చు వడ్డీలకొరకును ఇటువంటి నిరుపయోగములును, నాశకరములు నగు ఇతరకార్యములకొరకును వ్యర్థముగ ఖర్చుపెట్టు సొమ్ముతో ఇప్పటిపన్నులను చందాలను మాత్రమేకాక ఇంతకు పదింతలు అధికమగు పన్నులను, చందాలను చెల్లించగలిగియున్నారు.

గ్రామస్థులు. — నిజము. మీరు సెలవిచ్చునదంతయు సత్యము.

సాక్రటీసు.—ఇంతేకాదు. ఇంతకంటె గర్హింపదగిన పనులను మీరు చేయుచున్నారు. లంచములిచ్చుకొరకో, దావా చేయుటకొరకో, సగలను కొనుటకో ఎట్టి ఆక్షేపణలేక వేలకొలది రూపాయలను ఖర్చుపెట్టుటకు మీరు సిద్ధముగనుందురుగాని భాలభటోద్యమమునకుగాని, శిశుప్రదర్శనమునకుగాని అయిదు రూపాయల చందా అడిగినయెడల మీరెక్కడలేని గగ్గోలు చేసి మీ ద్రవ్యమునంతయును దోచుకొనిపోవుచున్నారని ఏడ్చెదరు.

గ్రామస్థులు.—మీ మాటలకు మేము తల వంచుకొనవలసియున్నది.

## తెలివితోకూడిన సేద్యము

ఒకనాడు సాక్రటీసు పెద్దరెడ్డితో కలసి రస్తామీదుగ గ్రామమునకు వచ్చుచు ఉన్నట్లుండి నిల్వబడిపోయి వ్రేలుచున్న తలగుడ్డతో ముక్కుమూసికొని "ఏమిటిది ఈ కంపు" అని పల్కెను.

పెద్దరెడ్డి.—ఇతడెవడో ఒక తెలివితక్కువ పిల్లవాడు. మృగములతో సమానులగు వీరెల్లప్పుడు గ్రామము నిట్లే పాడుచేయుచుందురు.

సాక్రటీసు.—(నవ్వుచు) నేను చూచినదానినిబట్టియు, పీల్చిన దుర్గంధమునుబట్టియు మీ గ్రామస్థులందరు ఇట్టి బాలురనియే చెప్పవలసియున్నది. ఈ పిల్లలను పెంచువారెవరు?

పెద్దరెడ్డి.—వారి తల్లులు.

సాక్రటీసు.—తల్లులు నేర్పుదానినేకదా పిల్లవాండ్రు చేయుచుందురు?

పెద్దరెడ్డి.—అవును.

సాక్రటీసు.—తల్లులు తండ్రులు గ్రామమును పాడుచేయుట మానివేయువరకు పిల్లవాండ్ర ప్రవర్తన చక్కబడునని చెప్పుటకు వీలులేదుకదా?

పెద్దరెడ్డి.—అలాగే అని తోచుచున్నది. పిల్లలకు ఇట్టి చెడ్డ అలవాటులు పట్టుబడునట్లు చేయువారు తల్లిదండ్రులే.

వీరిట్లు మాటలాడుచుండగా తలపై విత్తనముల బస్తాను పెట్టుకొని ఒక మనుష్యుడు అక్కడికివచ్చెను.

సాక్రటీసు.—(ఆ మనుష్యునితో) నమస్కారము. ఏమిటి మోసికొనిపోవుచున్నావు?

గ్రామస్థుడు.—(వరి—ధాన్యపు) విత్తనములు.

సాక్రటీసు.—వానిని ఎక్కడ కొంటివి?

గ్రామస్థుడు.—అంగడిలో కొంటిని.

సాక్రటీసు.—అవి ఎట్టి విత్తనములు?

గ్రామస్థుడు.—సాధారణముగా అందరు కొనుచుండు విత్తనములే.

సాక్రటీసు.—భోజనమునకై అంగడివాడు సామాన్యముగ అమ్ముచుండు ధాన్యమువంటిదేనా?

గ్రామస్థుడు.—అట్టిదే.

సాక్రటీసు. — నాటుటకు ఉత్తమములగు విత్తనములను ఏర్పరచుటయందును, రకమువారిగ వానిని విభజించుటయందును అంగడివాడు గొప్ప నేర్పరికాబోలు!

గ్రామస్థుడు.—కానేకాడు. గ్రామములోనివారు అంగడికి తెచ్చు ధాన్యమునంతను అతడు తీసికొని, దానినే విత్తనములనియు భోజనమున కుపయోగించునదనియు అమ్ముచుండును.

సాక్రటీసు —సరేగాని, నీకు కావలసిన ఇనుపసామగ్రులను నీవెవరిదగ్గర కొనెదవు?

గ్రామస్థుడు.—కమ్మరిదగ్గరనుండి.

సాక్రటీసు.—నీ నగలనో?

గ్రామస్థుడు.—కంసాలివద్దనుండి.

సాక్రటీసు.—మిఠాయినో?

గ్రామస్థుడు.—మిఠాయి అంగడివానివద్దనుండి.

సాక్రటీసు. —అట్టైన విత్తనములనుమాత్రము ప్రత్యేకముగ విత్తనముల అమ్ము వర్తకునివద్ద కొనక సాధారణపు అంగడివానివద్ద ఎందుకు కొనుచున్నావు?

గ్రామస్థుడు.—అట్టి వర్తకుడు లేనికారణముచేత.

సాక్రటీసు.—సర్కారువారు అమ్ముచుండు విత్తనముల మాట ఏమిటి? వానిని కొనగూడదా?

గ్రామస్థుడు.—కొనవచ్చునుగాని అంగడివాడు అమ్ము విత్తనములకంటె రూపాయకివి యొక సేరు తక్కువ.

సాక్రటీసు.—ఈ విత్తనములను వేసినయెడల ఎకరాకు ఎంతపంట ఎక్కువగ పండును?

గ్రామస్థుడు.—ఎప్పటికంటె అయిదారు తూములు ఎక్కువ పండునని వినియున్నాను.

సాక్రటీసు.—ఎకరాకు ఎన్ని విత్తనములు కావలెను?

గ్రామస్థుడు.—రెండు ముంతలు.

సాక్రటీసు.—సర్కారువారు అమ్ము విత్తనముల కొనుటకు ఎంతద్రవ్యము కావలెను?

గ్రామస్థుడు.—ఒక రూపాయ.

సాక్రటీసు.—దానిమూలమున ఇరువది ఇరువది అయిదు రూపాయలవరకు ఆదాయము అధికమగునా?

గ్రామస్థుడు.—అగును.

సాక్రటీసు.—అట్లైన మామూలు అంగడివానివద్ద కొనుట కంటె సర్కారువారివద్ద విత్తనముల కొనుట మంచిదికదా?

గ్రామస్థుడు.—ఆలాగే, కాని, సర్కారువారు డబ్బిచ్చిన గాని విత్తనముల అమ్మరే?

సాక్రటీసు.—సర్కారువారు తక్కువ అప్పులు ఇచ్చెదరని నీకు తెలియదా?

గ్రామస్థుడు.—తెలియును.

సాక్రటీసు.—సావుకారి యిచ్చు అప్పుమీద వడ్డి ఎంత?

గ్రామస్థుడు. — నూటికి యేబది రూపాయలవరకు ఉండును.

సాక్రటీసు.—మీ గ్రామములో 'సహకారపరపతి' సంఘ మున్నదా?

గ్రామస్థుడు.—ఉన్నది.

సాక్రటీసు.—ఈ సంఘమందు వడ్డి ఎంత?

గ్రామస్థుడు.—తొమ్మిది రూపాయల ఆరణాలని వినియున్నాను.

సాక్రటీసు.—ఇంకను నీవు ఈ సంఘమున చేరలేదా?

గ్రామస్థుడు.—చేరలేదు.

సాక్రటీసు.—కావున నీవు సోమరివై తక్కావి అప్పుతీసికొనకపోవుటచేతను, పరపతిసంఘమందు చేరకపోవుటచేతను, సర్కారువారివద్ద విత్తనములు కొనని కారణముననను, వడ్డిక్రింద నీవెంతో నష్టపడుటయేగాక, ఏటేట పంటలో నష్టికూడ అనుభవింపవలసియున్నది కదా?

గ్రామస్థుడు.—అవును; కాని సోమరితనమును వదలుట చాల కష్టము.

సాక్రటీసు.—నెల్లూరున కింతసమీపమున కాపురము చేయుచు నీవేల వరిపైరు వేయుచున్నావు?

గ్రామస్థుడు.—మంచి రైతులందరు ఇట్లే చేయుచుందురు.

సాక్రటీసు.—మీ గ్రామమునుండి నెల్లూరికి రైలును, మంచి రస్తాయును ఉన్నవా?

గ్రామస్థుడు. — ఉన్నవి. కాని, వరిపైరునకును వీనికిని సంబంధమేమియున్నది?

సాక్రటీసు. — నెల్లూరువంటి పట్టణములో కాపురము చేయువారు కూరగాయలు, అరటాకులు, పొగాకు, పచ్చిగడ్డి మొదలగువానిని ఎక్కువ ధరలిచ్చి కొనుచుందురుగదా?

గ్రామస్థుడు.—కొందరనియే అనుకొనుచున్నాను. కాని, వీనికిని మాకును ఎట్టి సంబంధములేదు. మేము రైతులము; తోటమాలీలము కాము.

సాక్రటీసు.—వరిపండనున్నప్పుడు తెవుళ్లువచ్చుట కలదా?

గ్రామస్థుడు.—కలదు.

సాక్రటీసు.—నీ పొలములోని వరిని నీవు కోయవలసిన కాలమున తక్కిన రైతులుకూడ వరికోతలలో మునిగియుందురా?

గ్రామస్థుడు.—ఉందురు.

సాక్రటీసు.—అట్లైన, ఆ సమయములో కూలివాండ్రు దొరకుట కష్టమేనా?

గ్రామస్థుడు.—అవును.

సాక్రటీసు.—పైర్లకు తెవుళ్లు వచ్చుటయేగాక, లాభములో చాలభాగము కూలీలక్రింద ఖర్చగుచుండుట స్పష్టమేనా?

గ్రామస్థుడు.—అవును.

సాక్రటీసు.—అట్లైన తోట సేద్యముచేసి, గొప్ప ఖరీదు గల కాయగూరలను పండించి, ఎక్కువ లాభము నేల సంపాదింపవు? నెల్లూరికి సమీపమందుండుటవలన నీవనుభవించవలసిన లాభ మిదియేకదా?

గ్రామస్థుడు.—మా కెవ్వరికి ఈ ఆలోచన తట్టినదికాదు. ఇట్టి పనులు తోటమాలీలు చేయతగినవని మేమనుకొనుచుంటిమి.

సాక్రటీసు.—భూమినుండి విశేషలాభమును సంపాదించుటలో పరువుకు భంగమేమైన ఉన్నదా?

గ్రామస్థుడు.—ఎందుకుండును? అట్లు చేయుటయేకదా శ్రేష్ఠమైన పని.

సాక్రటీసు.—నీవు పర్షియన్ రాట్నమును కొనియున్నావు గదా?

గ్రామస్థుడు.—అవును.

సాక్రటీసు.—దానికి సంవత్సరమునకు ఆరుమాసములు ఎట్టి పని లేకయుండునుగదా?

గ్రామస్థుడు.—అవును.

సాక్రటీసు. — అట్లైన నూతిని త్రవ్వుటకును, పర్షియన్ రాట్నమును సేకరించుటకును, నీవు ఖర్చుపెట్టిన ద్రవ్యము ఆరు మాసములు నిరుపయోగమై యుండునుగదా?

గ్రామస్థుడు.—నిజమే.

సాక్రటీసు.—కాని, సంవత్సరముపొడుగునను ఏదో ఒక విత్తనమును నాటుచు ఏదో ఒక పంటను కోయుచు ఉండిన యెడల నీకును నీ పశువులకును నీ రాట్నమునకును పనిలేక యుండుటగాని, మహాసూలుకాలములో శక్తికిమించిన పని యుండుటయు కూలివాండ్రకు ఎక్కువకూలి నియ్యవలసియుండుటయుగాని సంభవింపదుగదా?

గ్రామస్థుడు.—అవును.

సాక్రటీసు.—అట్లైన నీకును నీ పశువులకును సంవత్సరము పొడుగున పని యుండునట్లును, ఒకప్పుడు శక్తికిమించినపనియు మరి

యొకప్పుడు పనియే లేకపోవుటయు లేకుండునట్లును నీ వేర్పాటు చేసికొనవలెను. ఇట్లు చేసికొనినయెడల నీ నూతివలనను నీ రాట్నమువలనను అధికమగు లాభము పొందగలవు.

## సంఘ సేవ

సాక్రటీసు.— గ్రామస్థులారా, ఈ రోజు నేను చాల విచారపడవలసియున్నది. ఆదర్శప్రాయములగు గ్రామములను చూడగలుగుదునని ఎంతో ఆశపడియుంటిని. కాని—

గ్రామస్థులు.—ఏమిటీ. అట్టివి కనిపింపలేదా?

సాక్రటీసు.— అగ్రగణ్యములగు గ్రామము లనేకము లున్నవి. కాని, మురికి, పెంట—ఈ విషయములలో అవి అగ్రగణ్యములు.

గ్రామస్థులు.—ఏల ఆలాగు సెలవిచ్చుచున్నారు? మీ రెక్కడికి వెళ్లియుంటిరి?

సాక్రటీసు.— వైద్యశాలయుండు గ్రామమునకు వెళ్లిన యెడల అట్టి గ్రామము పరిశుభ్రముగను, ఆరోగ్యముగను ఉండుననియు, అందులోని పిల్లలందరు శుభ్రముగను ముఖవికాసముతోడను ఉందురనియు, అక్కడివారు దోమతెరల నుపయోగించుచుందురనియు, ప్రతి విషయమందును ఆ గ్రామము ఆదర్శముగనుండుననియు ఎంచియుంటిని.

గ్రామస్థులు.—ఆలాగున లేదా?

సాక్రటీసు.— లేనేలేదు. వైద్యశాలయు, చదువుకొనిన వైద్యుడును ఉండిన గ్రామము ఇతర గ్రామములవలె అపరిశుభ్రముగను, అసహ్యముగను నుండెను. వైద్యశాలసమీపమం

దలి స్థలముకూడ ఇట్లే యుండెను. లోపములను మాపుట కెట్టి ప్రయత్నము జరిగియుండలేదు.

గ్రామస్థులు.—మాకేమియు ఇది యొక వింతగ కనబడుట లేదు. అయిదార్గురు ఉపాధ్యాయులుగల పాఠశాలలుండు గ్రామములుకూడ తక్కిన గ్రామములవలెనే యున్నవి. ఇట్టి సందర్భములో వైద్యశాల యున్నంతమాత్రమున గ్రామము చక్కగయుండునని మీరేల అనుకొనవలెను?

సాక్రటీసు.—నేనొక ఇనాందారుని గ్రామమునకు వెల్లి యుంటిని. గ్రామమంతయు అతడొక్కనిదే. కాని అదికూడ తక్కిన గ్రామములవలెనే యుండెను. కొంతసేపటివరకు నే నెచట ఉండినది నాకే తెలియలేదు. మాలిన్యవిషయమున ఈ గ్రామము ఇతరగ్రామముల కేమాత్రము తీసిపోయినది కాదు.

గ్రామస్థులు.—మేమేమో బాగుపడగలమని మీరెల్ల ప్పుడు అనుకొనుచుందురు. మాలో చదువుకొన్నవారును, చదువులేనివారును, ధనికులును, దరిద్రులును ఒకేతీరున ఉన్నా రన్నమాట మీరింకను తెలిసికొనకుండుట చాల ఆశ్చర్యముగ నున్నది. ఇతరులెవ్వరు మమ్ము బాధపెట్టకుండునంతవరకును, మాకు కావలసిన భోజనాదిసౌఖ్యములు లభించుచుండునంత వరకును, ఇట్టి విషయముల నుపేక్షించుటయే మా స్వభావము.

సాక్రటీసు.—మీ మాటలు మిక్కిలి ఆశాభంగకరము లుగ నున్నవి. ఈ మీ స్వభావము మారునంతవరకు అభివృద్ధి కవకాశములేదనియే చెప్పవలసియున్నది. ఏదో ఒక గొప్ప లోపము ఎచ్చటనో మీయందున్నదని చెప్పక తప్పదు.

గ్రామస్థులు.—మీరు చెప్పునది సత్యము.

సాక్రటీసు.—ముసలివారగు మిమ్ము మార్చుట కష్టసాధ్యమగుటచేత యువకులద్వారా మార్పుల జరిగించుటయే మంచిదని తోచుచున్నది.

గ్రామస్థులు.-అవును. పెద్దవారి స్వభావమును మార్చుటకంటె పిల్లల స్వభావమును మార్చుట సులభము.

సాక్రటీసు.—అట్లైన మన యుపదేశమంతయును పిల్లలకు చేయుటయే ఉత్తమము. జీవించియుండుటయనిన, తినుట నిద్రపోవుట చుట్టత్రాగుటమాత్రమే కాదనియు, తమ జీవితములను చక్కబరచుకొనుటయందును ఇతరులకు కావలసిన సహాయము చేయుటయందును ఆసక్తికలిగియుండుటయే జీవితమునకు లక్షణమనియు చిన్నవారికి నేర్పవలెను.

గ్రామస్థులు.—ఇది చాల శ్లాఘాపాత్రమగు కార్యము. కాని, దీనినిచేయుట ఎట్లు?

సాక్రటీసు.—"బాలభటోద్యమ" మను ఒక ఉద్యమమునుగురించి వినియున్నట్లు నాకు జ్ఞప్తి. దానినిగురించి మీకేమైన తెలియునా?

గ్రామస్థులు.—బాగుగనున్నది. ఉత్సవసమయమున నొకప్పుడు ఈ బాలభటులు వృద్ధస్త్రీలకును, చిన్నపిల్లలకును సహాయముచేయుటయు, లోకులచే నీచములని యెంచబడు పరిచర్యలనుగూడ ఇతరులకు చేయుటయు మేము చూచియున్నాము.

సాక్రటీసు.—నేను కోరుచుండునది ఇదియే. నీచములని ఎంచబడు పరిచర్యలనుచేసి, ఇతరులకు సహాయపడ సిద్ధముగనుండువారలు మనకు కావలసియున్నది. సేవాధర్మములను,

అభివృద్ధియందు కాంక్షను, స్వార్థత్యాగమందు ఆసక్తిని చిన్న పిల్లలకు నేర్పువారు ఇప్పుడు కావలసియున్నది.

గ్రామస్థులు.—మీ సూచన మిక్కిలి చక్కగనున్నది. ఇట్టి బాలభటులను తయారుచేసి మీకు తోడ్పడునట్లు గావించుటకై మేము ప్రయత్నించెదము.

సాక్రటీసు. — వీనినన్నిటిని నేర్చుకొనవలసినవారొక బాలురుమాత్రమే కాదు. కళాశాలలందు చదువు యువకులు కూడ ఈ సేవాదర్శములను నేర్చుకొని, సర్కారు ఉద్యోగమందుగాని, ఉపాధ్యాయవృత్తియందుగాని ప్రవేశించినతర్వాత ఇతరులకు సహాయముచేసి దేశమును మంచిస్థితికి తీసికొనిరావలయుననెడి దీక్షగలవారు కావలెననియే నా యుద్దేశము.

గ్రామస్థులు.—మీ కోరిక చాల గొప్పది. మా కళాశాలలతోడను పాఠశాలలతోడను, అందులోని అందరు ఉపాధ్యాయులతోడను మీరు సంబంధము కలుగజేసికొని, మీ కోరిక సఫలమగునట్లు వారిచేత పనిచేయించవలెను.

సాక్రటీసు.—అలాగే చేయవలసియున్నది. విద్యావంతులందరిలో సాంఘికసేవవిషయమై నూతనోత్సాహము పుట్టవలెను. అట్టి ఉత్సాహము కలిగినయెడల వారేవృత్తియందున్నను ఇతరులకు సహాయముచేయ ఆసక్తిగలవారగుదురు.

గ్రామస్థులు. — మరియొక కష్టమున్నది. గ్రామమును శుభ్రముగానుంచు విషయమున వైద్యుడును, ఇండ్లను నివాసయోగ్యములుగ చేయు విషయమున ఇంజనీయరును, పిల్లల పెంచు పద్ధతులను స్త్రీలకుపదేశించు విషయమున ఉపాధ్యాయుడును ప్రజలకు సహాయముచేయవలయుననిన ఈ ఉద్యోగస్థులందరు హెచ్చుజీతములు బత్తెములు కోరెదరు.

సాక్రటీసు.—అట్లు కోరజాలరు. ముఖ్యముగ కళాశాల లందలి ఉపాధ్యాయులద్వారా సాంఘికసేవయొక్క మహిమను గురించి యువకులందరికి బోధింపగలిగినయెడల ఉద్యోగస్థులిట్టి కోరికను కోరజాలరు. పాఠశాలలందుండునపుడు బాలభటులుగ పనిచేసి ఆత్మవిశ్వాసముగలవారై స్వార్థత్యాగము చేయుటకును పరోపకారముచేయుటకును అలవాటుపడినవారగుదురు; పాఠశాలలనుండి కళాశాలలను ప్రవేశించినతర్వాతగూడ ఇట్టి అలవాటులే వారికి దృఢముగ పట్టువడును. అటుతర్వాత వారు విద్యార్థిదశను దాటి గృహస్థులైనపిమ్మట గూడ పరోపకారబుద్ధి గలవారై ఇతరుల గృహములను, గ్రామములను చక్కపెట్టు విషయమునను, వారి సౌఖ్యమును వృద్ధిచేయువిషయమునను ఎంతో తోడ్పడగలరు.

గ్రామస్థులు.—సాక్రటీసుగారూ, మీ యుద్దేశము కొనసాగుగాక. కొనసాగినయెడల మా దేశము భూలోకస్వర్గమగుననుటకు సందేహములేదు.

## వెండి బంగారముల తగులబెట్టుట

సాక్రటీసు కొందరు రైతులతో కలసి పొలములవెంట వెళ్లుచు పంటలు చాల హీనముగ ఉండుట చూచెను.

సాక్రటీసు.—పంట ఇంత హీనముగ ఉండుటకు కారణమేమి?

గ్రామస్థులు.—మా భూములు ఏటేటికి నిస్సారములగుచున్నవి.

సాక్రటీసు.—ఏల?

గ్రామస్థులు.—కారణము తెలియదుగాని, భూమి సారహీనమగుచున్నదనుటకు సందేహమేమియు లేదు.

సాక్రటీసు.—అనేకులిట్లు చెప్పుట నేనుకూడ వినియున్నాను. పేడనంతయును పిడకలపెట్టుట మీకు మామూలే గదా?

గ్రామస్థులు.—అవును. అనాదినుండి మాకిది ఆచారము.

సాక్రటీసు.—గ్రామములోని భూమినంతయును ప్రతి సంవత్సరము మీరు సేద్యము చేయుచుందురా?

గ్రామస్థులు.—ప్రస్తుతము ఆలాగే చేయవలసియున్నది. జనసంఖ్య హెచ్చినది; భూమినంతయును సాగుచేయుట అత్యావశ్యము.

సాక్రటీసు.—పూర్వకాలమం దిట్లుగాక రెండు సంవత్సరములకో మూడు సంవత్సరములకో ఒకపర్యాయము భూమిని సాగుచేయక బీడుగ ఉంచుట ఆచారముగనుండెను గదా?

గ్రామస్థులు.—అవును.

సాక్రటీసు.—ఈ కాలమందు మీరు భూమికి ఎక్కువ సత్తువచేయుటలేదు గదా?

గ్రామస్థులు.—ప్రతి సంవత్సరము ప్రతి కయ్యకు కావలసినంత ఎరువు దొరకుటలేదు.

సాక్రటీసు.—ఎరువు భూమికి ఆహారమువంటిదనుమాట మీరెరుగుదురా?

గ్రామస్థులు.—ఎరుగుదుము.

సాక్రటీసు.—భూమిలో పండు ధాన్యము, గడ్డి—వీనినుండి యేనా ఈ పేడ అంతయు వచ్చుచుండుట?

గ్రామస్థులు.—అవును.

సాక్రటీసు.—అనగా ఏటేట మీరు భూమిలోనుండి దాని సారమును తీసికొని, అందుకుబదులు దానికి కావలసిన ఆహారమును ఇచ్చుటలేదనియే గదా అర్థము?

గ్రామస్థులు.—అంతే.

సాక్రటీసు.—ఏటేట మీ భూములను పస్తుపెట్టి వాని నుండి విశేషమగు పంటల నపేక్షించుటయే గదా మీరు చేయుచుండుపని?

గ్రామస్థులు.—అవును.

సాక్రటీసు.—పూర్వకాలమున మీరు ఏటేటగాక రెండు మూడు సంవత్సరముల కొకపర్యాయము సేద్యము చేయుచుండినందున సారమును గోల్పోయిన భూములు తిరిగి సారవంతములగుట కవకాశముండెను. ఇప్పుడన్ననో మీరేటేట సాగుచేయుచున్నారు. అందుచే భూమి రానురాను నిస్సారమగుచున్నది; దానికి కావలసిన సత్తువచేయుటకు మీరు వెనుదీయుచున్నారు.

గ్రామస్థులు.—మీరు చెప్పునది నిజమనియు, రానురాను పంటలు తగ్గుటకు కారణమిదియే అనియు మాకిప్పుడు తోచుచున్నది.

సాక్రటీసు.—"మేము భూమిని పస్తుపెట్టితిమి; ఈ కారణముచే మాకు భూమినుండి తగిన పంటలు లభించుటలేదు,"

అని మిమ్మునే నిందించుకొనుటకు బదులు భూమి సారహీన మగుచున్నదని భూమిపై నేరమును మోపుట ఉచితముకాదు.

గ్రామస్థులు.—మీరు చక్కగ సెలవిచ్చితిరి.

సాక్రటీసు. — కావున మంచిపంటలు పండవలయుననిన మీరు పిడకలను కాల్చుట మాని మరిదేనినైనను వంటచెరకుగ నుపయోగింపవలెను; లేదా, మరేదైన ఎరువును మీరు సంపాదింపవలెను. మీ ప్రయత్నములు ఫలించువరకు మీ పట్టుదలను విడువకూడదు. ఇప్పుడు మీరు చేయుపద్ధతిని మీకు మంచిపంటలు పండనేపండవు.

గ్రామస్థులు.—నిజము.

సాక్రటీసు.—పిడకలకు బదులు మరి దేనినైనను వంట చెరకుగ ఉపయోగించుట మేలని నాకు తోచుచున్నది.

గ్రామస్థులు.—మరేదియున్నది.

సాక్రటీసు.—ముఖ్యముగ పాలుకాచుటకును దాలివేయుటకును గదా మీకు పిడకలు కావలసియుండుట?

గ్రామస్థులు.—అవును. వంటకు కట్టెలో బొగ్గులో పనికి వచ్చును.

సాక్రటీసు. — అట్లైన తక్కినవానికికూడ కట్టెల నుపయోగింపకూడదా? కాచకుండగనే కొందరు పాల నుపయోగించుట మీరెరుగరా?

గ్రామస్థులు. — ఎరుగుదుముగాని, కాచుటయే మా కిష్టము.

సాక్రటీసు. — అట్లైన పాలనుగూడ కట్టెలతో కాచవచ్చును.

గ్రామస్థులు.—కట్టెలతో కాచినయెడల పాలు పొంగి పోవునను భయముచేత మా ఆడువాండ్రు తక్కిన పనులన్నిటిని మానుకొని పొయ్యిదగ్గర ఉండవలసివచ్చును.

సాక్రటీసు.—వారు చేయు తక్కిన పనులేమి ఉన్నవి.

గ్రామస్థులు.—మరేమి ఉన్నవి? మరికొన్ని పిడకలపెట్టుటయే.

సాక్రటీసు.—కాని, కట్టెల నుపయోగింప సాగినయెడల పిడకలపెట్టవలసిన ఆవశ్యకత ఉండదు; కావున మీ స్త్రీలు పొయ్యిదగ్గర కూర్చుండుట కవకాశము కలుగును. అట్లు కూర్చుండునపుడు వారి కాలము వ్యర్థముకాకుండుటకై వారు బట్టలు కుట్టుకొనుచుండవచ్చును; లేదా పిల్లలకు చదువు చెప్పుచుండవచ్చును; మరేదైనపని చేసికొనవచ్చును.

గ్రామస్థులు.—నిజమే. పిడకలపెట్టుట మానినయెడల మా స్త్రీలకెన్ని పనులచేయుటకైనను వ్యవధియుండును. బడికి పోవుటకు మా ఆడపిల్లలు ఆరంభించినతర్వాత వారు నేర్చుకొనిన పనులనన్నిటిని వీరుకూడ చేయగలిగియుందురు.

సాక్రటీసు. — అట్లైన పిడకలపెట్టుటను మాని, పాలు కాచవలసివచ్చినపుడు కట్టెలతో కాచి, పొయ్యిదగ్గర కూర్చుండుటయే శ్రేష్ఠము.

గ్రామస్థులు.—మాకు కట్టెపుల్లలు ఎట్లు దొరకును?

సాక్రటీసు.—కట్టెలుకూడ వరిమొదలగు పైర్లవంటివే. కట్టెలు కావలసినయెడల మీరు చెట్లను పెంచవలెను.

గ్రామస్థులు. — కట్టెలకై చెట్లనుపెంచుట ఎవరైన కని విని యెరుగుదురా?

సాక్రటీసు. — కలపగాని, కట్టెలుగాని కావలసినప్పుడు తెలివిగల ప్రతి మనుష్యుడు చెట్లను పెంచక ఏమిచేయును?

గ్రామస్థులు.—సరే. మంచిది. మేముకూడ చెట్లను పెంచెదము. కాని, వానిని పెంచుటకు స్థలమెక్కడ?

సాక్రటీసు.—ఇదియొక కష్టమా? మీ గ్రామములోపలను బయటను ఉండు బీడు ప్రదేశములు, మీ ఇండ్లచుట్టు ఉండు దొడ్లు, చెరువులగట్లు, రస్తాలకు రెండుప్రక్కలనుండు ప్రదేశము—ఇవన్నియు చెట్లను వేయుటకు తగిన స్థలములే. ఇది గాక అనేక గ్రామములకు సమీపమున గుట్టలు, సాగుకుపనికి రాని భూములు ఉన్నవి; మరికొన్ని గ్రామములకు చుట్టు నిరుపయోగములగు ముండ్లపొద లెన్నియోయున్నవి. వీనిని కొట్టివేసి, వీని స్థానమున చెట్లను నాటవచ్చునుగదా?

గ్రామస్థులు.—ఇదంతయు చేసినప్పటికిని మాకు సరిపోవునంత కట్టెలు దొరకవని మేమనుమానపడుచున్నాము.

సాక్రటీసు.—ప్రయత్నముచేసి చూడుడు. అప్పటికికూడ చాలకపోయినయెడల రాక్షసిబొగ్గు నుపయోగింపవచ్చును. మీరందరు కలసి బండ్లకొలది బొగ్గును ఒకేపర్యాయము కొనుటకు ఏర్పాటుచేసికొనినయెడల మీకది చౌకగ దొరకును. అప్పుడు మీ పొలములకు కావలసిన ఎరువు (పేడ) దుర్వినియోగము కాకుండును.

గ్రామస్థులు.—ఇది చాల కష్టమైనపని. పేడను ఎరువుగ ఉపయోగించుట లాభకరమని మేమందరము గ్రహించిన తర్వాత, ఈ పనిని రైలురోడ్డుకు సమీపమునను౦డు గ్రామములవారు చేయతగియుండును.

సాక్రటీసు.—(వెళ్లిపోవుచు) అన్నిటికంటెను అద్భుతమగు శక్తియొకటి యున్నది. అదియే విద్యుత్తు (ఎలెక్ట్రిసిటి). నదులలోని నీళ్లనుండి దాని నుత్పత్తిచేసి తీగెలమూలముగ దానిని తీసి కొనిరావచ్చును. అద్భుతమగు ఈ విద్యుచ్ఛక్తితో మీరు దీపములు పెట్టుకొనవచ్చును; వంటచేసికొనవచ్చును. ఇదిగాక మరి ఎన్నియో పనుల చేసికొనవచ్చును. కావున మీకు కావలసినన్ని కట్టెలు దొరకనప్పుడు మీరీశక్తిని ఉత్పత్తిచేసి తీగల మీదుగ తీసికొనివచ్చి వంటపనులను చేసికొనినయెడల అమూల్యమగు పేడ అంతయు మీ పొలములకు సత్తువ యగును.

గ్రామస్థులు.—మీది చాల దూరదృష్టి. కాని ఇదివరకు మీరుపదేశించిన దానియందెచ్చటను మాకు లోపము కనుపింపలేదు. ఈ కారణముచే అద్భుతమగు ఈ విద్యుచ్ఛక్తి విషయమునకూడ మీరు చెప్పునదంతయు జరుగగలదను నమ్మకము మాకున్నది.

సాక్రటీసు.—దీనికేమి? పరీక్షించి చూడవచ్చును. కాని పిడకలను కాల్చివేయుటయనిన వెండి బంగారముల మంటల పాలుచేయుటయని మీరు గ్రహించి ఈ అలవాటును మానవలెను. మీ ఆహారపదార్థములనుగాని, పశువుల ఆహార పదార్థములనుగాని మీరు కాల్చివేయుట కిష్టపడెదరా? అట్లైన, భూమికి ఆహారపదార్థమగు పేడనుమాత్రము మీరేల కాల్చి వేయవలెను?

గ్రామస్థులు.—మీరు చెప్పునదంతయు ఆచరింపదగినదే.

సాక్రటీసు.—కొన్నిరోజుల క్రిందటనే నొక యంత్రమును చూచియుంటిని. పాలనుండి మీగడను వేరుచేయు శక్తి దానికి గలదు. దాని నుపయోగించినయెడల ఎప్పటికంటె అధికమైనట్టియు, శుభ్రమైనట్టియు నెయ్యి కట్టెల ఖర్చు విస్తారము లేకుండ బహు స్వల్పకాలములో లభించునని తెలియుచున్నది. అట్టి యంత్రము నొకదానిని మీ రేల ఉపయోగింపకూడదు?

గ్రామస్థులు.—ఉపయోగించెదము.

## నిరర్థక వ్యయము

గ్రామస్థులు. — సాక్రటీసుగారూ, దినదినమునకు మా దారిద్ర్య మధికమగుచున్నది.

సాక్రటీసు.—సందేహాము లేదు. కాని నాకుమాత్ర మిది యొక వింతగ కన్పడుట లేదు.

గ్రామస్థులు.—ఏమి ఆలాగు సెలవిచ్చుచున్నారు.

సాక్రటీసు.—ప్రతివస్తువును వ్యర్థపుచ్చుటయేగదా మీ స్వభావము.

గ్రామస్థులు. — వ్యర్థపుచ్చుటయా? వ్యర్థపుచ్చుట కేమున్నది? మావంటి శుష్కదరిద్రులకు వ్యర్థ పెట్టుట కేదైన ఉండిన గదా?

సాక్రటీసు.—మీ రేమన్నను సరే. ప్రపంచములోనివారందరిలో వ్యర్థపుచ్చు విషయమున మీ రగ్రగణ్యులు.

గ్రామస్థులు.—అయ్యా, మీ అర్థము తెలియుట లేదు. మేము జూదమాడుట లేదు; త్రాగుట లేదు; వెలగల బట్టల కొనుట లేదు; మోటారుబండ్లలో తిరుగుట లేదు.

సాక్రటీసు.—మీ ద్రవ్యమును వ్యర్థపుచ్చుట కివిగాక ఇతరమార్గము లెన్నియోయున్నవి.

గ్రామస్థులు.—వానిలో కొన్నిటినైన చెప్పిన బాగుండును.

సాక్రటీసు.—మంచిది. వినుడు. గ్రామములోని పెంటను చెత్తను గాలికి ఎగిరిపోవునట్లును, పశువులు త్రొక్కి వేయునట్లును, ఎండకు ఎండిపోవునట్లును, వానకు కొట్టుకొనిపోవునట్లును బయలుప్రదేశములలో దిబ్బలుగపోసి వ్యర్థపుచ్చుచున్నారు. మొట్టమొదట చెప్పదగిన దిదియే.

గ్రామస్థులు.—అవును. మీరు చెప్పునది నిజమే.

సాక్రటీసు.—భగవంతుడిచ్చినవానిలోనెల్ల ఉత్కృష్టమగు పదార్థమును మీరు వ్యర్థపుచ్చుచున్నారు.

గ్రామస్థులు.—ఏమిటిది?

సాక్రటీసు. — మీరు పేడనంతయును కాల్చివేయు చున్నారు.

గ్రామస్థులు.—నిజమే.

సాక్రటీసు. — మంచి విత్తనములకు మారుగ చెడువిత్తన ములను చల్లి మీరు మీ కాలమును శరీరశ్రమమును వ్యర్థ పుచ్చుచున్నారు.

గ్రామస్థులు.—ఇదికూడ నిజమే. విత్తనముల నెక్కడ కొనవలెనను విషయము మేము విచారించుటయే లేదు.

సాక్రటీసు.—చెడ్డపశువులు, మంచిపశువులు తినునంతటి ఆహారమును తిని, అవి చేయు పనిలో సగముపనిచేయుచు, అవి

ఇచ్చు పాలలో సగముపాలను ఇచ్చుచున్నను మీరు మంచి పశువులను పెంచుటకు బదులు చెడ్డపశువులను పెంచుచుందురు.

గ్రామస్థులు.—అవును. ఈ సందర్భమునకూడ మీరు చెప్పునదే సత్యము.

సాక్రటీసు.—పిండి విసరుటకును వడ్లను దంచుటకును మిషన్లు ఉన్నప్పటికిని ఈ పనులను మీ ఆడువాండ్రచేత చేయించుచు వారి కాలమునంతను వ్యర్థపరచుచున్నారు; ఇట్లే వారిచేత పిడకలపెట్టించుచు పిల్లలను సంరక్షించి పెంచుటయందును, కుటుంబమునకు కావలసిన బట్టలు కుట్టుటయందును లాభకరముగ ఉపయోగింపదగిన వారికాలమును వ్యర్థపరచుచున్నారు.

గ్రామస్థులు.—ఇదికూడ నిజమే.

సాక్రటీసు. — కుట్టుపనివానిచేత బట్టలు కుట్టించుటచే మీ ద్రవ్యము వ్యర్థమగుచున్నది; మీ ఆడువారి యుపేక్షవలన, మీ పిల్లలు అసహ్యముగను, అనారోగ్యముగను తగిన సంరక్షణ లేనివారివలెను ఉండుట సంభవించుచున్నది.

గ్రామస్థులు.—అవును.

సాక్రటీసు. — పర్షియన్ రాట్నము నుపయోగించుటకు బదులు కపిలెగట్టి మీయొక్కయు, మీ పశువులయొక్కయు కష్టమును వ్యర్థపుచ్చుచున్నారు.

గ్రామస్థులు.—అవును.

సాక్రటీసు.—చిన్నదియగు కొడవలితో పండినపైర్లను కోయుచు మీ కాలమును కష్టమును వ్యర్థపరచుకొనుచున్నారు.

గ్రామస్థులు.—నిజమే. మా కోడనలి చాల చిన్నదని మేము ఒప్పుకొనుచున్నాము.

సాక్రటీసు.—ప్రాతకాలమునాటిదియగు మీ నాగేలు వంకరతిరిగిన ఒక కొయ్యయేగదా? సర్కారువారు అమ్ముచుండు నాగలి దీనికంటె నాలుగింతలు మంచిదియని మీరెరిగియు, మీరీ పూర్వకాలపు నాగలినే వాడుచున్నారు.

గ్రామస్థులు.—అవును.

సాక్రటీసు.—దీనిమూలమున మీకాలము కష్టము వ్యర్థమగుచుండుట లేదా?

గ్రామస్థులు.—వ్యర్థమగుచున్నవి.

సాక్రటీసు.—మీరు మీ ద్రవ్యమును నగలకు ధారవోసి ఎంతో ద్రవ్యమును కోల్పోవుచున్నారు.

గ్రామస్థులు.—ఇదికూడ నిజమే.

సాక్రటీసు. — కాలక్రమమున ఈ నగలు అరిగిపోవుచున్నవా?

గ్రామస్థులు.—బహు వేగముగ అరిగిపోవును.

సాక్రటీసు. — ఈ డబ్బునే పరపతిసంఘమునందు దాచియుంచుకొనినయెడల అది క్రమక్రమముగ వృద్ధియగునా?

గ్రామస్థులు.—అగును.

సాక్రటీసు.—దోమతెరలను, కైవ్నాను ఉపయోగించని కారణముచేతను, టీకాలవేయించుకొనని కారణముచేతను మీరు మీ ఆరోగ్యమును చెడగొట్టుకొనుచున్నారా?

గ్రామస్థులు.—అవును.

సాక్రటీసు. — విస్తారముగ ఖర్చుపెట్టి వివాహములను, కర్మాంతరములను, ఉత్సవములను జరిపించుటచేతను, కోర్టుల కెక్కుటచేతను మీ ధనము వ్యర్థమగుచున్నదా?

గ్రామస్థులు.—వీటికై మేము చాల డబ్బు ఖర్చుపెట్టు చుండుట నిజమే.

సాక్రటీసు. — పరపతిసంఘమందు చేరి నూటికి తొమ్మిది రూపాయల ఆరణాల వడ్డిచొప్పున అప్పుతీసికొనుటకు బదులు సావుకారువద్ద నూటికి ముప్పది ఆరు రూపాయల వడ్డికి అప్పుల తీయుచున్నారా?

గ్రామస్థులు.—ఈ పొరపాటునుగూడ చేయుచున్నాము.

సాక్రటీసు.—మరికొన్ని నిదర్శనములను చూపింపవలెనా, లేక, పైనచెప్పిన అంశములనుండియే మీరు వస్తువుల నేవిధముగ వ్యర్థపుచ్చుచున్నారో స్పష్టమగుచున్నదా?

గ్రామస్థులు.—చాలును, చాలును. దుర్వ్యయము చేయు వారిలో మేమగ్రగణ్యులమనుట స్పష్టమే.

సాక్రటీసు.—కావున మీరు ముఖ్యముగ గమనించవలసిన విషయమొకటియున్నది. మీరు ధనికులగుటకు అద్భుతములగు క్రొత్త యంత్రములుకాదు కావలసినవి; దేవుడిదివరకు మీకిచ్చియుండు ధనమును తక్కిన సదుపాయములను వ్యర్థపుచ్చుకొనక సార్థకముగ ఉపయోగించుకొను విధమును మీరు నేర్చుకొనవలెను. ఉన్నదానిని ఏలాగు ఉపయోగించుకొనవలసినది, ఏలాగు ఖర్చుపెట్టవలసినది మీరు తెలిసికొనుట అవసరముగాని క్రొత్తవిషయముల నేర్చుకొనుట అంత అవశ్య

కముకాదు. మీ కిష్టమున్నయెడల మీరు వ్యర్థపరచు మరియొకదానిని గురించి చెప్పెదను.

గ్రామస్థులు.—ఏమిటి అది? ఇన్నిటిని వింటిమి గనుక దీనినికూడ వినుటయే మంచిది.

సాక్రటీసు.—ఇట్టివి అనేకములున్నను ఒకటిమాత్రమే చెప్పెదను.

గ్రామస్థులు.—సెలవిండు.

సాక్రటీసు.—ఆ కనిపించుచుండు పొద ఏమిటిది? అందులోని చెట్లను కొట్టివేసి అమ్మకూడదా?

గ్రామస్థులు.—మా పూర్వులు దానిని పశువుల బీడు క్రింద ఉపయోగింపవలసినదని ఏర్పాటుచేసియుండిరి. అందులోని చెట్లను కొట్టివేయకూడదు.

సాక్రటీసు.—అందులో చెట్లు పొదలు ఏమిటి?

గ్రామస్థులు.—జీలుగు, నాగుజెముడు ముఖ్యములైనవి.

సాక్రటీసు.—వీనిని పశువులు తినునా?

గ్రామస్థులు.—తినవు.

సాక్రటీసు.—అక్కడ గడ్డి పెరుగుచున్నదా?

గ్రామస్థులు.— పొదలు, ముండ్లు బలసిపోయియుండుటచేత గడ్డి పట్టుటకే అవకాశములేదు.

సాక్రటీసు.— చూచితిరా? పశువులమేతకని పూర్వులు ఏర్పాటుచేసిన ఈ బీడు ఎట్టి స్థితికివచ్చినదో? నిరుపయోగము లగు ముండ్లచెట్లు బలసిపోవుటచేత పశువులు తినుటకు గడ్డి లేకపోవుటయేగాక అవి నిలుచుటకుకూడ స్థలములేకున్నది. ఇది వ్యర్థపుచ్చుటయే కదా?

గ్రామస్థులు.—అవును. మాలోని మరియొక లోపమును మీరేలాగో కనుగొంటిరి.

సాక్రటీసు.—మీ పూర్వులెంతటి బుద్ధిమంతులో మీరెంతటి బుద్ధిహీనులో చూడుడు. పశువులకు కావలసిన గడ్డి పెరుగుటకును, పిడకలకు బదులుగ మీకు కావలసిన వంట చెరకు సులభముగ దొరకుటకును, పేడ అంతయు భూమికి ఎరువై భూమినుండి మీకు కావలసిన ధాన్యమును, మీ పశువులకు కావలసిన గడ్డియు విశేషముగ ప్రాప్తమగుటకును, మీ పూర్వులు ఈ పశువుల బీడును ఏర్పరచిరి. తెలివిలేని మీరు ఉన్న చెట్లను కొట్టివేసి, కట్టెలకుబదులు పిడకల వాడజొచ్చితిరి. పశువులుతినునట్టి గడ్డినికూడ మీరు పెంచుటలేదు. మీ పూర్వుల యుద్దేశములను కొనసాగించుటయే మీ అభిప్రాయమైనయెడల భూమినంతయును ఆక్రమించుకొనియుండు నిరుపయోగములగు చెట్లను కొట్టివేసి, వానిని అమ్మి (లేక మీలో మీరు పంచుకొని) వాని స్థానమున గడ్డి విత్తనములను, వంట చెరకుకై ఉపయోగించునట్టియు క్షామకాలమున పశువులకు ఆహారముగ నుపయోగింపదగిన ఆకులుకలిగినట్టియు, చెట్లవిత్తనములను నాటుడు.

గ్రామస్థులు.—మీ మాటలు యుక్తములని తోచుచున్నది. మా పూర్వుల యుద్దేశముల కొనసాగించుట కిదియే మార్గము.

సాక్రటీసు.—మీకుగల సదుపాయములను వ్యర్థపుచ్చుట మానుకొనిన నిమిషమునుండి మీ దారిద్ర్యము పారిపోవును; కాని, అప్పటివరకు అది మిమ్ములను విడువజాలదు. మీ

రిప్పుడు చేయుచుండునట్లు చేయుచు, సర్కారువారేదో ప్రభావమువలన మీ ఆదాయమును రెట్టింపుచేయగలరనియు, మీరు పన్నులు చెల్లించకపోయినను ప్రభుత్వము కొనసాగుననియు అనుకొనుట నిరర్థకము. మీ శ్రేయస్సు మీ చేతులందే యున్నది.

గ్రామస్థులు.—సాక్రటీసుగారూ, మీరు చెప్పిన మాటలబట్టి మీ యుపదేశము సరియైనదని మాకు నమ్మకము పుట్టుచున్నది. ఏదో యొక మంత్రప్రభావమువలన లక్షాధికారులు కాగలమనుకొనుట పిచ్చితనము. జీవితమందును, వ్యవసాయమందును మా కిదివరకు పట్టుబడియుండు అలవాటులను మార్చుకొని క్రొత్త మార్గముల ననుసరించుటయే ఉత్తమమని తోచుచున్నది.

## పెద్ద ఆబోతులు

సాక్రటీసు ఒక బ్రాహ్మణునితో మాటలాడుచు కూర్చుండియుండగా వారిప్రక్క కొన్ని పశువులు పోవుచుండెను. వాని మధ్య కొంత వికారముగనున్నట్టియు, చిన్నదైనట్టియు ఆబోతు కూడ ఉండెను. సాక్రటీసు దానిని చూచి,

సాక్రటీసు.—ఇది ఎవరిది?

బ్రాహ్మణుడు.—ఇది ఎవరిదియు కాదు. ఇది భగవంతునికి ప్రీతిగ వదలిపెట్టబడిన ఎద్దు.

సాక్రటీసు.—మీ ఆవుల దాటుటకై దీనినేకదా మీరుపయోగింతురు?

బ్రాహ్మణుడు.—అవును. వేరే ఎద్దు లేదు. అందుచే మా ఆవుల నిదియే దాటుచుండును.

సాక్రటీసు.—మీవంటి బ్రాహ్మణులు కసాయివానికి దోడ్ప డుట చూడ చాల ఆశ్చర్యముగనున్నది.

బ్రాహ్మణుడు.—(మిక్కిలి కోపముతో) మీ అభిప్రాయము బోధపడుటలేదు. మీ రిచట ఈ విధముగ మాటలాడినయెడల మీ ప్రాణములుకూడ దక్కవు.

సాక్రటీసు.—చాల విచారముగనున్నది. కాని అప్పుడప్పుడు నా బుద్ధిలేని నోటనుండి సత్యము జారి పడుచుండును.

బ్రాహ్మణుడు.—తాతా, నీవు అబద్ధమాడుచున్నావు. నీ మాటలలో సత్యమన్నది లేదు. కసాయివానికి నేను తోడ్పడుటయా!

సాక్రటీసు.—అవును. తప్పక తోడ్పడుచున్నావు. తోడ్పడుటలేదని ఏల నటించెదవు? నటనవలన లాభమేమియున్నది?

బ్రాహ్మణుడు.—నీ మాటలు సత్యము లెట్లగును?

సాక్రటీసు.—ఆ ఎద్దు మిక్కిలి చెడ్డదేనా?

బ్రాహ్మణుడు.—మంచిదికాదని చెప్పగలను.

సాక్రటీసు.—కాదు. అది చాల చెడ్డది.

బ్రాహ్మణుడు.—సరే. అది కొంత నీరసమైనదే.

సాక్రటీసు.—అంతమాత్రము కాదు. అది బొత్తిగ నీచమైనది.

బ్రాహ్మణుడు.—నీచమైనదో కాదో; మంచిదికాదని నేను ఒప్పుకొనెదను.

సాక్రటీసు.—అట్లైన దానికి పుట్టిన కోడెదూడలు దున్నుటకుపయోగించనివనియు, పెయ్యదూడలు చాల తక్కువ పాల నిచ్చునవనియు, మీరు ఒప్పుకొనెదరా?

బ్రాహ్మణుడు.—దీనికి పుట్టు దూడలన్నియు నీరసములుగ నుండును. సందేహము లేదు.

సాక్రటీసు.—అందుచే అవి కసాయివాని చేతులో పడి పోవునా?

బ్రాహ్మణుడు.—అట్టిది ఎన్నటికి జరుగదు. నన్నేల మీ రీవిధముగ నిందించ సాహసించుచున్నారు?

సాక్రటీసు.—ఈ దూడలు మీ కుపయోగము కాని యెడల మీరు వానిని దగ్గర ఉంచుకొనరుగదా?

బ్రాహ్మణుడు.—నిజమే. కొన్నిటిని అమ్మివేసెదము.

సాక్రటీసు.—కొన్నవాడు వానిని చంపునుగదా?

బ్రాహ్మణుడు.—చంపడు. చంపకూడదను షరతుమీదనే అమ్మెదము. మేము మా దూడలను కసాయివాండ్రకు అమ్మనే అమ్మము.

సాక్రటీసు. — మీదగ్గర కొన్నవా డాదూడల నేమి చేయును.

బ్రాహ్మణుడు.—నాకు తెలియదు.

సాక్రటీసు.—అతడు మరియొకనికి అమ్మునా?

బ్రాహ్మణుడు.—అమ్మవచ్చును.

సాక్రటీసు.—ఏదైన షరతుతో అమ్మునా?

బ్రాహ్మణుడు.—నాకేలాగు తెలియును?

సాక్రటీసు.—అనగా, కొన్నవారందరు ఆ దూడలు నిరుపయోగములని తెలిసికొని వానిని మరెవరికైన అమ్మచూచు చుందురుగదా?

బ్రాహ్మణుడు.—కావచ్చును.

సాక్రటీసు.—కొసకు వానిని కసాయివాడు కొనునా?

బ్రాహ్మణుడు.—బహుశః ఆలాగే జరుగునని తోచుచున్నది.

సాక్రటీసు.—పంతులుగారూ, మీరు కసాయివానికి నిజముగ తోడ్పడుచున్నారన్న మాటయేనా?

బ్రాహ్మణుడు.—కసాయివాడేదోయొక జంతువును చంపవలసినదేకదా? అది అతని వృత్తి.

సాక్రటీసు.—ఒంగోలుజాతి దూడల నతడు చంపునా?

బ్రాహ్మణుడు.—చంపడు. అంతటి ఖరీదుగల దూడల కొనుట కతనికి శక్తియుండదు.

సాక్రటీసు.—కసాయివాడుకూడ అట్టిపని చేయడుగదా?

బ్రాహ్మణుడు.—చేయడు.

సాక్రటీసు.—అట్లైన మీరందరు ఒంగోలుజాతి ఆబోతులనే పెట్టుకొనినయెడల—మీరు వాని నేవిధముగ ఉపయోగించినను, ఇతరుల కమ్మినను — కసాయివానిచేతిలో మీ దూడలు పడవుగదా?

బ్రాహ్మణుడు.—అవును.

సాక్రటీసు.—కావున, నీరసములగు ఆబోతులు మీరు పెట్టుకొని యుండునంతవరకు మీరు కసాయివాండ్రను పోషించువారే.

బ్రాహ్మణుడు.—ఆలాగే తోచుచున్నది; కాని ఇంతకుముందెప్పుడు ఇట్టి ఆలోచన మాకు తట్టినదికాదు. భగవంతు

నికి ప్రీతిగ వదలిపెట్టబడిన యెద్దు ఎంత నీరసమైనదైనను దానికి విత్తులుకొట్టుట పాపమని మేమింతవరకు భావించుచుంటిమి.

సాక్రటీసు.—కాదు. అట్టిదానిచే ఆవులను దాటించుట కంటె దాని విత్తులుకొట్టుటయే పుణ్యము.

బ్రాహ్మణుడు.—అవును.

సాక్రటీసు.—ప్రాత ఆచారములను గ్రుడ్డివారివలె అనుసరించుట ఎన్నటికి మంచిదికాదు. దీనినికూడ గ్రుడ్డివారివలె అనుసరింపకూడదు. ప్రతి విషయమును చూచి చక్కగ పరిశీలింపవలెను. జాగ్రత్తగ పరిశీలించినతర్వాత మంచిదని తోచినయెడల అట్టిదాని ననుసరింపవలెను; లేనియెడల దానిని విసర్జింపవలెను.

## రెండు ఖజానాలు

ఒకరోజు సాక్రటీసు చావడిలో కూర్చుండియుండగా పింఛను పుచ్చుకొనిన పోలీసు ఇన్‌స్పెక్టరొకడు ఏదో చాల పని ఉండినవానివలెను, చాల దూరము ప్రయాణముచేయవలసిన వానివలెను నడుచుచు అక్కడికివచ్చెను.

సాక్రటీసు.—ఇన్‌స్పెక్టరుగారూ, ఎక్కడికి ప్రయాణము.

ఇన్‌స్పెక్టరు.—నా పింఛన్ తెచ్చుకొనుటకుగాను ఖజానా కచ్చేరికి వెళ్లుచున్నాను.

సాక్రటీసు.—ఖజానా అనగా ఏమిటి?

ఇన్‌స్పెక్టరు.—మీకు తెలియదా? విలువగల వస్తువుల నన్నిటిని సర్కారువారు దాచియుంచుచోటు.

సాక్రటీసు.—అట్లైన మీ గ్రామములో మీ అందరికి ఖజానాలున్నవని నేననుకొనవచ్చునా?

ఇన్స్పెక్టరు.—మీ మాట నాకు తెలియుటలేదు. మేము కడుదరిద్రులము. ఖజానాలు మాకెక్కడివి?

సాక్రటీసు.—ఇన్స్పెక్టరుగారూ, మీరిప్పుడొక గోతిని త్రవ్వియున్నారుగదా?

ఇన్స్పెక్టరు.—మీయొక్క ప్రోత్సాహ మధికమగుటచే నేనొక గోతిని త్రవ్వితిని.

సాక్రటీసు.—నీ పెంటను, చెత్తను అందులో పడవేయుచున్నావా?

ఇన్స్పెక్టరు.—అవును.

సాక్రటీసు.—ఇంటిలో చిమ్మినదాని నంతయును అందులో వేయుచున్నావా?

ఇన్స్పెక్టరు.—అవును.

సాక్రటీసు.—బూడిదెను కూడ?

ఇన్స్పెక్టరు.—అవును.

సాక్రటీసు. — వర్షములు పడినతర్వాత గ్రామముచుట్టు పెరుగు నిరుపయోగములగు మొక్కలను కొట్టి అందులో వేయుచున్నావా?

ఇన్స్పెక్టరు.—అవును.

సాక్రటీసు.—పాతబడి చివికిపోయిన ఇండ్లకప్పులు?

ఇన్స్పెక్టరు.—వానినికూడ.

సాక్రటీసు.—మీ పశువుల పేడ?

ఇన్స్పెక్టరు.—దానినికూడ.

సాక్రటీసు. — వీధులను పశువులకొట్టములను తుడిచి చేర్చిన పెంట?

ఇన్స్పెక్టరు.—దానినికూడ.

సాక్రటీసు.—అనగా మీరు చేర్పగలిగినదాని నంతయును అందులో వేయుచున్నారన్న మాటయేనా?

ఇన్స్పెక్టరు.—అవును.

సాక్రటీసు.—అదంతయు అక్కడ కుళ్లినతర్వాత కొన్ని నెలలకు మీరు దానిని పైకితీసి ఎరువుగ ఉపయోగించుచున్నారా?

ఇన్స్పెక్టరు.—అవును. ఆలాగే చేయుచున్నాను.

సాక్రటీసు.—ఇట్లు చేయుటవలన మీకు రెండింతల పంటలు పండుచున్నదా?

ఇన్స్పెక్టరు.—నిజమే. మీ సలహాప్రకారము నడుచుటకు పూర్వము నాకు వచ్చుచుండినదానికంటె ఇప్పుడు నా భూములనుండి రెండింతల ధాన్యము వచ్చుచున్నది.

సాక్రటీసు. — దీనినిబట్టి గోతులు గోతులుకావనియు, ఖజానావే యనియు చెప్పదగియున్నదా?

ఇన్స్పెక్టరు.—నిజమే. మీరు చెప్పునది సరి. నిజముగ నాకొక ఖజానాయున్నది.

సాక్రటీసు.—నీవు గ్రామ పరపతిసంఘమునందు చేరియున్నావా?

ఇన్స్పెక్టరు.—చేరితిని. ఇదికూడ మీ సలహామీదనే.

సాక్రటీసు. — ధాన్యము అమ్ములవలన వచ్చిన డబ్బు నుండియు, నీ పింఛనునుండియు నీవు మిగుల్చుకొన గలిగినదాని నంతయును ఆ సంఘములో దాచుకొనుచున్నావా?

ఇన్‌స్పెక్టరు.—అవును.

సాక్రటీసు.—ఇతరవిధముల నీకు లభించు డబ్బునంతను ఇట్లే చేయుచున్నావా?

ఇన్‌స్పెక్టరు.—అవును.

సాక్రటీసు.—నగలకుగాను నీవిప్పుడేమియు ఖర్చుపెట్టుట లేదుగదా?

ఇన్‌స్పెక్టరు.—లేదు.

సాక్రటీసు.—నీవు సంగ్రహించు పెంట అంతయు, నీవు త్రవ్వించిన గోతిలోనికిని, నీవు సంగ్రహించు డబ్బు అంతయు పరపతిసంఘములోనికిని చేరుచున్నవా?

ఇన్‌స్పెక్టరు.—అవును.

సాక్రటీసు.—అనగా నీకు ఈ గోయిమాత్రమేగాక పరపతిసంఘముకూడ ఒక ఖజానాగా ఉన్నదా?

ఇన్‌స్పెక్టరు.—అవును. సాక్రటీసుగారూ! మీరు చెప్పునది సత్యము. నాకు రెండు ఖజానాలున్నవి.

సాక్రటీసు.—కావున తెలివిగల ప్రతి రైతునకు రెండు ఖజానాలున్నవి—గోయి ఒకటి; పరపతిసంఘము ఒకటి. ఈ రెంటియందదతనికి లక్ష్యముండువరకు దారిద్ర్య మతనిని పీడింపజాలదు.

ఇక్‌స్పెక్టరు.—నిజము. మీ సలహాను పుచ్చుకొని గోతిని త్రవ్వి పరపతిసంఘములో చేరినప్పటినుండి దారిద్ర్యమన నేమియో నేను మరచితిని.

సాక్రటీసు.—మంచిది. హాయిగ ఖజానాకు వెళ్లి పింఛను పుచ్చుకొనిరమ్ము.

ఇక్‌స్పెక్టరు.—నమస్కారము. సెలవు.

## ప్రారబ్ధము—భగవదిచ్ఛ

గ్రామస్థుడు.—సాక్రటీసుగారూ, నా కష్టములు దుర్భరమగుచున్నవి. పంటలా పోయినవి; పిల్లలా జబ్బుగనున్నారు; అప్పులన్ననో పెరిగిపోవుచున్నవి. రైతులగు మాయొక్క స్థితి చాల కష్టముగనున్నది. ప్రభుత్వమువారే—

సాక్రటీసు.—ప్రభుత్వమువారిని నిందించుటయా?

గ్రామస్థుడు.—వర్షము—

సాక్రటీసు.—గనుక భగవంతుడుకూడ నిందాపాత్రుడే.

గ్రామస్థుడు.—అయ్యా, నేను కష్టపడి పనిచేయుటలేదా? దయకు పాత్రుడనుకానా? సర్కారు—

సాక్రటీసు.—తిరిగి సర్కారువారే!

గ్రామస్థుడు.—నేను భూమిపన్నును చెల్లించుటలేదా?—ఈ భూమి—

సాక్రటీసు.—తిరిగి దేవునినా నిందించుట! రైతులారా! మీరు ఎరువునంతయును పొయ్యిలో వేసి కాల్చివేయుచున్నారు; లేదా మీ గ్రామమునంతయును దానితో అసహ్యపరుచుచున్నారు; ప్రాతకాలపునాటి ఒక వంకరకట్టెతో నేలను

దున్నుచున్నారు; విత్తనములను విత్తనముల వర్తకునివద్ద కొనుటకు బదులు మిఠాయి అంగడివానివద్ద కొనుచుండెదరు; పర్షియన్‌రాట్నముతో బావినుండి నీళ్లు పైకెత్తుటకు బదులు కపిలెతో ఎత్తుచున్నారు; పరపతిసంఘమువారు తొమ్మిది రూపాయల ఆరణాల వడ్డికి అప్పు ఇచ్చుచున్నను, ముప్పది ఆరు రూపాయల వడ్డిచొప్పున సాహుకారువద్ద అప్పుపుచ్చుకొనుచున్నారు; రోతపుట్టించు ప్రదేశములలో కాపురముచేయుచున్నారు; ఇండ్లకు కిటికీల పెట్టుకొనుటలేదు. పిల్లలకు టీకాలవేయించుట లేదు; కాని పంటలు పోయినపుడును, అప్పులు హెచ్చినపుడును, పిల్లలకు జబ్బుచేసినపుడును భగవంతుని, సర్కారువారిని నిందించుటకు సిద్ధపడియుందురు. మిత్రులారా! ఇప్పుడుండు భగవంతుడు మీకు చాలడు. రెండింత లధికముగ అనుగ్రహము గల భగవంతుడు మీకు కావలెను. ఇక సర్కారువారి విషయమన్ననో—మీరు కోరునది ప్రభుత్వముకాదు; అనాథ శరణాలయమును మీరు కోరుచుండుట!

గ్రామస్థుడు.—సాక్రటీసుగారూ, మమ్ముల నేమి చేయుమనెదరు?

సాక్రటీసు.—ఏదైన చెడినపుడు మీరు కొంచె మాలోచించి పొరపాటెవరిదనియు, ఆరోగ్యవిషయమందును, పంటల విషయమందును మీ శక్తికొలది మీరు చేయువలసిన పనులను చేసినదియు లేనిదియు కొంత చూచుకొనవలెను. మీరు శక్తి వంచనలేక చేసికొనగలిగినదంతయును చేసికొనినతర్వాత అప్పటికికూడ మీ స్థితి బాగుపడనిపక్షమున భగవంతునిగాని, సర్కారువారినిగాని నిందింపవచ్చును.

గ్రామస్థుడు. — అయ్యా, పంటలుపోవుటయు, పిల్లకు మశూచివచ్చుటయు భగవదిచ్ఛనుబట్టికదా?

సాక్రటీసు. — కాని, టీకాలువేయించుకొనిన పిల్లలకు మశూచి వచ్చుటలేదుగదా?

గ్రామస్థుడు.— లేదు.

సాక్రటీసు.—అట్లైన భగవంతునికంటె టీకాలవేయువాడే గొప్పవాడనియా!

గ్రామస్థుడు.—కానేకాదు. ఇది చాల పిచ్చి ఊహ.

సాక్రటీసు.—కలరావచ్చినపుడు మీ పిల్లలెందుకు చచ్చిరి?

గ్రామస్థుడు.—భగవదిచ్ఛ.

సాక్రటీసు.—అయితే పెద్ద డాక్టరువచ్చి అందరికి మం దిచ్చినతర్వాత ఎవరికిగాని కలరా తగులలేదుగదా?

గ్రామస్థుడు.— లేదు.

సాక్రటీసు.—అట్లైన భగవంతునికంటె వైద్యుడేనా గొప్ప వాడు?

గ్రామస్థుడు.— కాడు.

సాక్రటీసు.—అట్లైన టీకాలువేయుటయు మందు ఇచ్చు టయుకూడ భగవదిచ్ఛయేనా?

గ్రామస్థుడు.—ఆలాగే కనిపించుచున్నది.

సాక్రటీసు.—గ్రామములోపల ఉంచినయెడల మిమ్ములను మీ బిడ్డలను రోగపీడితులుగ చేయు పెంట అంతయు, పొల ములలో వేయబడినపుడు మీకు రెండింతల పంట ఇచ్చుట కూడ భగవదిచ్ఛకాదా?

గ్రామస్థుడు.—అలాగే.

సాక్రటీసు. — ఇనుపనాగళ్లు పత్తియంత్ర రాట్నములుకూడ భగవదిచ్ఛవలన వచ్చినవేనా?

గ్రామస్థుడు.—అలాగేనని అనుకొనుచున్నాను.

సాక్రటీసు.—కావున మీ పంటలుపోయి మీ పిల్లలు చచ్చిపోవుచుండునపుడు, "ఇదంతయు భగవదిచ్ఛ, భగవదిచ్ఛ" అని చెప్పుటకుబదులు దీనికి కారణమేదియో తెలిసికొని, లోపములున్నయెడల సవరించుకొనుటకు ప్రయత్నింపవలెను. భగవంతు డెల్లప్పుడు మీ మేలునే కోరుచుండునుగాని, మీకు కీడుచేయవలెనని భగవంతుని ఇచ్ఛకాదు. మీ పొరపాటు వలనను, అజ్ఞానమువలనను కలుగుచుండు కష్టములన్నిటికి భగవంతుడే కారణభూతుడని యనుకొనుటకు మీ సోమరితనము, తెలివితక్కువయు నిందింపవలసియున్నది.

గ్రామస్థుడు.—నేనెల్లప్పుడు దీనిని జ్ఞప్తియుంచుకొనెదను.

సాక్రటీసు.—సర్కారును నిందించుటకూడ న్యాయము కాదు. సర్కారువారు నీవద్దనుండి భూమిపన్నును వసూలు చేయుచున్నమాట నిజమే. కాని, నీవు నీ భూమిని బాగుగ సత్తువచేసి మంచిపద్ధతిని వ్యవసాయముచేసినప్పుడు పండు పంటలో ఈ పన్ను ఇరువదవ భాగముకూడ కాదు. ఇదిగాక దీనికి బదులుగ సర్కారువారు నిన్ను సంరక్షించుచు, పాఠశాలలను, వైద్యశాలలను, రస్తాలను స్థాపించి పూర్వకాలమున మీరెవ్వరు వినికూడ యెరుగని మరెన్నియో లాభములను సమకూర్చుచున్నారు. కావున నీ అజ్ఞానమువలనను పొరపాటుల వలనను కలిగిన కష్టములకు సర్కారువారిని పాత్రులచేయ

కుము. నీ గ్రామములోని స్థితిగతులను చక్కబెట్టు మార్గము లను బోధించుటకై సర్కారువా రెంతో శ్రమపడుచున్నారు.

గ్రామస్థుడు.—మంచిది. మీరు చెప్పినదంతయు జ్ఞప్తి పెట్టుకొనెదను. ఇకమీదట భగవంతునిగాని, సర్కారువారిని గాని నిందించుటకు పూర్వము నేనే నిందకు పాత్రుడనుకానా యని చక్కగ ఆలోచించి చూచుకొనెదను.

## సౌఖ్యదములగు గ్రామములు

సాక్రటీసు.—నాయడుగారూ! నమస్కారము. ఎక్కడ నుండి వచ్చుచున్నారు?

నాయడు.—మా తోటకు వెళ్లియుంటిని.

సాక్రటీసు.—మీ తోట ఎక్కడనున్నది.

నాయడు.—ఊరిబయట—నా నూతిదగ్గర.

సాక్రటీసు.—ఇచటి కెంతదూరము.

నాయడు.—అరమైలు.

సాక్రటీసు.—అచట ఎంతకాలముంటిరి.

నాయడు.—ఒకరాత్రి మాత్రమే.

సాక్రటీసు.—మీ భార్యయు పిల్లలును అచ్చట సుఖ ముగ కాలక్షేపము చేయుచున్నారని తలచుచున్నాను. ఊరి లోని కుక్కలు, దుర్గంధము, దుమ్ము మొదలగువాని బాధలు లేక హాయిగ ఉన్నదిగదా మీ తోట మీవాండ్రుండుటకు?

నాయడు.—తాతా, మీ మాటల కర్థము తెలియుట లేదు. మీ మనస్సును ఏదో అటు ఇటు చలింపచేయు చున్నదే.

సాక్రటీసు. — ఏమీ? మీకొక తోట ఉన్నదనిగదా ఇప్పుడు చెప్పితిరి?

నాయడు.—అవును.

సాక్రటీసు.—మీరు గృహస్థులనియు, మీకు భార్యయు, పిల్లలును ఉన్నారనియు నేనెరుగుదును.

నాయడు.—అవును.

సాక్రటీసు.—అట్లైన వారు మీ తోటలో తప్ప మరెచట నుందురు? తోటలోగదా వారు శుభ్రమైనట్టియు, ఆరోగ్యకరమైనట్టియు గాలియొక్క సుఖము ననుభవించుచు పూలచెట్ల మధ్యను కూర్చుండి పువ్వుల సౌందర్యమును చూచి ఆనందించుటకు వీలగును.

నాయడు. — మా తోటలో పూలచెట్లనేకములు లేవు. మేము ఆ కనబడుచుండు ఇంటిలో కాపురము చేయుచున్నాము.

సాక్రటీసు. — తోటయొక్క సౌఖ్యమును మీవారనుభవింపనియెడల తోటయుండినందుకు ప్రయోజనమేమి? ఇప్పుడీ మీవాండ్రు ఈ గ్రామమును వదలి తోటలో కాపురము చేయుటకు మొదలుపెట్టవలెను.

నాయడు. — సాక్రటీసుగారూ! మీ కీవిషయములలో ఎప్పుడు తృప్తిగలుగునో! మేము గోతులత్రవ్వి, వానిచుట్టు దడులగట్టి వానిమధ్య చెక్కలవేసి, మరుగుదొడ్లుగ ఉపయోగించుకొనుచున్నాము. ప్రతిరోజు గ్రామమునంతయును చిమ్ముటయేగాక వారమున కొకనాడు ప్రత్యేకముగ అన్నిటిని శుభ్రపరచుచున్నాము. మీ ఆజ్ఞ ననుసరించి నేనొక పర్షియను రాట్నమును వాడుచున్నాను; నా నూతిప్రక్క కొన్ని పండ్ల

చెట్లను, కూరకాయలచెట్లను వేసితిని. మా ఆరోగ్యము బాగు పడినందునను మా పంటలు రెండింతలగుటచేతను మేము మీయెడల ఎంతో కృతజ్ఞులముగ నున్నాము. ఎక్కువ ఎరువు, పూర్వముకంటె మంచివగు నీటి సదుపాయములు, మంచి విత్తనములు, చక్కని దుక్కి, అధికములగు పంటలు—ఇవన్నియు మీ ఉపదేశమువలన కలిగినవే. ఇంతకంటె మీకేమి కావలెను?

సాక్రటీసు.—మీరు చెప్పునట్లు మీ గ్రామము పరిశుభ్రముగనే యున్నది; దుర్వాసనలేదు; మరుగుదొడ్లుగ నుపయోగింపబడు గోతులు (ముఖ్యముగ మీ స్త్రీలకు) వరప్రసాదములని చెప్పదగియున్నవి. కుక్కల స్థితికూడ బాగుపడినది; మీలో ఒక్కొకరికి ఒకటో రెండో కుక్కలున్నవి; ప్రతి కుక్కకు మెడచుట్టును ఒక పట్ట, ఉండుటకు ప్రత్యేకమగు స్థలము, చక్కని ఆహారము, ఏదో ఒక పేరు, మంచి తర్ఫీదు—చేకూర్చితిరి; ఇవన్నియు ప్రశంసింపదగినవే.

నాయుడు.—మేమందరము ఈ పనులను చేయుచున్నాము. ఇవన్నియు అలవాటుపడుటకు చాలకాలము పట్టినను, ఇందుకై మీ ప్రోత్సాహము నిర్బంధము విశేషము కావలసియుండినను తుదకు ఈ క్రొత్త పద్ధతులన్నియు మాకు నచ్చినవి.

సాక్రటీసు.—కాని ఇప్పటికిగూడ గ్రామము పరిపాకము పొందలేదు. దారివెంట నడుచునప్పుడు గ్రామమందేదో పొందిక చెడియున్నట్లును, ఎగాదిగ అయినట్లును నాకు కనబడుచున్నది. దీనినిబట్టి మీ రెన్నటికికూడ సౌఖ్యము ననుభవింపలేరను సంతాపము కలుగుచున్నది.

నాయుడు.—మీకు కనబడుచుండు లోపమెట్టిది?

సాక్రటీసు.—మీ వీధులు చాల ఇరుకుగ ఉండుటయే మొదటిలోపము. అనేక వీధులలో ఒక బండి నడుచుటకు కూడ వీలులేదు. ఎదురెదురుగ రెండుబండ్లు వచ్చినయెడల వాని అవస్థ ఇంతింతకాదు. అదృష్టవశమున మీరందరు శాంత స్వభావముగలవారు; కానియెడల అట్టి బండ్లు ఎదురైనపుడెల్లను పోట్లాటల తప్పకుండును.

నాయడు.—అవును. మా వీధులు ఇరుకైనవే. వీధుల లోనికి ఆనుకొనివచ్చునట్లు ఇండ్లను కట్టువారి నాపుట కెవరి కిని అధికారములేదు. విశాలములగు వీధులలోకూడ అనేకులు ఇంటినుండి వీధిలోపలికి మెట్లు అరుగులు వేసికొనుచుందురు. అట్టివారి నడ్డగించువా రెవ్వరులేరు.

సాక్రటీసు.—ఇదేకాదు. ఇండ్లప్రక్కన మురుగునీళ్ల కాలు వలు పారుచుండును; ఇండ్లకు బయట — వీధులందంతట— మురుగునీళ్ల గుంటలే. చూచుట కివి చాల అసహ్యములు.

నాయడు.—వీనిని ఆపుట యెట్లు?

సాక్రటీసు. — ఇది చాల కష్టమైన పనియని నేనెరుగు దును. ఇండ్లను ఆనుకొనియుండు మురికినీళ్లగుంటల నప్పు డప్పుడు శుభ్రపరచుట కా యిండ్లవారు పూనుకొనవలెను; ఇండ్ల ప్రక్కన కాలువలను పారనియ్యకూడదు. నీళ్లతో కూడిన పనులనన్నిటిని సాధ్యమైనంతవరకు నూతులదగ్గర చేయుట మంచిది. నూతిదగ్గరనుండి కాలువ నొకదానిని కట్టి నీరంత యును సమీపముననుండు పూలపాదులోనికి పారునట్లు చేసిన యెడల, అది ఆ పాదులో ఇంకిపోవును.

నాయడు.—దీనియందసాధ్యమేమియులేదు; కాని ఇది జరుగవలయుననిన స్త్రీలు, పిల్లలు స్నానముచేయుట కుపయోగించు గదులను నూతులచుట్టు కట్టవలసియుండును.

సాక్రటీసు.—ఏల కట్టకూడదు? మీ స్త్రీలు పడుచుండు కష్టములకు లెక్కలేదు. ఇంటి పెరడులను తేమగిల్లి అశుచి చేయక వారు స్నానముచేయుటకు వీలులేదు. మీ స్త్రీలును, పిల్లలును అశుభ్రముగనుండుట కిదియే కారణము.

నాయడు.—నిజము. మీకు తృప్తికలుగుటకై మా స్త్రీలు పిల్లలు ఉపయోగించతగినట్లు ఒక స్నానాల గదిని మంచినీళ్ల బావివద్ద కట్టెదము.

సాక్రటీసు.—మంచిది. పట్టణమందుండు "స్త్రీల ఉద్యాన వనము" పద్ధతిని, మీ గ్రామములోకూడ ఒక తోటను వేయ వచ్చును.

నాయడు.—ఏమిటిది ఆ వనము?

సాక్రటీసు.—ఏమిటా? ఇదివరకా తోటయందు పురుషులుమాత్రమే విహరించుచుండిరి. కాని బుద్ధిమంతులు కొందరు అచటనుండి పురుషులను పారదోలి స్త్రీల ఆరోగ్యసౌఖ్యములు వృద్ధియగుటకొరకు దానిని స్త్రీల యుద్యానవనముగ మార్చిరి.

నాయడు.—నేను వెళ్లి దానిని చూచి తీరవలెను.

సాక్రటీసు.—నీవు వెళ్లవద్దు. దానిని చూచుటకు నీ భార్యను పంపుము.

నాయడు.—పంపెదనుకాని దానివలన ఆమెకెట్టి లాభముండదు. ఆమెకేదియు తెలియదు.

సాక్రటీసు.—అట్లు చెప్పకు. మీరనుకొనునంత జ్ఞాన హీనురాలుకాదు ఆమె. తనయొక్కయు, తన పిల్లలయొక్కయు సౌఖ్యము వృద్ధియగుటకు కావలసిన సౌకర్యముల సంపాదించు కొనుటయందు ఆమెకు ఎక్కువ ఉత్సాహము కలదు. పట్టణ మందలి స్త్రీసమాజ సభ్యురాండ్రు చెప్పవలసిన విషయముల నన్నిటిని ఆమెకు చెప్పెదరు.

నాయుడు.—అట్లైన నే నీపర్యాయము పట్టణమునకు వెళ్లు నప్పుడు ఆమెనుకూడ తప్పక తీసికొనిపోయెదను.

సాక్రటీసు.—ఇరుకైన వీధులగురించి ఇంకను చెప్పవలసి నది చాల ఉన్నది. నేనా విషయము నింకను ముగింపలేదు.

నాయుడు.—సెలవిండు.

సాక్రటీసు.—వీధులు ఇరుకుగ నుండుటచేత, మన మెవర మైన వీధులలో నడుచునపుడు పెంటగంపను తలపై పెట్టు కొని ఏ స్త్రీగాని ఎదుటనుండి వచ్చుచున్నయెడల—"మానము" గలవారమని విఱ్ఱవీగు పురుషులు పెంటను మోయరుగదా— గంపలోనుండి పైకెగురు దుమ్ము మన గొంతులోపలికి పోవును.

నాయుడు.—నిజమే.

సాక్రటీసు.—ఇట్టిది అనావశ్యకము కదా?

నాయుడు.—అనావశ్యకమా? ఎట్లు. మీరేగదా ఉప దేశము చేసితిరి—మా ఇండ్లు, గ్రామము శుభ్రముగ ఉండ వలయుననిన వానిని మేమే శుభ్రపరచుకొనవలెననియు పాకీ వారిచే శుభ్రముచేయించ కూడదనియు—? మా స్త్రీలు పెంట గంపలను తలపై బెట్టుకొని వీధులవెంట నడుచుట తప్పునా? ఈ కష్టము తప్పిన బాగుండునని వారు కోరుచుండుమాట వాస్తవమే.

సాక్రటీసు.—నా ఉపదేశము చాల మంచిదికదా? గ్రామమును శుభ్రపరచుటకు తగినవాడు రైతు. దానిమూలమున కలుగు లాభమును — హెచ్చు ఎరువువలన ఎక్కువ పంటలు, పరిశుభ్రతవలన ఆరోగ్యము—అనుభవించువా డతడే. మీ ఆరోగ్యమందుగాని, పంటలయందుగాని ఆసక్తిలేని పాకీవానికి వీధులను ఊడ్చుటకు శ్రద్ధయే యుండజాలదు. రైతు లతనిపై ఎంత కోపపడినను వారివలె అంత చక్కగ అతడు వీధులను శుభ్రపరుపజాలడు.

నాయడు.—అవును, అవును. కాని ఈ విషయమై ఇప్పుడు మీ యుపదేశ మక్కరలేదు. తలలపై మేము పెంట గంపలను పెట్టుకొని మోసికొనిపోకుండు ఉపాయమును మీ రేమైన చెప్పగలరా?

సాక్రటీసు.—శబాస్! మీరా మీ భార్యలా మోసికొనిపోవుచుండుట! మీరు మోయుటను నేనెప్పుడు చూడలేదే.

నాయడు.—దానికేమి? నా భార్యయే మోయుచుండును. ఏదీ మీ ఉపాయము.

సాక్రటీసు.—గంపలకు బదులు త్రోపుడుబండ్ల నుపయోగించవచ్చును. మీ ఊరి వడ్రంగి ఆ బండ్లనుచేయుట సులభముగ నేర్చుకొనగలడు. తలపై నాలుగైదు తడవలు మోసికొనిపోవలసిన పెంటను బండిమీాద ఒక తడవకే తీసికొనిపోవచ్చును. ఇదిగాక గంపలోనుండి పడుచుండు పెంటచే, నీ —— యొక్క తలవెంట్రుకలును బట్టలును చెడిపోవునను —కూడ ఉండదు.

నాయుడు.—సాక్రటీసుగారూ, నేను మీకు చాల కృతజ్ఞుడను. మీ సలహా చాల ప్రశస్తమైనది. దానిప్రకారము ఆచరించి చూచెదను.

సాక్రటీసు.—మంచిది. ఉన్నతమగు నీ తలపై నీచమైన పెంటగంపను పెట్టుకొనిపోవలసిన అవసరము తీరుటచే నీవు కూడ ఒక్కొకప్పుడు ఆ బండిని తోయుచు, శక్తికిమించి పని చేయు నీ భార్యననుగ్రహించి కొంతవరకు ఆమెకు తోడ్పడెదవను నమ్మకము కలుగుచున్నది.

నాయుడు.—ఏలాగైననేమి? ఈ విషయములో మీరు చాల పట్టుదలగలిగియున్నారు గనుక నేనుకూడ తప్పక ప్రయత్నముచేసెదను.

సాక్రటీసు.—మీ గ్రామములోని లోపములను లెక్కపెట్టు పని ఇంకను పూర్తికాలేదు సుమీ.

నాయుడు.—మరేమియున్నది.

సాక్రటీసు.—ఎలుకలకును, పాములకును ఆశ్రయమైన పాడుపడిన ఇండ్లు ఎన్నియోయున్నవి. వీధులు, ఖాళీప్రదేశములు మిట్టపల్లములుగను చూచుటకు మిక్కిలి అసహ్యములుగను ఉన్నవి. మీరును మీ బాలభటులును కొంత తీరుబడి చేసికొని దీనినంతయును సమముగ చేసినయెడల, మీ పిల్లలు పరుగెత్తుటకును, ఆడుకొనుటకును అనుకూలముగ నుండును. పాడుపడిన ఇండ్లను కొట్టివేసి, నేలను చదరముచేసి, గ్రామమునంతయు చూచుటకు సొగసుగనుండునట్లు గావించి, వీధుల మీదను సందులలోను ఇటికలనో, రాళ్లనో పేర్చి చక్కచేయవలెను.

నాయడు.—ఇది కష్టమైన పనికాదు. ఒక పర్యాయము చేసినయెడల, ఎంతకాలమువరకో స్థిరముగనుండును.

సాక్రటీసు.—నాయడుగారూ! అట్లైన మీరు శీఘ్రముగ ఈ పనిని చేయవలెను.

నాయడు.—తప్పక చేసెదను.

సాక్రటీసు.—మీరు గ్రామమున కొక మైలుదూరమున తోటవేయుటకు కారణమేమి? మీ గ్రామమునే ఒక తోటగ మార్పరాదా?

నాయడు.—ఏలాగు?

సాక్రటీసు.—నాకుగూడ బాగుగ తెలియదు. కాని మీ రొక పనిని చేయవచ్చును. మీ నూతులకు సమీపమున మీ రిండ్లుకట్టుకొని, వానిచుట్టును పూలచెట్లను నాటవలెను. మీ పశువులనుకూడ అచటనే కట్టివేయవచ్చును. ఇట్లు చేసిన యెడల గ్రామనత్తమందుండువారి సంఖ్య తగ్గును; వారుకూడ విశాలములగు ఇండ్లను కట్టుకొని విశాలములగు వీధుల నేర్ప రచుకొని ఇండ్లముందును వెనుకను తోటల వేసికొనుట కవ కాశము కలుగును అట్లే ఖాళీప్రదేశములచుట్టును గోడలు కట్టి, లోపల పూలచెట్లను వేయవచ్చును. అట్టి ప్రదేశముల చుట్టును ముండ్లకంపలను వేయకూడదు; ముండ్లకంపల మూల మున పెంట చేరును; వీధులు ఇరుకగును; ఏదైన ఇంటికి నిప్పు అంటుకొని గాలికొట్టినట్లైన చుట్టుప్రక్కలనుండు ఇండ్లకు ఆ మంటలు వ్యాపించును.

నాయడు.—ఇదంతయు వినుటకు చాల సొంపుగనున్నది; చేయుటకూడ కష్టముకాదు. కాని, ఖాళీప్రదేశములచుట్టును

గోడలు కట్టినంతమాత్రమున లోపల పూలచెట్లు వేయుటకు వీలెట్లు కలుగును?

సాక్రటీసు.—రెండడుగుల ఎత్తుగల గోడ చాలును; దీని మూలమున పశువులను రాకుండ చేయవచ్చును. స్నానాదులకు బావిలోనుండి చేదబడు నీళ్లు పూలచెట్లను పెంచుట కుపయోగించును.

నాయుడు. — ఇదికూడ కష్టమైనది కాదు. కాని కొంత కార్యోత్సాహము ఐకమత్యము ఉండవలెను. మా గ్రామములందు ఈ రెండును చాల తక్కువగనున్నవి.

సాక్రటీసు.—అవును. మీ కార్యోత్సాహమంతయు చుట్ట త్రాగుటయందును, పరస్పరవైషమ్యములు సాగించుటయందును వినియుక్తమగుచున్నది. కాని, మీ పాఠశాలోపాధ్యాయుడును బాలభటులును ఈ తోటపని నేల చేయకూడదు?

నాయుడు.—ఇది సాధ్యమే. రానురాను ఈ బాలభటులు ఎక్కువ నేర్పరులై పరోపకారమం దెక్కువ శ్రద్ధను చూపించుచున్నారు. ఇదిగాక మా ఉపాధ్యాయుడుకూడ ట్రెయినింగు స్కూలునం దిట్టి శిక్షను పొందినవాడే. ఆయనకు తెలియని విషయములుగాని ఆయన చేయలేని పనులుగాని అనేకములు లేవు. ఇనుపనాగలిని బాగుచేయుటకును దానితో చక్కగ దున్నుటకునుకూడ అతనికి తెలియును. నా మనసుకువచ్చిన ఉపాధ్యాయు డతడే.

సాక్రటీసు.—శబాస్. ఆ ట్రెయినింగు పాఠశాల నాకు తెలిసినదే. పల్లెటూళ్లలో కాపురము సుఖతరముగ చేయు పద్ధతుల నచట నేర్పెదరు. అచట శిక్షితులైన ఉపాధ్యాయులు

మీ మనసుకువచ్చినవారని వినుట నాకెంతో సంతోషము. కావున మీ ఉపాధ్యాయునితో ఆలోచించి, మీ గ్రామమును ఇప్పటికంటె ఎక్కువ నివాసయోగ్యమైనదానినిగ చేసికొనుటకు మార్గమును వెదకుము.

నాయుడు.—ఆలాగే చేసి, మీకు మరింత సంతోషమును కలిగించెదము.

సాక్రటీసు.—నాయుడుగారూ! నాకు వేరు సంతోషమక్కర లేదు. మీరు సౌఖ్యపడుటయే నాకు సంతోషము.

## బి.ఏ., బి.ఎల్.

యథాప్రకారము సాక్రటీసు గ్రామచావడివద్దకురాగా తెల్లదొరలు వేసికొను బట్టలను తగిలించుకొని కొంచెము బెట్టుగ గ్రామపెద్దలతో మాటలాడుచుండిన ఒక యువకుడు అతని కంటబడెను. ఆ యువకునికి ఊరిపెద్దలందరు చాల గౌరవమును చూపుచుండిరి. వారు మామూలు చుట్టలను త్రాగుచున్నను అతడుమాత్రము సిగరెట్లను త్రాగుచుండెను. సాక్రటీసు పెద్దలకు నమస్కారముచేసి అతనివైపు తిరిగి "గుడ్ ఈవినింగ్", అని అనెను.

పెద్దరెడ్డి.—సాక్రటీసుగారూ, నమస్కారము. ఇతడు నా పెద్దకుమారుడు; బి.ఏ., బి.ఎల్., ప్యాసైనవాడు.

సాక్రటీసు.—ఆలాగా? చాల సంతోషము. ఇతడు న్యాయశాస్త్రమును చదువుకొనినవాడుగదా? ఇతని మూలమున నీకు మంచి పేరువచ్చునని నమ్ముచున్నాను.

పెద్దరెడ్డి.—అవును. ఇతడిప్పుడొక ప్లీడరు.

సాక్రటీసు.—అట్లైన కోర్టులకెక్కుట నిష్ప్రయోజనమని మీకు బోధించుటకై ఇతడిక్కడికి వచ్చినాడని తలచెదను.

పెద్దరెడ్డి.—కాదు, కాదు. మా గ్రామములోని కేసులన్నిటిని తన కియ్యవలెనని చెప్పుటకై అతడిక్కడికి వచ్చియున్నాడు. ప్రియబంధువులారా! మీరందరు మీ కేసులను నా కుమారునికి తప్ప మరెవ్వరికి ఇయ్యకూడదు. ఓయి నాయడూ, నీ భూమిని ఆక్రమించిన ఆ దుర్మార్గునిపై దావాచేయుట కిదియే మంచిసమయము. నా కుమారుని విద్యాభ్యాసమునకై నేనెంత ఖర్చుపెట్టవలసివచ్చెనో భగవంతునికే తెలియును. దానికి తగిన ఆదాయము రావలెనుగదా?

నాయడు.—అవును. ఆ దావానుగురించి ఆలోచించుట కిదియే తరుణము.

సాక్రటీసు.—అట్లైన ఇతడు ఫీజేమియు పుచ్చుకొనక మీకు సహాయము చేయునుగదా?

తండ్రియు, కొడుకును.—(కలసి) ఏల? ఫీజు పుచ్చుకొనవలసినదే. మేముమాత్రము జీవించవద్దా?

సాక్రటీసు.—ఇతని న్యాయశాస్త్రాభ్యాసముయొక్క ఫలితము, దావాలను అధికముచేయుటయు, ఇప్పటికే వైషమ్యములతోడను దారిద్ర్యముతోడను నిండిన ఈ గ్రామములో మరి కొన్ని వైషమ్యముల పుట్టించి గ్రామస్థులను మరింత దరిద్రులుగ చేయుటయేనా?

తండ్రి.—కోర్టులకెక్కుట పాడుపనియని నేనెరుగుదును కాని, నే నేమిచేయగలను? ఈ నా కుమారుడు కాలేజికి వెళ్లి

న్యాయశాస్త్రాభ్యాసము బహుజనాదరణీయముగ నుండుట కను గొనెను. అనేకులా శాస్త్రమునే అభ్యసించుచుండుటచేత ఇతడుకూడ అట్లే చేసెను.

సాక్రటీసు. — అతడు డాక్టరగుటకో ఇంజినియరగుటకో ఏల ప్రయత్నింపలేదు?

తండ్రి.—ఆ పరీక్షలు చాలకష్టములైనవి; వానికై చదువుట కెక్కువకాలము పట్టును. ఇంతేగాక వీరికంటె ప్లీడర్లకు దేశమందెక్కువ గౌరవమని నా కుమారుడు చెప్పుచుండువాడు.

సాక్రటీసు.—ఎందువలన?

తండ్రి.-ప్లీడర్లు ఇష్టమువచ్చినట్లు మాటలాడవచ్చుననియు, చాలమట్టుకు ఇష్టమువచ్చిన పనినిచేయవచ్చుననియు, ఎవరియెడలను గౌరవమును చూపింపవలసినదిలేదనియు, ఎవరిని లక్ష్యపెట్టవలసినదిలేదనియు, నా కుమారుడు చెప్పువాడు. ఎట్టి నిబంధనలుగాని, కట్టుదిట్టములుగాని లేని "ప్లీడర్ల సంఘమున" చేరి, ఇష్టమువచ్చినపుడుమాత్రము పనిచేసి కావలసినంత విశ్రాంతితో ఎక్కువ ఫీజులను సంపాదించుటకు వీలగుననియు, మొత్తముమీద లాయరువృత్తి చాల సుఖకరమైనదనియు అతని అభిప్రాయము.

సాక్రటీసు. —ప్రతి యువకుడును ప్లీడరైనయెడల వారికి జీవనోపాయమెట్లు?

తండ్రి.—నాకు తెలియదు కాని, దావా లనేకములున్నవి మా బంధువులందరు అతనికేదో పనిని కల్పించుచుందురు.

సాక్రటీసు.—ప్లీడరుగారూ! నిజముగ మీ వృత్తి ఏమి-టిది?

ప్లీడరు.—కోర్టులలో కేసులనుగూర్చి వాదించుట.

సాక్రటీసు.—దాని ఫలితమేమి?

ప్లీడరు.—ఏ పక్షమో ఒక పక్షము గెలుచుట.

సాక్రటీసు.—రెండవపక్షము ఓడిపోవుటయేనా?

ప్లీడరు.—దానికి సందేహమేమి?

సాక్రటీసు. — రెండుపక్షములవారికి ద్రవ్యనాశనమన్న మాటయేనా?

ప్లీడరు.—అవును.

సాక్రటీసు. — అనగా మీ వృత్తి, ఇతరుల ధననాశనము-నకు సహాయముచేయునట్టిది?

ప్లీడరు.—ఆలాగే కనిపించుచున్నది.

సాక్రటీసు.—డాక్టర్లవలె మీ రెవరికిగాని సహాయము చేయుటలేదుగదా?

ప్లీడరు.—లేదు.

సాక్రటీసు. — ఒక యంత్రమునుగాని, వంతెననుగాని మీరు నిర్మింపలేరుగదా?

ప్లీడరు.—నిర్మింపలేము.

సాక్రటీసు. — ఉపాధ్యాయుడు — మతోపన్యాసకుడు — వీరివలె మీ రితరులను ఉత్తమస్థితికి తేలేరుగదా?

ప్లీడరు.—తేలేము. అంతేగాక కోర్టుల యనుభవమువలన జనులు మరింత చెడ్డవారగుచుందురు.

సాక్రటీసు.—అట్లైన మీరు దేనినీ ఉత్పత్తిచేయుట లేదు కదా? మీ పరిశ్రమ లాభకరమైనదికాదని చెప్పవచ్చునా?

ప్లీడరు.—చెప్పవచ్చును.

సాక్రటీసు.—ఇతరుల కష్టములును, కలహములును మీకు జీవనాధారములని చెప్పుట న్యాయమేనా?

ప్లీడరు.—అవును.

సాక్రటీసు.—అనగా మీ వృత్తికి పరపీడనమే ఆశ్రయము. ఈగలు, దోమలువలె ఇతరుల రక్తముపై జీవించుచు, వారికెట్టి ప్రత్యుపకారము చేయకుండుటయే మీ లక్షణము.

ప్లీడరు.—మీ మాటలు చాల కఠోరములుగ నున్నవిగాని వానియందు సత్యము లేకపోలేదు.

సాక్రటీసు.—ప్లేగుపురుగువలె మీరు ఎంతటి హానినైనను చేయగలిగియుందురు. కోర్టులకెక్కుటవలన ప్రజలలో ఒక్కొక్కప్పుడు అల్లరులును కూనీలునుకూడ జరుగుచుండును గదా?

ప్లీడరు.—నిజమే. కాని కాలేజిలో మా ఉపాధ్యాయులు నేర్పిన దిదికాదు.

సాక్రటీసు.-దానికేమి? శాస్త్రములను నేర్పుటకేగాని ప్రపంచపు నిజమైన స్థితిగతులను నేర్పుటకు వారు జీతములు పుచ్చుకొనుటలేదు. రెడ్డిగారూ, ఈ కోర్టువ్యాజ్యములగురించి మీ అభిప్రాయమేమి? ప్లీడర్లకిచ్చు ఫీజులుతప్ప మరెట్టి ఖర్చులు మీకు తగులుటలేదుగదా? కేసు మీ పక్షమైనయెడల ఈ ఖర్చులన్నియు కట్టివచ్చునని తలచుచున్నాను.

తండ్రి.—ఇట్లైన మాది అదృష్టమే. కాని, ప్లీడర్ల ఫీజులు మాకగు మొత్తపు ఖర్చులలో చాల స్వల్పభాగము. గెలిచినను,

ఓడినను మాకు లాభములేదు. సాక్షులను సమకూర్చుకొని, వారి సాక్ష్యమును తయారుచేయించుటయందును; కోర్టులకు రాకపోకలయందును; కాపీలు, స్టాంపులు కొనుటయందును మేము పడు శ్రమ బ్రహ్మదేవునికే ఎఱుక. మా కాలము వ్యర్థమగుచున్నది; మనసునందు మేము పడు దిగులును, ఈ సంబంధమున మేముచేయు ధనవ్యయమును వర్ణించుటకు వీలు కాదు. ఆఖరున ఉభయపక్షములవారు కొట్టుకొనుట, పోలీసు వారు వచ్చుట, వ్యాజ్యము తిరిగి ప్రారంభమగుట—దీనికంతకు అంతములేదు.

సాక్రటీసు.—ఇట్టి నిరుపయోగమైనట్టియు బహుళ సంఖ్య గలిగినట్టియు వృత్తికంటె వ్యవసాయము, వైద్యము మొదలగు ఉపయోగములగు వృత్తులలో నొకదానిని మీ పిల్లలకు నేర్ప కూడదా?

తండ్రి.—నేర్పనచ్చును; కాని తల్లిదండ్రులమాటను ఈ కాలమందు పిల్లలు వినుటలేదు.

సాక్రటీసు.—తల్లిదండ్రులు గౌరవార్హులు కాకుండుటయే గదా దీనికి కారణము? మీరు చదువుకొననివారు; మీరు అశుచిగనుందురు; పూర్వాచారములకు మీరు దాసులు. కావున మీ పిల్లలు విద్యావంతులైన నిమిషమున మీ అధికార మంతయు శూన్యమైపోవుచున్నది. ఇది పునాదిలేని అధికారము. అందుచేతనే మీ పిల్లలు పెద్దవారు కానుకాను మీరు వారికంటె తెలిసినవారని మిమ్ముల నెక్కువగా గౌరవించుటకు బదులు మిమ్ములనుచూచి పరిహాసముచేయుట వారికి స్వభావ మగుచున్నది.

తండ్రి.—మీ మాటలయందు చాల సత్యమున్నది. పలు మార్పులకు లోనగుచున్న ఈ ప్రపంచమున ముసలివాండ్ర మగు మేము ఒక జమాఖర్చుకు రానివారము.

సాక్రటీసు. — ప్రాతకాలపు దురాచారముల పట్టుకొని ఊగులాడుచు పురోభివృద్ధికి అడ్డుతగులుటయందుమాత్రము మీరు లెక్కకు వచ్చుచున్నారు. మంచి ఆచారములను బహు సులభముగ విడిచిపెట్టి, దురాచారములను పట్టుకొనియుండు టయే మీ స్వభావము.

తండ్రి. — ఇదికూడ నిజమే. మా లోపముల నన్నిటిని చాల లోతుగ పరిశీలించు శక్తి మీకు కలదు.

సాక్రటీసు. — సరే దానికేమిగాని ఈ మీ కుమారుని ప్లీడరువృత్తి విషయమేమి? కేసులనేకములనిచ్చి అతనికి ప్రోత్సాహము కలిగించుటకు బదులు అతనిని మీ యింటిలోనుంచు కొని ఏపనియు లేకుండచేయుట సులభమును లాభకరమును గదా?

తండ్రి. — లాభమే. కాని, బి.ఏ. లగు మా పిల్లలు పల్లెటూళ్లలో కాపురముచేయజాలరు. వారి స్వభావము శాంతిని కోరునట్టిదికాదు; అందుచేత పల్లెటూళ్లు వారికి రుచించవు.

సాక్రటీసు.—(నవ్వుచు) నేనీ విషయమున బి.ఏ. అయిన మీ కుమారునితో ఏకీభవించుచున్నాను.

తండ్రి.—ఏల? మీరుకూడ ఈలాగు సెలవిచ్చుచున్నారు? గ్రామము పుట్టినప్పటినుండి మా పూర్వులందరును నేనును ఇక్కడ సుఖముగ కాలక్షేపము చేయుచుంటిమిగదా? నా కుమారునికిమాత్ర మిది రుచింపకుండుటకు కారణమేమి?

సాక్రటీసు.—రెడ్డిగారూ, కాలము మారుచుండును. నీ కుమారునికి నీ చుట్టలు రుచింపవు; నీకు అతని సిగరెట్లు రుచింపవు. కుర్చీమీదగాని అతడు కూర్చుండడు; విదేశవస్త్రముల ధరించుట అతని కలవాటైనది. నీవన్ననో నేలమీద కూర్చుండెదవు; ఖద్దరుబట్టలను కట్టుకొనుచుందువు. కావున మీ ఇద్దరికి పొందు పొసగదు. రోజును వార్తాపత్రికను చదివినగాని అతనికి తృప్తిలేదు; అప్పుడప్పుడు నాటకమునకో, సినిమాకో అతడు వెళ్లవలయునని కోరుచుండును. మీ వీధులు ఇరుకైనవి; మీ గ్రామము అసహ్యముగను, అపరిశుభ్రముగను ఉన్నది; అతడన్ననో పెద్ద కాలేజీభవనములు, విశాలములగు వీధులు, పట్టణములోని గొప్ప బజారులు చూచినవాడు.

తండ్రి.—తీవ్రవేగమున కలుగుచుండు ఇప్పటిమార్పుల ననుసరించి వెళ్లుట మావంటి (ఛాందసులకు) చాల కష్టమైన పని.

సాక్రటీసు.—కష్టముకాదు. మీరు ప్రయత్నమే చేయుట లేదు. మీ గ్రామమును శుభ్రపరుపవలెననియు మీ ఆడుపిల్లలకు చదువు చెప్పింపవలెననియు నేనెంతకాలముగ మీ కుపదేశము చేయుచున్నాను?

తండ్రి.—ఈ విషయమున దీనివలన కలుగు ఫలమేమి?

సాక్రటీసు.—ఆలాగా? మీ కోడలు మీ కుమారునివలె చదువుకొనినదైనయెడల, వారిద్దరు సమానభావములును, సమానమైత్రియు కలవారగుదురు. ఆమె అతని కిష్టమువచ్చినట్లు ఇంటిని చక్కబెట్టి అతనికి రుచించురీతిని వంటచేయగలదియగును. ఇప్పుడన్ననో ఆమె చాకిరిచేయుదానివలె నున్నది; వంటను చక్కగ చేయజాలదు; ఇంటిని సొగసుగ పెట్టుకొన

లేదు. ఇదిగాక మీ కుమారుని అభిప్రాయములు భావములు ఆమెయొక్క అభిప్రాయములు భావములకంటె చాల భిన్నములుగ నున్నవి.

తండ్రి.—అవును. నా కుమారునికి వివాహము చేసినపుడు నేను దీనినిగురించి ఆలోచించినవాడనుకాను. మేము చిన్నవారముగనుండినపుడు మాకిట్టి అభిప్రాయములు లేవు; స్కూలునకు కాలేజికిపోయి చదువుకొనినంతమాత్రమున ఇట్టి క్రొత్త అభిప్రాయములు నా కుమారునికి కలుగునని నేను తలపలేదు. నేను నా కుమారునికి పెండ్లిచేసిన ఈ పిల్ల, కష్టపడి పనిచేయునది అనియు పిడకలుపెట్టుటయందును, వడ్లదంచుటయందును నేర్పుగలదనియు ఇంతకంటె మరేదియు కావలసినదిలేదనియు ననుకొంటిని.

సాక్రటీసు.—నీ కుమారుడు ఇంగ్లీషు న్యాయశాస్త్రములలో బి.ఎ., బి.ఎల్., అతని భార్య వడ్లుదంచుటయందు బి.ఏ., పిడకలుపెట్టుటయందు బి.ఎల్., అట్టివారిద్దరికి పొందిక కుదురుట ఎట్లు? ఇరుగు పొరుగు స్త్రీలకంటె ఎక్కువ నగలను పెట్టుకొనుట యొకటియే ఆమె యుద్దేశము; అందుకై భర్త సంపాదించునదంతను ఆమె ఖర్చుపెట్టుచుండును. (ప్లీడరగు) ఆమె భర్త ఎక్కువ ఆదాయము గడించను గడించను వ్యాజ్యముల కొరకై ప్రజలెక్కువ డబ్బును వ్యర్థపరుచుచున్నారనియే గదా అర్థము.

పెద్దరెడ్డి.—మీరు చెప్పుమాటలు వినుటకెంత హితవుగ లేకున్నను చాల సత్యముతో కూడుకొనియున్నవి. కోర్టులకెక్కుట ధనమును వ్యర్థముచేయుటయే; నగలుకూడ ఇట్టివే.

సాక్రటీసు.—మీ గ్రామములను ఇండ్లను నివాసయోగ్యములుగ చేయువరకును, మీ కుమారులతో సమానముగ మీ కుమార్తెలకుకూడ చదువు చెప్పించునంతవరకును, ఈ విద్యాభ్యాసమంతయు నిరర్థకము. దీని మూలమున మీ కుమారులు తమ ఇండ్లయెడల అసంతుష్టుని చూపుచు, స్వగ్రామములను వదలి, విస్తారధనము ఖర్చుపెట్టి మీరు వారికి చెప్పించిన చదువు వలన వారికికలిగిన జ్ఞానమునంతయును పట్టణములందు వినియోగపరచుటయే ఫలితమగుచున్నది.

పెద్దరెడ్డి.—ఇదంతయు నిజమనియే తోచుచున్నది.

సాక్రటీసు.—తోచుటమాత్రమేకాదు. ఇది తప్పక నిజము. ఇది నిజమన్నమాట మీరెంత శీఘ్రముగ గుర్తెరుగుదురో అంత ఎక్కువగ మీకు శ్రేయస్సు కలుగును.

## శిశువులకు శిశువులు

సాక్రటీసు వీధివెంట వెళ్లుచుండగా ఎదుటనుండి ఒక పెండ్లి యూరేగింపు వచ్చుచుండెను. పెండ్లికుమారుని తండ్రిని అతడు చూచి అభినందించుచు,

సాక్రటీసు.—మీ కుమారుడు చాల అదృష్టవంతుడు.

తండ్రి.—ఏల?

సాక్రటీసు.—ఎన్నిబండ్లు, ఎన్నినగలు! ఇంతటి ఐశ్వర్యముతో అతడు గృహస్థధర్మములను ప్రారంభించుటకంటె అదృష్టమేమున్నది?

తండ్రి. — ఇదంతయు అప్పుదీసి చేయుచున్న విభవము. నేనీ పెండ్లికిగాను రెండువేల రూపాయలు అప్పుచేసితిని.

సాక్రటీసు.—అట్లైన అప్పును మెడకు కట్టుకొనియా నీ కుమారుడు గృహస్థుడగుట?

తండ్రి.—అవును. నేనుకూడ అలాగే చేసితిని; నా తండ్రి కూడ అట్లే చేసెను.

సాక్రటీసు.—కాని, ఇది చాల పొరపాటుకదా?

తండ్రి.—ఇది మా ఆచారము.

సాక్రటీసు.—యావజ్జీవము నీ కుమారుని ఋణగ్రస్తుని జేయుటకంటె కొంచెము దూరాలోచనగలవాడవై ఈ దురాచారమును మానివేయుట మంచిదిగదా?

తండ్రి.—మంచిదేగాని ఇది చాల కష్టము.

సాక్రటీసు.—నీ కుమారుడు ఈ బుద్ధితక్కువ పనికి సమ్మతించెనా? అతడు చదువుకొనిన నవనాగరికుడని నేను తలచుచున్నాను. పెండ్లికొరకు నీవింత సొమ్ము ఖర్చు పెట్టుచుండుటచే నీవాతని విద్యకై దీనికి రెండింతలుసొమ్ము ఖర్చుపెట్టితివనియు, విద్యావంతుడగుటచే అతడీ అప్పును తీర్చుకొనగలవాడనియు నేననుకొనుచున్నాను.

తండ్రి.—మీ మాటలు నా కర్థముగుటలేదు. అతడు రెండవ తరగతిలో చదువుచున్నాడు; అతని చదువునకై విశేష వ్యయములేదు.

సాక్రటీసు. — ఏమి ఆలాగు చెప్పుచున్నారు? నీ కుమారుడు పెద్దవాడుగదా? ఇంకను రెండవ తరగతిలోనా యున్నాడు? అతడేమి అంత మందుడా?

తండ్రి. — ఏల ఇట్లువెదరు? అతడు చాల తెలివిగల పిల్లవాడు.

సాక్రటీసు.—నీ మాటలు చాల గూఢములుగ నున్నవి. ఒకమారు అతనికి పెండ్లియనియు, మరియొకమారతడు పిల్లవాడనియు చెప్పుచున్నావు.

తండ్రి.—ఇందులో గూఢమేమున్నది.

సాక్రటీసు.—పిల్లవాండ్రు పెండ్లిచేసికొనెదరా?

తండ్రి.—చేసికొనకేమి? నాకు పండ్రెండు సంవత్సరముల వయస్సున పెండ్లి అయినది; నా తండ్రికికూడ ఆ వయస్సుననే పెండ్లి జరిగినది. ఇందులో వింత యేమియున్నది.

సాక్రటీసు.—పిల్లలకు విద్యాభ్యాసము పూర్తియగుటకు ముందే వారికి పెండ్లిచేయుట ఎంత ఘోరమైన పని.

తండ్రి.—ఏల? ఈ ఆచారమందు నష్టమేమియు లేదే. దీని మూలమున, మేము జీవించియుండగానే మా మనుమలను చూడ గలుగు భాగ్యము మాకు కలుగుచున్నది.

సాక్రటీసు.—చిన్నవయస్సుననే మీరు మృత్యువుపాలగుట కును, నలువది సంవత్సరములకే ముసలివారగుటకును ఇదియే కారణము. మంచి వయస్సువచ్చువరకు మీరు పెండ్లిచేసికొనని యెడల మీరు దీర్ఘకాలము జీవించియుండగలరని తోచుచున్నది.

తండ్రి.—ఉండవచ్చును. మాలో ముసలివారుకూడ కొందరు ఇట్లు చెప్పుట వినియున్నాను. కాని ఆచారముల విష యములో మే మట్టివారిమాట వినజాలము.

సాక్రటీసు.—బాల్యవివాహములవలన మీ పిల్లలు గిటక పారి పెరుగవలసినంత బాగుగ పెరుగకున్నారు.

తండ్రి.—ఇది నిజమే కాబోలు.

సాక్రటీసు. — వారి విద్యాభ్యాసమునకుకూడ నివి ఆటంకము కలిగించుచున్నవి.

తండ్రి.—సత్యమే.

సాక్రటీసు.—అందుచే వారి బుద్ధి పరిపక్వము కాకపోవుచున్నది.

తండ్రి.—అవును.

సాక్రటీసు.—ఇంద్రియనిగ్రహమన నేమియో వారికి తెలియకపోవును.

తండ్రి.—అవును.

సాక్రటీసు. — పెండ్లిచేసికొను ఈ పిల్లలకు పిల్లలుపుట్టుదురు?

తండ్రి.—అవును.

సాక్రటీసు. — పిల్లలకుపుట్టిన పిల్లలు, పెద్దవారికి పుట్టిన పిల్లలంత బలముగలవారుగను, దృఢకాయులుగను ఉండరుగదా?

తండ్రి.—ఉండరు.

సాక్రటీసు.—ఈ కాలమందు మీ పిల్లలు బలహీనులుగనున్నారనుట కిదియే కారణము.

తండ్రి.—ఇదియే కారణముగ నుండవచ్చును. తరతరములుగ నిట్టి బాల్యవివాహములు జరుగుచుండుటచేతనే మా జనులందరు బలహీనులైపోయిరి.

సాక్రటీసు.—ఇట్టి పిల్లలయొక్క సంతానమును చక్కగ పోషించి పెంచవలయుననిన ఎప్పటికంటె ఎక్కువ శ్రద్ధయు జాగ్రత్తయు చూపవలయును గదా?

తండ్రి.—అవును.

సాక్రటీసు.—తల్లిదండ్రులు బాల్యమందుండుటచేతను, అనుభవములేనివారగుటచేతను పిల్లలను పెంచుటకు కావలసిన జ్ఞానము లేకుందురుగదా?

తండ్రి.—నిజమే.

సాక్రటీసు.—బాల్యమందుండువారికి పుట్టినవారగుట చేతను, పిల్లలను పెంచు పద్ధతులు తలిదండ్రులకు తెలియక పోవుటచేతను—ఈ రెండు కారణములచేత—మీ పిల్లలు శైశవమందే చచ్చిపోవుట కవకాశమేర్పడుచున్నది గదా?

తండ్రి.—వాస్తవము.

సాక్రటీసు.—వీరిని పెంచు పద్ధతులను తల్లి నేర్చుకొనుటకుముందే ఈ పిల్లలలో అనేకులు మృతిచెందుచుందురు.

తండ్రి.—ఇట్లే జరుగుచుండును.

సాక్రటీసు.—తల్లి విషయమునకూడ ఇది ఎంత క్రూరముగనున్నది! దేహపుష్టిలేక బాల్యమందుండినపుడే పిల్లలను కనవలసియుండుట; పదినెలలు వారిని మోసి, ప్రసవబాధ కోర్చి, వారిని కని, విశేష శ్రమపడి వారిని పెంచి శైశవమందే ఒకరి వెంటనొకరు వారు మృతిచెందుచుండుట చూచుట—ఇంత కంటె ఘోరమేమున్నది! దీనికంతకు ఆమెయొక్క తల్లిదండ్రుల బుద్ధిహీనతయేగదా కారణము. ఇంతటి బాధ్యతను

వహించుటకు కావలసిన అంగపాటవముగాని, మనోదార్ఢ్యము గాని ఏర్పడుటకుపూర్వమే ఆమెకిట్టి శ్రమను కలిగించుచుండు నది ఈ బుద్ధిహీనతయే.

తండ్రి.—మీరు మోపుచుండు నేరములన్నియు సత్యము లైనవే.

సాక్రటీసు.—మరియొక విషయము. మీ కుమారుడింకను పిల్లవాడేగదా? అతనికిప్పుడు కావలసినది ఆటవస్తువులు గాని భార్యకాదు.

తండ్రి.—సరే.

సాక్రటీసు.—అయినప్పటికిని, మంచిజరిగినను సరే, చెడుగు జరిగినను సరే యని మీరు మరియొక ప్రాణిని అతని మెడకు కట్టుచున్నారు.

తండ్రి.—అవును. ఇందులో తప్పేమియున్నది.

సాక్రటీసు. — భర్తయగు వీనికి ఇంద్రియనిగ్రహమన నేమియో తెలియదు; ఇతరుల గౌరవించుటకితడింకను నేర్చుకొనినవాడుకాడు; గౌరవమననేమియో కూడ తెలియదు.

తండ్రి.—అవును.

సాక్రటీసు.—అతని తల్లిమాట ఏమి? అతడు చూచినంత వరకు ఇంటియందామెకెట్టి గౌరవమును లేదు. ఆమె నీకు చాకిరిచేయు కూలిదిగాని నిజమైన ధర్మపత్నికాదు.

తండ్రి.—ఈ నిందలన్నియు నిజమైనవి.

సాక్రటీసు.—ఇప్పుడు నీవతనివశము చేయుచుండు ఈ పసి పిల్ల యేశిక్షయును లేనట్టిది; జ్ఞానములేనట్టిది; చదువులేనట్టిది.

అట్టి పిల్లకు గౌరవమెట్లు లభించును? గౌరవమునకు అర్హురా లెట్లగును?

తండ్రి.—కాజాలదు.

సాక్రటీసు.—అనగా ఈడురాని ఈ భర్త తన భార్యయెడ మర్యాదలేనివాడై ఆమెతో కాపురముచేయ ప్రారంభించుచున్నాడు. ఎప్పటికికూడ అతడామెను గౌరవింపబోడు; ఎన్నటికికూడ అమె గౌరవార్హకాజాలదు. భర్తవలన ఆమెకు లభించునది ఆటవస్తువందుగల గౌరవమువంటిదే. కొంతకాలమున కామె ప్రాతపడిపోవుటయు, ఇంటిలో పరిచారికగ మారిపోవుటయు సంభవించును. ఆత్మనిగ్రహమననేమియో యెరుగని కారణమున, కొంతకాలమునకత డామెను బాధించుటకును తరిమివేయుటకునుకూడ ప్రయత్నించినను ప్రయత్నింపవచ్చును.

తండ్రి.—మీరు చెప్పునదంతయు ఒప్పుకొనుచున్నాను.

సాక్రటీసు.—దురదృష్టవతులగు ఆడుపిల్లలు—దురదృష్టవంతులగు మగపిల్లలు—వందలకొలది సంవత్సరములనుండి ఇట్టి దురాచారమున కాలవాలమైన ఈ దురదృష్టపుదేశము!!

## ఒక సమస్య

ఒకరోజు మధ్యాహ్నము సాక్రటీసు గ్రామములోని వృద్ధులతో కూర్చుండియుండగా చాలదూరము నడుచుటచేత కాబోలు దుమ్ముతోనిండిన చెప్పులతోను, బట్టలతోను ఒక మనుష్యుడచటికి వచ్చిచేరెను. సేదదీర్చుకొనువానివలె నత డక్కడ కూర్చుండి సమీపమందున్న హుకాగా ఒక పర్యాయము పీల్చెను.

అలసటపోవువరకు అతనిని వీల్చనిచ్చి తర్వాత సాక్రటీసు అతనిని చూచి, "ఓయీ, ఎక్కడనుండి వచ్చితివి," అని అడిగెను.

గ్రామస్థుడు.—సాక్ష్యము చెప్పుటకై కోర్టుకు వెళ్లియుంటిని. అబ్బా, అది ఎంత కష్టమైనపని!

సాక్రటీసు.—ఏల అట్లు చెప్పెదవు? అదియేకదా నీకు సంతోషమునిచ్చు వ్యాపారము?

గ్రామస్థుడు.—దానికేమిగాని కష్టముమాత్రము ఎక్కువయే. నీవు చెప్పదలచుకొనిన సాక్ష్యము మరచిపోవువరకు దినమంతయు నిన్నచట వేసిపెట్టియుందురు; తర్వాత ఎప్పుడో ఉన్నట్లుండి నీ పేరును గట్టిగా పిలుతురు; తత్‌క్షణమే నీవు పలుకనియెడల నీపై వారికెక్కడలేనికోపము. తర్వాత నీవు కోర్టులోపలికి వెళ్లినప్పటినుండియు నీకేమియు తోచకుండునట్లు ఎన్నెన్నియో ప్రశ్నలొక్కుమారుగ నీమీద క్రుమ్మరించెదరు.

సాక్రటీసు.—ఎట్టి ప్రశ్నలు?

గ్రామస్థుడు.—నీ పేరు, నీ తండ్రివయస్సు—కాదుకాదు, నీ వయస్సు, నీ తండ్రిపేరు—నీ వృత్తి మొదలగు ప్రశ్నలు. రైతును నీ వృత్తి ఏమియని అడుగుట ఎంత వింత!

సాక్రటీసు.—వింతయే! అది అడుగకయే తెలిసికొనదగిన విషయమనియే నా అభిప్రాయమును.

గ్రామస్థుడు.—అవును.

సాక్రటీసు.—సరేగాని, నీవేమి జవాబుచెప్పితివి?

గ్రామస్థుడు.—అనుమానమేమియున్నది? వ్యవసాయమని చెప్పితిని. నేను మరేదైన చెప్పితినని మీరనుకొనుచుంటిరా?

సాక్రటీసు.—(మెల్లగను ఆలోచనతోఁకూడను) నిన్ను గురించి నాకు చక్కగ తెలియునుగదా? దానినిబట్టి నీ నిజమైన వృత్తి—

గ్రామస్థుడు.—(తొందరగ) ఏమిటి?

సాక్రటీసు.—బాలకాన్ను పీల్చుట.

దీనిని విని తక్కిన గ్రామస్థులందరు వారి స్నేహితునికి తగిన పరాభవమయ్యెనని నవ్వసాగిరి. అటుతర్వాత కడు అమాయికముగ

సాక్రటీసు.—గ్రామస్థులారా! ఏ పనిముట్టును దీర్చుటకై మీరును మీ పూర్వులును విశేషము శ్రమపడితిరి? ఏ పనిముట్టును శ్రేష్ఠమైనదానినిగ చేయుటకై మీకుగల తెలివితేటల నన్నిటిని వినియోగించితిరో మీరు చెప్పగలరా?

గ్రామస్థులు.—నాగలి.

సాక్రటీసు.—కాదు, కానేకాదు.

గ్రామస్థులు.—బండి.

సాక్రటీసు.—కాదు.

గ్రామస్థులు.—బావి.

సాక్రటీసు.—కాదు. ఆలోచించి చెప్పవలెను.

గ్రామస్థులు.—మోటా (కపిలె).

సాక్రటీసు.—ఎంతమాత్రము కాదు.

గ్రామస్థులు.—మీరేమి హాస్యమాడుచున్నారా లేక నిజమును కనుగొనుటకై అడుగుచున్నారా?

సాక్రటీసు.—నిజము కనుగొనవలయునను ఆసక్తి ఈ విషయమున నున్నంత మరెప్పుడును ఉండినదిలేదు.

గ్రామస్థులు.—అట్లైన మీ ప్రశ్నకు సరియైన జవాబిచ్చుటకు మేము సమర్థులముకాము.

సాక్రటీసు.—నేను చెప్పవచ్చునా?

గ్రామస్థులు.—దయచేసి తప్పక చెప్పవలెను.

సాక్రటీసు.—మీకు కోపమురాదుగదా?

గ్రామస్థులు.—మాకు పరమమిత్రులగు మీమీదనా మేము కోపగించుట!

సాక్రటీసు.—అట్లైన నేను చెప్పెదను. మీకుమాత్రము మనస్సునకు ఆయాసము కలుగునేమో?

గ్రామస్థులు.—మాకెట్టి యాయాసము లేదు. చెప్పుడు.

సాక్రటీసు.—అట్లైన చెప్పుచున్నాను.

* హుక్కా.

## (1) చిత్తం చిత్తం

## (2) ఆడుపిల్లలు మగపిల్లలు కలసి చదువుకొనుట

సాక్రటీసు గ్రామములోనికి వచ్చుచు క్రొత్తగ స్థాపింపబడిన పాఠశాలలోపల తొంగిచూచునప్పటికి అందు మగపిల్లలు మాత్రమే కనిపించిరి. పాఠశాలకును చావడికిని నడుమ వీధి పొడుగునను మట్టిలో ఆడుకొనుచు పిడకలపెట్టువారివలె నటించు తొమ్మిది పది సంవత్సరముల వయస్సుగల ఆడుపిల్లలు చాల

* హుక్కాపట్టు ఆచారము ఆంధ్రదేశమందు విశేషముగ లేదు. ఉత్తర హిందూస్థానమునందిది యొక గొప్ప దురలవాటు.

మంది అతని కంటబడిరి. వారి శరీరము కొంచెమైన శుభ్రముగ నుండలేదు. చుట్టుప్రక్కల మరెవ్వరు అతనికి కనిపింపరైరి; అందుచే అతడు, "పానకములో పుడక తప్పుటలేదు. చెప్పినమాటప్రకారము ఈ గ్రామస్థు లెప్పుడు చేయుదురో! తమ ఆడుపిల్లలను బడికి పంపెదమని ఎన్ని పర్యాయములో నా యెదుట శపథముచేసిరి; కాని బడిలో ఇప్పుడు ఒక ఆడుపిల్ల గూడ లేదు. "చిత్తం" "చిత్తం" అని నాకు విసుగెత్తునంతవరకు చెప్పుచుందురు; కాని క్రియ శుద్ధశూన్యము. చూడు, ఆ ముసలిరెడ్డి కనిపించినయెడల నేనేమి చేసెదనో! నోటిలోని అన్నపుముద్దను మ్రింగుటకుకూడ తెలియని అమాయికునివలె తియ్యనిమాటలు మాటలాడుచుండును; కాని పనిలోమాత్రము పూజ్యము. ఈ విషయమున తక్కినవారందరు ఇతని శిష్యులే. ఇతనికి చెప్పిచెప్పి నాకు విసుగెత్తుచున్నది," అని గొణుగుకొనుచు నడువసాగెను. అతడు చావడిదగ్గరకు వెళ్లునప్పటికి పెద్దరెడ్డి అగపడి నమస్కారముచేసి, "సాక్రటీసుగారూ! మీరు తిరిగి మా గ్రామమునకు వచ్చుట మా అదృష్టము."

సాక్రటీసు.—"రెడ్డిగారూ, నమస్కారము." (అతనికి వినబడకుండ) ఓయి మోసగాడా, నిన్ను చూచుటవలన నాకెట్టి సంతోషమును లేదు. (బిగ్గరగా), నేనిదివరకు నీకు చెప్పినదంతయు చేసితివా?

రెడ్డి.—చేయుటకేమి?

సాక్రటీసు.—(రహస్యముగ) నోటికి అడ్డులేదు. (బిగ్గరగ) శబాస్! చాల సంతోషము. కొనకు ఈ ఆరడుగుల గుంట తయారైనదన్న మాటయేనా!

రెడ్డి.—పూర్తిగ తయారైనది.

సాక్రటీసు.—మన మచటికి వెళ్లి చూచెదము రమ్ము.

రెడ్డి.—దానికేమి తొందర? మరియొక పర్యాయము వచ్చి నపుడు చూడవచ్చును.

సాక్రటీసు. — రెడ్డిగారూ, ఇదియే తగిన సమయము. (రహస్యముగ) అది ఇంకను మూడడుగులకంటె ఎక్కువ లేదు. (బిగ్గరగ) ఇప్పుడే వెళ్లిచూతము. చక్కగను, క్రమముగను చేయబడిన పనిని చూచుటకంటె సంతోషమేమున్నది? రమ్ము; వెళ్లెదము. ఇదియేగదా దారి? ఈ సందుకొననుగదా అది యుండుట?

రెడ్డి.—కాదు—ఆ—అవును—కాదు. ఇదికాదు దారి. కాని, ఎందుకు ఇప్పుడీ శ్రమ? మీరు చాలదూరము నడిచి యున్నారు; అలసియున్నారు; కావున కొంచెము సేపు కూర్చుండి, ఈ ఎండబెట్ట తగలకుండ కొంత బడలిక తీర్చుకొనుట మంచిది.

సాక్రటీసు.—రెడ్డిగారూ, నాకెప్పుడైన బడలిక కలుగుట మీరు చూచితిరా?

రెడ్డి.—చూచినట్లు లేదు. బడలికపడినట్లు మీరు ఒప్పుకొనువారును కారు; చేయవలసిన పనియున్నప్పుడు మీరెన్నడు బడలిక చెందినట్లు కనిపించుటలేదు. ఇదిమాత్రము నిజము.

సాక్రటీసు.—అట్లైన, నా విషయమై మీరిప్పుడింత విచార పడుట ఏల?

రెడ్డి. — విచారముకాదు. కొంతసేపు అలసటతీర్చుకొన మీరు కోరుచున్నారేమో అని అనుకొంటిని.

సాక్రటీసు.—రెడ్డిగారూ, ఎందు కీటక్కరిమాటలు? నా ముఖమువంక చూచి నిజముగ ఈ గుంట ఆరడుగులు లోతు గలదా, చెప్పుము.

రెడ్డి.—మీరింత నొక్కి అడుగుచున్నారు గనుక చెప్ప వలసినది చెప్పుచున్నాను. అది ఆరడుగుల లోతుగలదికాదు. మీరు వచ్చుచుండినపుడు నేను ఆ పనిమీదనే యుంటిని. ఇప్పటికది చాలవరకు పూర్తి అయినది.

సాక్రటీసు.—నేనా వీధిని తిరిగి వచ్చుచుండినపుడు మీరు కూర్చుండి చుట్టత్రాగుచున్నట్టుండినదిగాని, గుంటను త్రవ్వుచుండి నట్లగపడలేదే.

రెడ్డి.—మంచి పనిసమయమగు ఉదయముపూట నేనట్లు చేయుచుందునా?

సాక్రటీసు.—సరే. పోనీ. ఆ గుంట అయిదడుగుల లోతుం డునా?

రెడ్డి.—తిరిగి నొక్కి అడుగుచున్నారు. బహుశః పూర్తిగ అయిదడుగులుండదు. అయిదడుగులు కాకపోయినను కొంచె మించుమించుగ అంతమాత్రముండును.

సాక్రటీసు.—వెళ్లి, దానిని కొలిచిచూతము.

రెడ్డి.—ఎందుకంతటి శ్రమ. అది ఇక్కడికి కొంతదూర మందున్నది.

సాక్రటీసు.—సరేగాని అది నడుములోతుండునా?

రెడ్డి.—అంత ఉండదని తోచుచున్నది.

సాక్రటీసు. — మోకాలులోతుండునా? ఒక మూరెడు లోతుండునా?

రెడ్డి.—మూరెడులోతు తప్పదు. కావలసినయెడల ఒట్టు పెట్టుకొని చెప్పెదను. కష్టపడి స్వయముగ నేనేగదా దానిని త్రవ్వుచుంటిని?

సాక్రటీసు. — త్రవ్వుచుంటివేమో గాని దానినిగురించి ప్రమాణముచేయుట ఎందుకు? ప్రమాణముచేయుట సామాన్య విషయమని ఎంచకూడదు.

వీరిట్లు మాటలాడుచుండగా గ్రామస్థులు కొందరచటికి వచ్చి పెద్దరెడ్డి గుటకలు మ్రింగుచుండుటయు, సాక్రటీసు కోపము చెందియుండుటయు చూచిరి.

గ్రామస్థులు.—రెడ్డిగారూ! ఏమి సమాచారము. తిరిగి ఈ ముసలితాత మిమ్ము గట్టిగ పట్టుకొనినట్లున్నదే.

రెడ్డి.—మాటలాడకుడు.

సాక్రటీసు.—ఏల? గ్రామస్థులారా! నమస్కారము. తాను త్రవ్విన గుంటనుగురించి మీ రెడ్డిగారు వర్ణించుచుండిరి.

గ్రామస్థులు.—గుంటా? ఏమి గుంట?

సాక్రటీసు. — వెనుకటిపర్యాయము నేను వచ్చినపుడు తాను త్రవ్వెదనని చెప్పిన గుంట.

గ్రామస్థులు.—అలాగా.

రెడ్డి. — మీకందరికి తెలియదా? పశువులకొట్టమునకు సమీపమున నుండు గుంట.

గ్రామస్థులు. — తెలియకేమి. మాలవాండ్రు నిన్న సాయంకాలము త్రవ్వుట కారంభించిన గుంటయా? సాక్రటీసు గారూ, అది చాల బాగున్నది. ఒక మూరెడు లోతుండును.

సాక్రటీసు.—(రహస్యముగ) ఇతని శపథము! ఇతనికి సత్యమందుగల శ్రద్ధ! (బిగ్గరగ) సరే, దీనికేమిగాని, వెనుకటిపర్యాయము నేను మీతో మాటలాడినపుడు మీరందరు మీ ఆడుపిల్లలను బడికి పంపుటకు అంగీకరించితిరిగదా? మీ మాట ప్రకారము చేసితిరా?

గ్రామస్థులు.—చేయలేదు. మీయెదుట నిజమును దాచు టెందుకు? మా కులమువారందరు అట్లు చేయకూడదనియు, మొదట ఆడుపిల్లలకు ప్రత్యేకముగ బడి నొకదానిని పెట్టవలె ననియు, తర్వాత వారిని బడికి పంపవచ్చుననియు చెప్పిరి.

సాక్రటీసు.— ఈ ఆడుపిల్లలబడిలో చదువుచెప్పువారెవరు?

గ్రామస్థులు.—ఎవతెయో ఒక స్త్రీ.

సాక్రటీసు.—ఆమె ఎక్కడనుండి వచ్చును?

గ్రామస్థులు. — మాకు తెలియదు. జిల్లా బోర్డువారామెను పంపెదరు.

సాక్రటీసు.—జిల్లా బోర్డువారికట్టి స్త్రీ ఎక్కడ దొరకును.

గ్రామస్థులు.—మాకు తెలియదు.

సాక్రటీసు. — మీ గ్రామములో చదువుకొనిన స్త్రీ లెవ రైన గలరా?

గ్రామస్థులు.—లేరు.

సాక్రటీసు.—ప్రక్క గ్రామములో ఉన్నారా?

గ్రామస్థులు.—లేరు.

సాక్రటీసు.—ఆమడ దూరములోపలనుండు గ్రామములలో వేనిలోనైన చదువుకొన్న స్త్రీలున్నారా?

గ్రామస్థులు.—మాకు తెలిసినమట్టుకు ఎవ్వరు లేరు.

రెడ్డి.—లేనే లేరు.

సాక్రటీసు. — అట్లైన వారెక్కడనుండి వచ్చెదరు? పట్టణములనుండియా?

గ్రామస్థులు.—కాదు. పట్టణములోని స్త్రీలు ఈ పల్లెటూరికొంపకు రాజాలరు. వచ్చినప్పటికికూడ మా స్వభావము వారికి తెలియజాలదు, వారి స్వభావమును మేము తెలిసికొనలేము. కావున వారిద్వారా ఎవరికిని లాభము కలుగదు. ఇదిగాక ఇచ్చట వారు కాపురముండుటకు తగిన ఇల్లుగూడ దొరకదు.

సాక్రటీసు.—అట్లైన మీ స్త్రీలలో ఎవరైనను చదువుకొనునంతవరకు మీ ఆడుపిల్లలబడియందు చదువుచెప్పగలవారెవ్వరు దొరకరని తోచుచున్నది.

గ్రామస్థులు.—ఆలాగే కనిపించుచున్నది.

సాక్రటీసు. — అనగా మీ ఆడుపిల్లలను మీ గ్రామములోని మగపిల్లల బడిలో చదువుటకు పంపినగాని, మీ యూరిలో స్త్రీ విద్య ప్రారంభమగుట కవకాశము లేదు.

గ్రామస్థులు.—అవును.

సాక్రటీసు.—ఇదిగాక మొన్నటిదినము మీరు చెప్పిన మాట మీకు జ్ఞప్తియున్నదా? మీరిదివరకే చాల అధికముగ పన్నుల చెల్లించుచుండినట్లును, వానిని తగ్గించినగాని బ్రదుక లేనట్లునుగదా మీరు చెప్పితిరి.

గ్రామస్థుడు.—అవును. మేము అధికముగ పన్నులను చెల్లించుచున్నామను మాట నిజము.

సాక్రటీసు.—ప్రత్యేకముగ ఆడుపిల్లలకు బడి కావలెనని మీరు కోరినయెడల అందుకుగాను ఉపాధ్యాయియేగాక ప్రత్యేకముగ ఇల్లుకూడ కావలసినదేనా? లేక ఆ బడిని మీ గ్రామ చావడిలో పెట్టుకొనెదరా?

గ్రామస్థులు.—పెట్టుకొననియ్యము. అయిదు సంవత్సరముల క్రిందట మగపిల్లలబడికిగా దానిని తీసికొని, సంవత్సరములోపల వేరే ఇంటిని కట్టించి ఈ చావడిని తిరిగి మా వశము చేయుదుమని చెప్పి మొన్నమొన్న ఎంతో కష్టము మీద దానిని మా స్వాధీనముచేసిరి. తొందరపడి తిరిగి మా చావడిని ఇట్టి పనుల కియ్యజాలము—ముఖ్యముగ ఆడుపిల్లల బడికనిన బొత్తిగ ఇయ్యజాలము.

సాక్రటీసు.—మీ తత్త్వము తెలియవచ్చుచున్నది. పాఠశాలలు కావలయుననిన వేలకొలది ద్రవ్య మావశ్యకము; ఉపాధ్యాయులు కావలసినను అంతే. మీ జిల్లాలో పదునైదు వందల గ్రామములున్నవి; రెండువందల గ్రామములందు మాత్రము పాఠశాలలకై ప్రత్యేకపు ఇండ్లున్నవి. ఇప్పుడన్ననో మీరు ప్రతి గ్రామమందు ఆడుపిల్లలకు మరియొక పాఠశాల

కావలయునని చెప్పుచు పన్నులుమాత్రము అధికము కాకూడ దని వాదించుచున్నారు. ఇది న్యాయముగ నున్నదా?

గ్రామస్థులు.—లేదని కొంతవరకు ఒప్పుకొనుచున్నాము.

సాక్రటీసు.—ఇదిగాక మీలో కొందరికి ఘోషాకూడ ఉన్నదిగదా?

గ్రామస్థులు. — అవును; అవును. మగవారికి లేదుగాని, ఆడువారిలో కొందరికి గలదు.

సాక్రటీసు. — అట్లైన ఘోషాస్త్రీలకు ప్రత్యేకముగ నొక పాఠశాల యుండవలయునుగదా? లేనియెడల, ఘోషాలేని పిల్లలు ఘోషాపిల్లల బడికిపోవుటయు వారుకూడ ఘోషా మొదలుపెట్టుటయు సంభవించును.

గ్రామస్థులు. — ఎంతటిమాట! ఘోషా లేనివారుగూడ బడికివెళ్లి ఘోషా మొదలుపెట్టునెడల అట్టివారు బడికి పోకుం డుటయె మంచిది. స్త్రీలుకూడ కష్టపడి పనిచేసినగాని జరగని మా గ్రామములో ఘోషా సాధ్యముకాదు. అందువలననే ఘోషాపద్ధతి అవలంబించు కుటుంబములవారు రానురాను దరిద్రులై ఆరోగ్యములేక మృత్యువుపాలగుచున్నారు.

సాక్రటీసు. —నిజము. గ్రామస్థులకు ఘోషా చాల ప్రతి కూలము. కావున, ఘోషా అవలంబించువారికి ఒక బడియు, తక్కినవారికి మరియొకబడియు — అనగా ప్రతి గ్రామమందు ఆడుపిల్లలబడులు రెండు ఉండవలెనని ఏర్పడుచున్నది.

గ్రామస్థులు.—ఇది చాల బాగుగనున్నది.

సాక్రటీసు. — ఐన, పన్నులుమాత్రము అధికము కాగూడదుకదా? అట్లైన సాధారణమగు గ్రామములందు ఆడుపిల్లలకు ప్రత్యేకముగ పాఠశాలలుండుట అసాధ్యము.

గ్రామస్థులు.—అవును.

సాక్రటీసు. — ఒకవేళ ప్రత్యేకముగ ఒక ఆడుపిల్లలబడిని పెట్టినను దానిని తనికీచేయువారెవరు?

గ్రామస్థులు.—ఎవరో ఒక స్త్రీ ఉండవలెను.

సాక్రటీసు. — ఎచ్చటనో ఒక మారుమూలనుండు ఈ గ్రామమునకు ఆమె వచ్చుట ఎట్లు? మగపిల్లలబడికి ఇన్‌స్పెక్టరు ఎన్నిపర్యాయములు వచ్చుచుండును?

గ్రామస్థులు.—మూడు నెలల కొకపర్యాయము. అతడు కూడ మా గ్రామములకు వచ్చుట చాల కష్టమని చెప్పుచుండును.

సాక్రటీసు.—అట్లైన ఆడు ఇన్‌స్పెక్టరు సంవత్సరమున కొకపర్యాయము వచ్చినప్పటికికూడ మీ రదృష్టవంతులని చెప్పవలసినదేగదా?

గ్రామస్థులు.—కాబోలు.

సాక్రటీసు. — బడి చక్కగ జరుగుచున్నదా లేదా యని తనికీచేయువారు లేనియెడల బడియుండియు లాభములేదన్న మాటయేనా?

గ్రామస్థులు.—అవును. అప్పుడప్పుడు తనికీ జరుగుచుండిన గాని లాభములేదు. ఆ మాట మేముకూడ ఎరుగుదుము.

తర్వాత ఒక నిమిషమువరకు ఊరకుండి తాను చెప్ప దలచుకొనినదంతయు పూర్తికాలేదని సాక్రటీసు మరల ఉపక్రమించెను.

సాక్రటీసు.—మీకు మీ స్త్రీలయెడ విస్తారగౌరవము లేదు గదా?

గ్రామస్థులు. — దీనిని మీ రెన్నిపర్యాయములో అడిగి యున్నారు; తిరిగి ఇప్పుడు ప్రస్తావనచేయుట ఎందుకు?

సాక్రటీసు.— నేను చెప్పినది సత్యమేనా?

గ్రామస్థులు.—కొంతవరకు.

సాక్రటీసు. — ఇప్పుడిప్పు డీ విషయమై మీరు చేయునది అన్యాయమని మీకుకూడ తోచుచున్నదా? మీలో మీరు కొంత సిగ్గుపడుచున్నారా?

రెడ్డి.—అవును. మీ రేదైన ఒక విషయముగురించి అనేక పర్యాయములు చెప్పినయెడల మేము మీరు చెప్పినట్లు చేయక పోయినను దానినిగురించి మాలో మేము ఆలోచించుకొని వాదప్రతివాదములు చేసికొనుట మాకిప్పుడు అలవాటైనది. అందుచే ఆ విషయము మా మనస్సులో నాటుకొనుచున్నది. ఈ స్త్రీలవిషయమున మేము చేయుచున్నదంతయు పొరపాటని మాకు స్పష్టమైనది; కాలక్రమమున ఇదంతయు మారును.

సాక్రటీసు. — ఈ పాఠమును నేర్చుకొనదగినవారు చిన్న పిల్లలు.

గ్రామస్థులు. — అవును. మేమీ మాట ఎన్నిమార్లో చెప్పితిమి. ముసలివాండ్రమగు మమ్ము వదలి మీరు చిన్నపిల్లలకు ఉపదేశముచేయవలెను.

సాక్రటీసు.—వారి తల్లులను, అక్క-చెల్లెండ్రను గౌరవించుటకు పిల్లలెట్లు నేర్చుకొనెదరు? మీవలన నేర్చుకొనుటకు వీలు లేదుగదా?

గ్రామస్థులు.—లేదు.

సాక్రటీసు.—అట్లైన వారెచట నేర్చుకొనెదరు?

గ్రామస్థులు.—బడిలో.

సాక్రటీసు.—బడిలో మగపిల్లలుమాత్రమే ఉండినయెడల వారీవిషయమును ఎట్లు నేర్చుకొనగలరు? ఆడుపిల్లలు చదువు లేక (జ్ఞానహీనులై) అపరిశుభ్రులైయున్నయెడల గౌరవార్హులెట్లగుదురు?

గ్రామస్థులు.—అవును. ఇట్టి ఇబ్బందులున్నవని మేమెరుగుదుము.

సాక్రటీసు.—ఆడుపిల్లలనందరిని ప్రత్యేకముగ గ్రామమందెచ్చటనో ఒక మూలయందుండు ఇంటిలో కూర్చుండబెట్టి చదువుచెప్పినయెడల ఈ మీ ప్రాతకాలపు ఆచారములు విడిపోవును. తల్లులను అక్క-చెల్లెండ్రను గౌరవించుట విధి యను మాట మగపిల్లలు నేర్చుకొనవలయుననిన, బాలురుగనున్నప్పుడె ఆడుపిల్లలతోగూడ వారిని ఒకేబడికి పంపుట ఆవశ్యకము. అట్టి బడిలోని ఉపాధ్యాయుడు — ఉపాధ్యాయి — ఉపదేశమూలమునను, ఆచరణమూలమునను, బడిలోని ఆడుపిల్లలను ఇంటిలో నుండు తల్లులను గౌరవించుట ధర్మమని మగపిల్లలకు నేర్పగలిగి యుండును. ఆడుపిల్లలన్ననో, మగవారితో కలసి ఒకేబడియందు ఒకేపాఠములను నేర్చుకొనువారగుటచేత తాముకూడ మగవారితో సమానులమనియు, వారికంటె తక్కువవారు

కామనియు తెలిసికొని, ఆత్మగౌరవమును సంపాదించుకొని, తుదకు విద్యవలన గౌరవార్హులగుదురు. పెద్దపెరిగి పెండ్లిచేసి కొనిన తర్వాత, భర్తలచే గౌరవింపబడి ఈ సంప్రదాయముల నన్నిటిని తమ సంతానమునకు నేర్పగలిగియుందురు.

గ్రామస్థులు.—సాక్రటీసుగారూ! మీరు చెప్పునదంతయు యుక్తియుక్తముగ నున్నది; కాని ఇట్టిమార్పులు పూర్తిగ జరుగుటకు ఎన్నియో సంవత్సరములు పట్టును.

సాక్రటీసు. — అట్లైన మీరు ఆలస్యముచేయక ఇప్పుడే మీ పిల్లలను బడికి పంపవలెను. బడికివెళ్లి చదువుకొనుచుండు మగపిల్లలు లోకజ్ఞానము అక్షరజ్ఞానములేనట్టి తమ తల్లులను, పిడకలపెట్టుటయు, నగలను వేసికొనుటయు తప్ప మరేమియు ఎరుగని తమ అక్కచెల్లెండ్రను గౌరవింతురని అనుకొనుట గొప్ప పొరపాటు. ఈ మీ దురాచారమువలన మీరెంతో సౌఖ్యమును కోల్పోవుచున్నారు. నేను నా బాల్యమున నేర్చుకొనిన మంచి విషయములన్నిటిని నా తల్లివలననే నేర్చుకొంటిని; ఆమె స్మరణమునే నేను పవిత్రముగ పరిగణించుచున్నాను.

గ్రామస్థులు. — ఆమె మిక్కిలి దొడ్డదిగనుండి యుండవలెను.

సాక్రటీసు.—సందేహములేదు. మీ తల్లులుకూడ అట్టివారుగనే ఉండవలెను; మీ ఆడుపిల్లలకు చదువుచెప్పించి చక్కగ పెంచి, మీ స్త్రీలను చక్కగ గౌరవించినయెడల వారందరు అట్టివారు కాగలరు. ఇంతేగాక, నా పిల్లలుకూడ వారి తల్లియొద్దనే వారు నేర్చుకొనవలసినదంతయు ఇప్పుడు నేర్చుకొనుచున్నారు.

గ్రామస్థులు.—ఇందులో ఆశ్చర్యమేమియు లేదు. ఆమె మా గ్రామమునకుకూడ వచ్చి మా పసిపిల్లలనందరిని చూచి వారిని పెంచవలసినవిధమును తల్లులకు బోధించియుండెను గదా? పసిపిల్లలందరిలో చక్కగనుండిన పిల్లను స్వయముగ నెత్తుకొని మాకందరికి చూపి, ఆ విధముగ పిల్లలను పెంచవలయు నని ఆమె మాకు చెప్పియుండలేదా?

రెడ్డి.—ఇంతకును ఆ పిల్ల మాలది.

గ్రామస్థులు. — ఇంతేగాక డేరాకు వెలుపల ఆమె పిల్ల లందరు ఆడుచుండుట మేము చూడలేదా? వారు ఎంత శుభ్ర ముగను, ప్రకాశముగను ఉన్నారు! వారు ధరించుకొనిన బట్ట లన్నియు ఇంగ్లండునుండి వచ్చినదనుకొనుచున్నాము — అవి అంత సొగసుగ నుండినవి.

సాక్రటీసు.—కాదు. పొరపడితిరి. ఆ దుస్తులన్నిటిని వారి తల్లియే తయారుచేసెను. ఇదిగాక ఇప్పుడు మేము స్థాపించి యుండు ఆడువారి ట్రెయినింగు పాఠశాలలో ఉపాధ్యాయు రాండ్రుగ తయారగుచుండు స్త్రీలందరికి దీనిని నేర్పుచున్నాము. కావున మీరు మీ ఆడుపిల్లలను బడికిపంపి, వారిని గౌరవింప వలెనని మీ మగపిల్లలకు నేర్పవలెను. మీ పిల్లలు మంచివా రుగ నుండవలయుననిన వారి తల్లులు మంచివారుకావలెను; తల్లులయెడల తగు మర్యాదను గౌరవమును చూపినగాని పిల్ల లెట్లు మంచివారు కాగలరు?

గ్రామస్థులు. — సాక్రటీసుగారూ! ఈ విషయమై మరి యొకమారు మా కులస్థులందరితో మేము ప్రస్తాపముచేసి ఆడుపిల్లలనందరిని ఇప్పటి ఈ మగపిల్లలబడికే పంపునట్లు చేసె

దము. అప్పుడుగదా ఇది గ్రామపాఠశాలయగుట!— ఇప్పు డిది 'మగపిల్లల పాఠశాల' అనియే చెప్పదగియున్నది.

సాక్రటీసు.—మంచిది. అప్పటికికూడ మీ కులస్థులు మీ మాట విననిపక్షమున నేనే వారిదగ్గరకు వెళ్లి మాటలాడెదను. కాని మీ బంధువుల ఆక్షేపమేనా దీనికంతకు కారణము? లేక మీ సోమరితనమును పూర్వాచారపరాయణత్వమునా? మీ బంధువుల ఆక్షేపముకాదను అనుమానము నాకున్నది.

గ్రామస్థులు.-ఒక్కొక్కప్పుడు మీ అనుమానమున కాధార ముండుట నిజమే కాని ఈ విషయములో మాత్ర మట్టి ఆదా రములేదు. మా బంధువు లీవిషయమున చాల పట్టుదల కల వారు.

సాక్రటీసు. — క్షమింపవలెను. నేనిట్లంటినని కోపపడ కూడదు.

రెడ్డి.—క్షమార్పణకేమున్నది? మమ్ములనుగురించి మీరు చెప్పు విషయములలో ముప్పాతికమూడు వీసములు అబద్ధ మన్నది లేదు.

సాక్రటీసు. — బహుశః ముప్పాతికమూడున్నర వీసమని కూడ చెప్పవచ్చునేమో! మంచిది. ఈ రోజు ఇచట చాల సేపు ఉంటిని; కావున వెళ్లిపోవలెను. సెలవు.

గ్రామస్థులు.—చిత్తము; నమస్కారము.

## పీఠికలు

ఈ పర్యాయము సాక్రటీసు గ్రామచావడికి వచ్చి ముఖము ముడుచుకొని కూర్చుండియుండెను. గ్రామస్థు లత నిని చూచి తమవలన ఏదో గొప్ప పొరపాటు జరిగియుండవలె

ననియు, ఎప్పటి దుర్గంధము, పిల్లలు శుభ్రముగనుండకపోవుట, అతని కోపమునకు కారణములు కావనియు భావించిరి.

సాక్రటీసు.—గ్రామస్థులారా! నా కీరోజు ఇదివరకెన్నడు లేని విచారము కలుగుచున్నది. నేను మీ యందరివద్ద సెలవు పుచ్చుకొని వెళ్లిపోవలసిన సమయము వచ్చినది.

గ్రామస్థులు.—ఏల?

సాక్రటీసు.—నాకుగూడ పిల్లలున్నారుగదా? నేను వారిని మా దేశమునకు తీసికొనిపోయి చదువుచెప్పింపవలెను. స్వదేశమును చూచిరావలయునను కోరికకూడ నాకు కలదు. మీయందును, మీ గ్రామమందును నాకుగల అభిమానముచేత మిమ్ము వదలి వెళ్లిపోవుట చాల కష్టముగనున్నది. కాని, నేనేమి చేయగలను! నేను మా దేశమునకు తప్పక వెళ్లవలసియున్నది; ఎట్టి ఆలస్యముచేయుటకు వీలులేకున్నది.

గ్రామస్థులు.—మీరు వెళ్లిపోయినతర్వాత మేము చేయగలిగినది ఏమున్నది? తిరిగి యథాప్రకారము అపరిశుభ్రములైనట్టియు, నిరర్థకములైనట్టియు మా ప్రాతకాలపు ఆచారములందు పడిపోయెదము.

సాక్రటీసు.—అట్టిభయము లేదు. ఆరోగ్యమునకును, ఐశ్వర్యమునకును పరిశుభ్రతయే కారణమనియు, దారిద్ర్యమునకు మీ నిరర్థకపు వ్యాపారములే కారణమనియు, భార్య విద్యావంతురాలైనయెడల మీ గృహము సౌఖ్యముతోడను సంతోషించు పిల్లలతోడను నిండియుండుననియు మీరు నేర్చుకొంటిరి గదా?

గ్రామస్థులు.—ఇదంతయు నిజమేకాని మేమెంత సోమరి పోతులమో, ఎంతటి కలహప్రియులమో, సత్కార్యముల కొనసాగించుటకు మాలో ఎంత ఒద్దిక తక్కువో మీకు తెలియనిదికాదు.

సాక్రటీసు.—అవును. దుష్కార్యములకనిన మీరు బహుసులభముగ చేరుదురు. ఇది నాకు తెలిసినదే.

గ్రామస్థులు.—ఇదేకదా మీ స్వభావము. సెలవుపుచ్చుకొను దినమునకూడ మీరు మీ వాక్కాఠిన్యమును మానుటలేదు. కాని మీరు చెప్పునదంతయు నిజము. ఇదివరకు మీరు నేర్పిన ఈ మంచిపద్ధతులన్నియు మీరు వెళ్లిపోయిన తర్వాత సాగించుట ఎట్లను విచారము మాకు కలుగుచున్నది.

సాక్రటీసు.—మీరందరు కలసి దానిని నిల్వబెట్టవలెను.

గ్రామస్థులు.—ఏలాగు?

సాక్రటీసు.—సహకారోద్యమమందు పనిచేయువారిని పిలిపించి, మీ గ్రామమున ఒక సంఘమును స్థాపించుకొనవలెను.

గ్రామస్థులు.—దానిని చేయుట ఎట్లు?

సాక్రటీసు.—మొట్టమొదట మీరొక సంఘమును స్థాపించుకొని, మీరు నావద్ద నేర్చుకొనిన క్రొత్తపద్ధతుల నన్నిటిని సంఘపు నిబంధనలుగ చేసికొనవలెను. నిబంధనలను మీరు తప్పక అనుసరింపవలెను; లేనియెడల సంఘసభ్యులు మీపై జరిమానాను విధింపగలరు.

గ్రామస్థులు.—ఇది బాగుగనున్నది; కాని ఈ సంఘమును నడుపువారెవరు?

సాక్రటీసు. — సహకార బ్యాంకీలనన్నిటిని తనికీచేయు చుండు సహకారోద్యోగస్థులే దీనినికూడ నడిపెదరు.

గ్రామస్థులు. — అట్లైన మేము తత్‌క్షణమే ఇందుకై ప్రయత్నించెదము.

సాక్రటీసు.—మిత్రులారా! ఇప్పుడు మీరు నాకు సెలవియ్యవలెను. ఒక్కొకపుడు నేను చాల కఠినముగ మాటలాడియుందును; కాని నాకు మీయందుగల ప్రేమయే దానికి కారణము. మిమ్ములనందరిని వదలి వెళ్లిపోవుట చాల విచారకరముగనున్నది.

గ్రామస్థులు.-సాక్రటీసుగారూ! మీరు మమ్ములను పూర్తిగ మార్చివేసితిరి; మీ మూలమున మేము సంతోషము ఆరోగ్యము సౌఖ్యముగల మనుష్యులమైతిమి. భగవంతుడు మిమ్ము రక్షించుగాక! మీరు బహు శీఘ్రముగ తిరిగి రావలయుననియే మా అభిలాష.

సాక్రటీసు. — వేగముగ తిరిగి వచ్చుటయే! ఏలాగు తిరిగి నేను వచ్చుట!

గ్రామస్థులు.—ఏలాగో! తప్పక రావలెను.

సాక్రటీసు.—సరే. ఒకమాట చెప్పుచున్నాను. మీరు వినవలెను. ఇప్పుడు మీరందరు ప్రారంభించిన క్రొత్తపద్ధతుల నన్నిటిని మరచిపోక అనుసరించుచు ప్రాతపద్ధతులలోనికి మరలనియెడల నేను మరల వచ్చెదను.

గ్రామస్థులు.—అట్లే వాగ్దానముచేయుచున్నాము.

సాక్రటీసు.-రైతుల వాగ్దానముల నెంతవరకు నమ్మవచ్చునో నాకు తెలియదా?

గ్రామస్థులు.— తిరిగి మీరు మమ్ములనెత్తి పొడుచు చున్నారు.

సాక్రటీసు.—ఏమి చేయుదును. ఎంతకాలమునుండియో నేను మిమ్ముల నెరుగుదునుగదా?

గ్రామస్థులు.—అయ్యా ఇది మామూలు వాగ్దానముల వంటిదికాదు. ఇది ప్రమాణపూర్వమైనది. సత్యమును తప్ప కూడదనికదా మీరు మాకు నేర్పితిరి? ఇప్పుడు మా పిల్లలందరు సత్యము పాటించువారుగ పెరుగుచుండుట మీకు తెలియదా?

సాక్రటీసు. — తెలియును. మీరు మీ మాటను నిల్వ బెట్టుకొని, మీరు నేర్చుకొనిన విజ్ఞానమును, ఇతర జిల్లాల యందుకూడ వ్యాపింపజేసి భరతఖండమునంతయును ఉద్ధరింప కంకణము కట్టుకొనినయెడల నేను మిమ్ములను చూచుటకై తిరిగి వచ్చెదను.

గ్రామస్థులు.—అప్పుడు మా పురోభివృద్ధికై మీరు మరి కొన్ని సూచనలు చేయవలెను.

సాక్రటీసు.—తప్పక. ఇప్పుడు మనము ప్రారంభదశలో గదా ఉండుట.

గ్రామస్థులు.—అభ్యుదయమార్గము లెంత కష్టమైనవి!

సాక్రటీసు. — నిజము. ఒక్కొక మెట్టునను క్రొత్త కష్టములు కనపడుచుండును; వానినన్నిటిని దాటుకొని వెళ్లవలెను.

గ్రామస్థులు.—సాక్రటీసుగారూ—మీ దేశమిప్పటికి సర్వ విషయముల పరిపూర్ణతను గాంచియున్నదిగదా?

సాక్రటీసు.—లేదు, లేదు. మేము చాల అభివృద్ధిగాంచిన వారమైనను, మాకు చేయవలసిన పని ఇంకను ఎంతో ఉన్నది.

అభివృద్ధి ఎక్కువ కానుకాను క్రొత్తకష్టము లెన్నియో మొలక లెత్తును. ఈ కష్టములను దాటుటలో నేను నా దేశమునకు కొంతవరకు సహాయముచేయగలుగుదునని నమ్ముచున్నాను.

గ్రామస్థులు.—మీ దేశమందే ఎక్కువ ఆసక్తిగలవారలై అక్కడనే ఉండిపోయెదరేమో? అట్లుమాత్రము చేయకుడు. మీరిప్పుడు చెప్పినదంతయు సత్యమే అయినయెడల, మీ రిచ్చటికి బహు శీఘ్రకాలమున రావలసియుండును.

సాక్రటీసు.—ఏల?

గ్రామస్థులు. — అభివృద్ధిపొందవలెనని మేము పట్టుపట్టి యున్నాము. అభివృద్ధిపొందను పొందను మేము క్రొత్త కష్టము లెదుర్కొనవలసి వచ్చునని గదా మీరు చెప్పితిరి. అట్లైన మీ రెట్టి ఆలస్యముచేయక తిరిగి మా దేశమునకు రావలసినదే గదా?

సాక్రటీసు.—మీ మాటను మీరు నిలబెట్టుకొనినయెడల నా మాటను నేను నిలబెట్టుకొనెదను.

గ్రామస్థులు.—శబాస్.

సాక్రటీసు.—మిత్రులారా! సెలవు. భగవంతుడు మిమ్ము రక్షించుగాక.

గ్రామస్థులు.—చిత్తము. దేవుడు మిమ్ము రక్షించుగాక!

## ఫలశ్రుతి

సాక్రటీసు దేశమును వదలి వెళ్లిపోవుచున్నాడన్నమాట నాలుగుదిక్కుల వ్యాపించెను. పశుపక్షులుకూడ ఆ విషయమును గురించియే మాటలాడదొడగెను. దోమయొకటి లేచి

"ఇతడు వెళ్లిపోవుట నాకెంతో సంతోషముగ నున్నది. దోమ జాతిలో నేనుమాత్రమే మిగిలియున్నాను. ఈ గ్రామస్థులు పాడు పడిన మురుగుగుంటలనన్నిటిని కప్పివేసిరి; వర్షపునీరు చేరు ప్రదేశములందంతట వీరు కిరసనాయిల్ పోయుచున్నారు. అందుచే నాకు గ్రుడ్లు పెట్టుటకు చోటు దొరకకున్నది. ఇండ్లన్నో—అవి ఎంతో శుభ్రముగను, వెలుతురుకలవిగను ఉన్నవి. నేను కాపురముచేయుటకుకూడ కొంత పెంట ఇంటిలోపలగాని, బైటగాని ఉండుటలేదు" అని చెప్పెను.

ఈగ లేచి, "నా కష్టముకూడ ఇట్టిదే. గ్రుడ్లు పెట్టుటకు చోటులేదు; అన్నిటిపైన మూతలు పెట్టుటచే తినుటకేదియు దొరకుటలేదు" అని అనెను.

మిణ్ణలిపురుగు లేచి, కష్టముతో కొంతదూరము దుమికి, "నా మాట మీరు మరచినట్లున్నది. చీకటిప్రదేశము నాకు కావలసినది; కాని ఈ రోజులలో ఇండ్లన్నియు వెలుతురుతో నిండి విశాలముగ నున్నవి" అని చెప్పెను.

ఎలుక లేచి, "మీకేమి? ఎక్కడికనిన అక్కడికి ఎగిరిపోగలరు. నా కష్టమునకే మితిలేకున్నది. ఇండ్లలో నేను నా ముఖమును బైటపెట్టినయెడల తత్‌క్షణమే వారు విషవాయువును నాపైకి వదలెదరు; పొలములలోగూడ నాగతి ఇంతే అయినది. ఇదిగాక వెలుతురుచూచుట యనిన నాకెంతో బాధ; వెలుతురులేని గది ఒకటికూడ ఇప్పుడు కానరాదు," అని పలికెను.

కుక్కయొకటి లేచి, "సాక్రటీసు ఎంత మంచివాడు! ఉండుటకు నాకొక ఇంటిని కల్పించినాడు. కడుపునిండ భోజనము దొరకుచున్నది; యజమానులు నాకొక పేరుపెట్టినారు. ఈ

అందమైన మెడపట్టెను చూచితిరా? ఇంటికి కావలియుండుట కును, ఎలుకల పట్టుటకును, ఇతరములగు ఉపయోగమైన పను లను చేయుటకును, వారు నాకు చక్కగ నేర్పియున్నారు. నేని ప్పుడు మనుష్యునికి మిత్రమునైతిని. సాక్రటీసుకీ జై! జై! జై!" అని తన సంతోషమును వెలిపుచ్చెను.

పంది లేచి, "నా ఆహారమంతయు పోయినది. ప్రతి ప్రదే శమును వారిప్పుడు శుభ్రముగ నుంచుకొని, పెంటనంతయును గోతిలో పోయుచున్నారు. నేను గ్రామాంతరము వెళ్లవలసి యున్నది" అని అనెను.

ముండ్లపొదలలోనుండిన జంతుజాలముకూడ సాక్రటీసు గావించిన మార్పులగురించి ప్రసంగించుటకు మొదలుపెట్టెను. తిత్తిరిపిట్ట ఎంతో శ్రమపడసాగెను. మరియొక పక్షి లేచి, "పూర్వకాలములో పొలములలో గడ్డియు కంపయు ఎంతో బలసి యుండెను. ఎవరికంటపడక మేమందరము సుఖముగ దాగి యుంటిమి. ఇప్పుడన్ననో వారు ఇనుపనాగళ్లతో దున్నుట మొదలుపెట్టిరి; పొలములు శుభ్రముగను, చదరముగను ఉన్నవి. పైర్లు పెరుగునపుడు దాగియుండుటకు తగిన ప్రదేశమే లేకు న్నది" అని అనెను. మరియొక పక్షి వచ్చి, "అందుకేమిగాని, ముండ్లచెట్లనన్నిటిని వారు కొట్టివేయుటచేత రాత్రిపూట పండు కొనుటకుకూడ చోటులేకున్నది. గతకాలమే ఎంతో మేలై నది. ఈ సాక్రటీసు ఎక్కడినుండి వచ్చెనోగదా!" అని కూసెను.

మరియొక పక్షి ప్రవేశించి, "ఇనుపనాగళ్లు ఎంత మంచివి? లోతుగ దున్నుటవలన లోపలనుండు పురుగులు పైకివచ్చి

నాకు మరింత ఆహారము దొరకుచున్నది. నేను సంవత్సరము నకు రెండు పర్యాయములు గ్రుడ్లను పెట్టగలిగియున్నాను," అని చెప్పెను.

ఇంతలో ఒక ముండ్లపంది ఏదో గొణుగుకొనుచు అక్కడికి వచ్చి ఈ విధముగ పలుకసాగెను. "నేను చిన్నదాననుగనుండి నప్పుడు ముండ్లపొదలయందు పగలంతయు సుఖముగ కాలక్షేపము చేయుచు రాత్రిపూట పొలములందలి చెఱకుగడలను తినుచుంటిని. ఇప్పుడన్ననో క్రొత్తగ వేయబడు ఈ చెఱకుగడలెంతో గట్టివిగ నుండుటచేత నేను కొరుకలేకున్నాను. ఇంతేగాక రైతులు ఈ పొదలనన్నిటిని కొట్టివేసి పశువులకు కావలసిన గడ్డిని చెట్లను పెంచుచున్నారు. అందుచే నివసించుటకుగూడ నాకు చోటులేకున్నది; తిరిగి తిరిగి తుదకు దూరమందుండు అడవులకు వెళ్లుట తప్పుటలేదు. ఇదుగో అతడిక్కడికే వచ్చుచున్నాడు. మరి ఇచటనుండక వేగిరము పారిపోవలెను."

సాక్రటీసు అప్పుడే అక్కడికివచ్చి, "మంచిది. నీవు చాల అదృష్టవంతురాలవు. ఈ రోజు నేను బల్లెము తెచ్చుటను మరచితిని" అని అనెను.

అందమైన దూడతోకూడ అచట నిలబడియుండిన ఒక చిన్న ఆవు సాక్రటీసు వచ్చుటనుచూచి, "ఏమిటి, ఈ తెలివిలేనివాని మాటలు. అపరిశుభ్రముగనుండు ఈ మనుష్యులు పశువులకన్న మేలైనవారనిగదా చెప్పినాడు! నాకంటె వీరు ఉత్తములా! నన్నూ నా దూడను చూడుడు. ప్రతిదినము నేను నా దూడను పండ్రెండుమార్లు శుభ్రపరచుచున్నాను. మొన్నటి వరకు ఈ మనుష్యులు నెలకొకసారికూడ వారి పిల్లలకు స్నానము

చేయించువారుకారు. ఇదిగాక నా జాతి ఎంత ఉత్కృష్టమై నది. నేను ఒంగోలుజాతిదానను" అని చెప్పెను.

దగ్గర నిలబడియుండిన ఒక ముసలి ఆవు ఆ చిన్న ఆవును పొడిచి, "నోరు మూసికొనుము. నీవు తెలిపిలేనిదానవు. నీవు ఒంగోలుజాతిదానవగుటకు కారణమెరుగుదువా? ఈ సాక్రటీసు గ్రామస్థులందరికి బోధచేయుటచేతనేగదా వారు ఒంగోలు జాతి పశువుల నిచ్చటికి తెప్పించిరి! అతడిచటికి రాకపూర్వము మా స్థితి ఎట్లుండెనో చిన్నదానవగు నీకేమి తెలియును? మా కొట్టము ఇప్పుడు చాల అందముగను, విశాలముగను ఉన్నది. ఇదివరకన్ననో అది చీకటితోను, మురికితోను నిండి ఉండినది; మేము మురికినీరు త్రాగుచుంటిమి; ఎప్పుడోగాని మాకు కడుపు నిండ తిండి దొరకినదిలేదు. ఇప్పుడన్ననో మేము త్రాగు నీరు శుభ్రముగనున్నది; కడుపునిండ ఆహారము దొరకుచున్నది. కావున తెలియనిమాటలు మాటలాడకుము. మన పేడను పిడ కలచేయుట మాన్పి దానినంతయు పొలములలో వేయించిన మహనీయుడు ఈ సాక్రటీసే. ఇందుచేతనేగదా కడుపునిండ ఆహారము మనకిపుడు దొరకుచుండుట. కావున నీవుకూడ నాతో కలసి "సాక్రటీసుకు జై, జై," అని కేకలువేయుము," అని చెప్పెను.

ముసలిగాడిదెకూడ వీరితో చేరి, "హీంహా హీంహా, నా కిప్పుడు మంచి ఆహారము దొరకుచున్నది. పెంటదిబ్బలపై దొరలుటయు ఆహారమునకై పందులతో కలియబడుటయు నాకు తప్పిపోయినది," అని చెప్పెను.

ంయొక్క

మలి అప్పుడా అక్కడికివచ్చి, కూ, కూ, కూ కే
వేయుచు, "ఇదివరకు పెంటదిబ్బలమీద కూర్చుండవలసియు
డెను. ఇప్పుడన్ననో అందమైన ఈ చిన్న ఉద్యానవనములో
విహరించుట కవకాశము కలిగెను. పరిశుభ్రములైనట్టియు, రూ
పంతులైనట్టియు స్త్రీలును పిల్లలును ప్రతి సాయంకాలము నా
ఆహారము పెట్టుచున్నారు," అని చెప్పసాగెను.

PRINTED AT THE DIOCESAN PRESS, MADRAS—1930. A 10046.